

సాహిత్య మాస పత్రిక
మే 1984

# భారతి

కొత్త సీరియల్ నవల

## మృత్యువు

ప్రారంభం

న: శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

వ్యవస్థాపకులు

దేశోద్ధారక

నాగేశ్వరరా

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

మే 1984
సంపుటము : 61

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## మే 1984



ముఖచిత్రం : గణాధిపుడు ( ముఖలింగ శిల్పం )

ఫోటో పంపినవారు : శ్రీ ఐ. కార్తికేయశర్మ

# ప్రథమోదబిందువులు

ఆంబరమున ఏమూలనో
అంబుదశకలమ్ము మొలిచినంతనె మదిలో
సంబరపడిపోవుచు పీ
ఛంబడి కేకినలుగొట్టు దివసములెంతున్.

ధళధళమంచు క్రొమ్మెరుగు తాకిన కన్గవ మూసికొంచు ది
క్కుల కదలించు వారిధరఘుర్ఘురఘోషల కుల్కుచెందుచున్
జలజల జిల్గుముత్యములచొద్పున రాల్ప్రథమోదబిందులన్
తొలకరిప్రొద్దులన్ కడగి తోగినశైశవమున్ స్మరించెదన్

అరకదున్నగను పిలొచు వర్షావారి
ధగధగమెరయు క్షేత్రములనరసి-
తోటలో దొడ్డిలో నాటుకుండనెలేచి
విలసిల్లు వింతమొక్కలనుగాంచి-
తీరమ్ములొరసి యేపారు నీరమ్ముతో
ఘూర్ణిల్లు ఏర్లను కోళ్లదరిసి-
చెరువులో రేయెల్ల కరరవవరరవట్
కట్టని యరచు భేకములదెలిసి-

జల్లువానకు తడిసిమే నల్లనల్ల
రెక్కలు విదుల్చుకొను కాకిదిక్కుచూచి
విమలసంతోషమున పొంగువృష్టినాళ్ల
నెంచి యీనాడు కూడ సంహృష్టిగొందు.

చిటిపొటి చినుకులజడి యొ
క్కటి మొదలై చినికి చినికి గాలియు హెచ్చై
తటుకున నద్దెన పెనుచీ
కటిమయమై తెలియకుండగనెనిసి కదియున్

ఎడపక రేయుంబవలును
జడివట్టినజడిసి గొడుగుచాటున పాంథుల్
తడబడి పోవుటకనుగొన
గొడుగులు తమయంతనడచు కొమరు రహించున్.

కరకలు రాలురండనుచు గాదిలిమిత్రుల నెచ్చరించుచున్
చెరచెర నేరుకోజననొ, చిత్రపురంగులముద్దలై మిణుం
గురులు తమస్సులోన తళుకుల్ వెదచల్లుచు బోవపటుగా

వామనాకృతిదోచి వారిదంబొక్కటి
వినువీధిగ్రమ్ము త్రివిక్రమించి-
ఉన్నయట్లుండి యొక్కుమ్మడి తలపైని
దబదబమోదు అబ్దంబొకండు-
పెళపెళమని శ్రవోభీకరంబుగమ్రోసి
బేలయై యొకమబ్బు తేలిపోవు-
కురియు నిప్డను ఆసగొల్పి మేఘంబొండు
గునగున దూరంపు కొండకేగు-

ఒక్కదినమున నిర్వృష్టి యొక్కనాడు
కుంభవృష్టియు కొన్నాళ్లు కొదమ యెండ
తడుపు వానలుగా ప్రీతిదాత్రియోచు
జరగుపల్లెల నానాటుజలదవేళ.

వాకిటు వట్టోడు వాగునీళులలోన
లలి కాగితంపు తెప్పలను వదలి-
పాండవమధ్యము పదిపేర్లు జపియించి
తతమేఘ గర్జల తరిమికొట్టి-
ప్రొద్దుగ్రుంకకముందె బోసేసి చలికోడి
దుప్పటిలో మేను దూర్పివైచి-
విరతిలేకుండగ కురియుమా బడియుండ
దని వానదేవున కంజలియిడి-

మించు ముసురున కావలెనంచు తడిసి
అచటి కిచటికి పరువెత్తి యనుదినంబు
పనియు తీరకలేన్నిప్రాభవము మీర
గడపితినిశైశవము కారుకాలమందు.

వెలదులు జమ్ముగూడలను వీపులపై వహియించి వానిలో
పొలముల నూడ్చువేళ రవిపోక యెరుంగనిహోళిమై హరి
త్తులు పులకింప పాడు రసధుర్యములైన సుదీర్ఘ పుంబదం
బులు నినదించు నిప్పుడు నమోఘములై నిజకర్ణవీథులన్.

అధిపల్లెటూర నవసీ
రదకాలమునాటి సౌఖ్యరాజ్యంబది నే

# శ ర జ్జా గ ర ము

ఒక్కటొక్కటె రేకుల లెక్కగొనుచు, చెరువులోపల నలనల్ల విరియబారి
కలువపూవులు నీకు స్వాగతముపలికె, నందుకొనుమోయి! మునుముందు చందమామ!

జలధరంబుల బాహుశృంఖలలనుండి, బయలుపడినావు జీవుల భాగ్యవశత
బలిసె దెసలందు శరదర్తువిలసనములు, చంద్ర ! కురియుము ! చంద్రికాసాంద్రవృష్టి

చందనముకంటె ముత్యాలసరముకంటె, కప్పురముకంటె సుమపరాగంబుకంటె
చలువవెదచల్లు నీసితాంశులనుదోగి, రాజ ! పులకించె కాశ్యపీరాజ్యమెల్ల

మునుముందు గిరిశృంగములమీదనందందు, నల్లిబిల్లిగ తీగలలవరించి-
ఉపరి అల్లల్ల మహోర్వీరుహములప, త్రాంతరంబులనుపిండారబోసి-
బోసిపోయిన గృహంబులప్రాంగణములనా, పైరంగవల్లులు పాదుకొలిపి-
వెనుకక్షీరాంభోధివీచికాచయమందు, జగతీతలంబెల్ల జలకమార్చి-
అహమిక రహింపనీతుషారాంశులౌర ! నిలిచికాయుచునున్నవి నేటిరేయి
వేగిరంపడి యీరసావిష్టవేళ, కొలువుచాలింపకుము శరత్కువలయేశ !

శైలశిఖరంబుపై వార్ధిజలముపైని, గుడిసె ముంగిట గుహలోన కోనలోన
సందుగొందుల వెలుగులుచిందినావు, తారకాప్రియ ! బళి ! సహదర్శివీవు !

అక్కడెక్కడొ బహుదూరమందు నీవు, ఇందు! ధరలోన హర్మ్యాగ్రమందునేను
గడచెరెండవయామంబుకానినిన్ను, ఎంతచూచిన తనివోవవేమి కనులు !

శారదశశాంక ! తారకాచయముతోడ, నంబరంబున ముచ్చటులాడుకొనుము !
భూమిపయినేను నీకంఠసీమబూన్ప, మాలికలు గ్రుత్తు భావగీతాలనల్లి !

చాలు చాలును చర్వితచర్వణములు, స్వాపసుఖములు భవము నిస్సారమయ్యె
చంద్ర ! శారద శర్వరీచారువేళ, సలిపెదనుగాక ! నేనింక జాగరములు !

శ్రీ శనగన నరసింహస్వామి

)(—$^0{}_0{}^0$—)(

డాక్టర్ ఘంటా జవహర్‌లాల్

# మహాభారత కాల నిర్ణయం

మహాభారత యుద్ధముగూర్చి తెలియనివారుండరు అది మనకు 'పంచమ వేదం' అయినా మహాభారతము గురించి సరియైన పరిశోధన జరగలేదు. కావున ఇప్పటికీ మనం మహాభారతయుద్ధముపై సరియైన అవగాహనకు రాలేకున్నాం. అసలు మహాభారతయుద్ధం జరిగిందా ? జరిగితే ఎప్పుడు ? ఈ ప్రశ్నలు అపరిష్కృతంగా నిలిచిపోయినవి. అయినా చరిత్రకారులు, పురాతత్వశాస్త్రవేత్తలు, సంస్కృత పండితులు, ఖగోళశాస్త్రవేత్తలు, విద్వాంసులు నిర్విరామంగా ఈ విషయంపై పరిశోధనలు జరుపుతునే ఉన్నారు. ఇటీవల శ్రీ వేదవ్యాస, ఐ. ఏ. యస్‌గారు ఖగోళశాస్త్రాలు పరిశోధించి, మహాభారతకాలం క్రీ పూ. 4. వ శతాబ్దమని నిర్ధారించి 'ఆచార్య' పట్టము పుచ్చుకొన్నట్లు ఏప్రియల్ 88 మాసములో అన్ని ఆంధ్ర వార్తా పత్రికలు ప్రచురించినవి. అదే తుదినిర్ణయంగా భావించరాదు. ఈ సమయం పురస్కరించికొని, చరిత్రకారుల పరిశోధనా సత్యాలు, పండితులభిప్రాయాలను సేకరించి యిచ్చట పొందుపరుస్తున్నాను.

క్రీ పూ. 5 వ శతాబ్దానికి చెందినపాణిని భరతుల య వివరణ కల్గివున్న కారణంగా భారతయుద్ధముగా దీనిని నిర్వహించె కావున మహాభారతం భారతయుద్ధమునే యితిహాసంగా కల్గివు గ్రంథము. పైవివరణ భారతములోనే పొందుపరచివున్నది - 'వ త్వాత్ - భారత్‌త్వాచ్చ - మహాభారత ముచ్యతే ' ఋగ్వేదం భరతజాతి గంగా, యమునా, నదులమధ్యభాగంను పాలించెడి తెల్పుచున్నది ఆ తెగకు సంబంధించిన వారే కురు పాండవు వారి కలహమే భారతగాధగా ఏర్పడింది. అదియే చిన్నకుటు కలహ గాధగా ప్రారంభమై, జయగామారి, జయభారతం భారతేతిహాసంగా మార్పులు చెంది చివరకు మహాభారత రూపు దాల్చి మనముందుకు వచ్చింది అంటే, ఎన్నో మార్పు చేర్పులు, పొంది చివరకు మహాభారతం ఉత్కృష్ట గ్రంధమై నిలిచి ఈ క్రింది వివరణ చూడండి.1

| | కావ్యం పేరు | శ్లోకాల సంఖ్య | కర్త | ఎవరికి చెప్పింది |
|---|---|---|---|---|
| 1. | జయ | 8,800 | వ్యాసుడు | యుధిష్టిరునకు (బహుశః) |
| 2. | జయభారతము | 24,000 (కధనాలు మినహా) | శుకాచార్యుడు | పరీక్షిత్తునకు |
| 3. | భారతేతిహాసము | 24,000 (ఉపాఖ్యానాలు మినహా) | వైశంపాయనుడు | జనమేజయునకు |
| 4. | మహాభారతము | 1,00,000 (ఉపాఖ్యానాలతో) | లోమహర్షనుడు మరియు ఉగ్రశ్రవుడు | శౌనక మహా మునులకు |

పైపట్టిక చూచిన మహాభారతం ఎన్నిమార్పులు, చేర్పులకు లోనై చివరకు ఎట్లు లక్ష శ్లోకాల గ్రంథమైనదో బోధపడుతుంది. అంటే మహాభారతంలో కనిపించింది ఎచ్చటైనా కనిపిస్తుంది, ఇచ్చట లేనిది మరెచ్చటా కనిపించదు 2 ఈ విషయం మహాభారతం చెప్పబడింది కావుననే దీనిని మహాగ్రంథంగా పరిగణిస్తున్నాం. మహాకావ్యం నేటికి విమర్శలకు గురికావటంవిచిత్రాతి విచిత్రం. క్రీ

సన లిపి పరిశోధకులు, డా॥ డి సి సర్కారు గారు 1975 సెప్టెం
సలో 'మహాభారతం అభూతకల్పన' యని ప్రకటించిరి. దానిపై
్రితకారులు, పురావస్తు పరిశోధకులు, సంస్కృతపండితులు,
ోళశాస్త్రవేత్తలు, జ్యోతిశ్శాస్త్రవేత్తలు పరిశోధనలు ప్రారంభించిరి
రి పరిశోధనలలో ఎన్నో విషయాలు వెల్లడైనవి వాటినే యిచ్చట
ిశీలిద్దాం.

మొదటగా డా॥ డి. సి సర్కారు గారి వాదన[3] "అసలు
హాభారత యుద్ధము మనకు ప్రస్తుతం తెలుస్తున్నంత ఉత్కృష్టంగా
ిగలేదు. అది అసలు మహాసంగ్రామంకానేకాదు అసలు జరిగితే అది
ే చిన్న కుటుంబతగాదే గాని, సంగ్రామంగాదు మహాయుద్ధం అసలే
ు మహాభారత యుద్ధం వేదాలలో అసలు తెలుపబడలేదు అసలు
హాభారత యుద్ధం వునికి ప్రాచీన మానవులకే తెలియదు తెలిసివున్న
ో రూపంలో మనకు అందింపబడి వుండేది భారత యుద్ధం గురించి
. పూ. నాల్గవ శతాబ్దానికి ముందు మన సాహిత్యానికి తెలియదు.
ంటే భారత యుద్ధం క్రీ పూ నాల్గవ శతాబ్దం తర్వాతనే సాహిత్యంలో
టుచేసుకుంది. మహాభారతంలో చెప్పబడిన 'కురుక్షేత్రం' వేదాలలో
రత యుద్ధ కేంద్రముగా తెల్పలేదు మహాభారతంలో వివరించిన
ులు, రాజ్యాలు, కథనాలు, పరిశీలించితే, అసలు భారత యుద్ధం
ించి నాటి ప్రజలకే సరియైన అవగాహన లేదని బోధపడుతుంది.
హాభారతంలోని కథనాలను పరిశీలిస్తే ఒకదానికి మరియొక దానికి
ంతనలేదు. భగదత్తుడు ప్రాగ్జ్యోతిష రాజు ప్రాగ్జ్యోతిషను యిప్పటి
స్సాం' గా చరిత్రకారులు గుర్తించిరి మహాభారత యుద్ధంలో భాగ
్తుడు ముఖ్యవ్యక్తి అటువంటి వ్యక్తి వునికి గురించి వేదసాహిత్యంలో
బడక పోవుట గమనార్హము పైగా భారత యుద్ధం వివరణ పరిశీలిస్తే
త సైన్యం పట్టిగల విస్తీర్ణం ప్రాచీనకాలంలో వున్నదంటే నమ్మ
్యంగాదు భారత యుద్ధంలో పాల్గొన్న సైన్యం ఏడునుండి పదకొండు
ౌణులు యుద్ధంలో ఒక 'అక్షౌణీ' అనగా 21,870 యుద్ధ
ాలు, 21,870 ఏనుగులు, 65,610 గుర్రాలు, 109,350 కాల్బ
ు. ఇది పరిశీలించిన కవిచాతుర్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది
రగా డా॥ సర్కారుగారు ముగిస్తూ మహాభారతంలో వివరించిన
్విజయాలు, రాజ్యాలు పురాణ కథలు అన్నియూ కల్పితాలే"
ిరి.

ప్రముఖ పురాతత్వ శాస్త్రవేత్త డా॥శంకాలయ్యగారు[4] సర్కారు
ి వాదనను సమర్థించిరి. మహాభారతంలో ఇనుపాయుధాలు
ృలంగా వాడినట్లు తెలుస్తుంది. కాని మనదేశంలో ఇనుపాయు
ు క్రీ. పూ. 6 వ శతాబ్దానికి ముందు వాడుకలోలేనట్లు పురావస్తు
్యకాలను బట్టి తెలుస్తుంది. కావున మహాభారతంలోగల వర్ణనలు
పరిశీలిస్తే దాని ప్రాచీనత్వం క్రీ.శ 5 వ. శతాబ్దానికి దాటదు. కావున
"పురాతత్వశాస్త్రాధారంతో పరిశీలిస్తే మహాభారత యుద్ధం కల్పితమే"
అనిరి.

పై పురాతత్వ శాస్త్రవేత్తలకు వ్యతిరేకంగా పెక్కు విమర్శలు
వెలువడినవి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని తెల్సుకొందాము. మొదటగా
ప్రఖ్యాత చారిత్రక పరిశోధకులు డా॥ వాసుదేవ విష్ణుమిరాశీ గారి
వాదన విందాము. "భారతీయులకు మహాభారతము మహాకావ్యం
చారిత్రక సంపుటము వేదాలలో మహాభారత వునికి వుల్లేఖించ లేదను
టకు, మిరాశీగారు[5] వేదాలు ముఖ్యంగా మతపరంగా వ్రాయబడినవి.
వాటిలో చారిత్రక విషయాలు వుల్లేఖించకపోవటం విడ్డూరం గాదు.
ముఖ్యంగా మత పరంగా వ్రాసిన వేదాలలో యుద్ధాల గురించి వివ
రణ వెదుకుట అవివేకం ఏలయన మనమురెండు ప్రపంచ యుద్ధాలు
చూశాము వాటిగురించి వివరణ ఈ కాలంలో వ్రాసిన గ్రంథాలన్నిటిలో
మనకు గానరాదు. అట్లే నాటి మహాభారత యుద్ధ వివరణ వేదాలల్లో
లేకపోవుట చూచి అసలు మహాభారత సంగ్రామం జరగలేదనుట అవి
వేకం పైగా వేదాల కాలం నాటి చారిత్రక సత్యాలు మనకు తెలియ
కున్నవి ఇక డా॥ సర్కారుగారి వాదనకు (మహాభారత యుద్ధముపై
చరిత్రకారులు వివిధ కాలములలో జరిగినదని చెప్పుచున్నారు.
వారిలో ఎవరూ ఏకాభిప్రాయానికి రాలేక పోయారు) సమాధానంగా
డా॥ మిరాశీగారు 'మనకు ప్రాచీన చరిత్ర సంపూర్ణంగా తెలియకున్నది.
అందుచే ఏకాభిప్రాయానికి రాలేక పోతున్నాము దాని మూలంగా
మహాభారత యుద్ధం జరుగలేదనుట వివేకం గానేరదు' యని చెప్పుచూ
మనకు శాతవాహనుల చరిత్ర సంపూర్ణంగా పురావస్తువులను బట్టి
శాసనాలను బట్టి, పురాణాలు బట్టి తెలుస్తుంది. అయినా చరిత్రకారులు
శాతవాహనుల కాలంపై ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నారు. దానిని
బట్టి అసలు శాతవాహనుల చరిత్ర పుక్కిట పురాణం అనవచ్చునా ?
అట్లే మహాభారత చరిత్ర కూడా. ఇక వారి వాదనకు అనుకూలంగా
డా॥ మిరాశీగారు భారతయుద్ధంలో పాల్గొన్న వీరుల వివరణ వివ
రించిరి. యజుర్వేదంలో గల "కథా సంహితము" (VIII, 3, 95) లో
విచిత్ర వీర్యుని కొడుకు ధృతరాష్ట్రునిగా పేర్కొన బడింది అట్లే
అథర్వణవేదంలో పరీక్షితుని పరిపాలన గురించి వుల్లేఖించబడింది.
"చాందోగ్య వుపనిషత్తు" (III, 17, 6) లో కృష్ణుడు దేవకి పుత్రు
డుగా తెల్పబడింది క్రీ. పూ 5వ శతాబ్దానికి చెందిన పాణిని కృష్ణా
ర్జునుల భక్తులను (IV, 3 98) పేర్కొన్నాడు. వైశంపాయనుడు
మహాభారత కర్తగా పాణినికి తెల్సు. ఏలయన వైశంపాయనుని
మహాభారతాచార్యునిగా పాణిని పేర్కొన్నాడు. మహాభారతయుద్ధం
చరిత్రసమ్మతమేగాని కల్పితం గాదని డా॥ మిరాశీగారు ముగించిరి.
లేటు డా॥ మంజుదారుగారు[6] మిరాశీగారి వాదనను బల పరచిరి.

డా॥ దత్తా మరియు పద్కే గారలు[7] మహాభారతయుద్ధం క్రీ. పూ. 6వ శతాబ్దానికి ముందు జరిగి వుండునని నమ్ముచున్నారు. "సాంఖాయన శ్రౌత సూత్రము" (క్రీ. పూ. 600) కౌరవులు కురుక్షేత్రము నుండి తరిమివేయబడిరని తెల్పుచున్నది. పైగా క్రీ శ. 7వ శతాబ్దంలో కురుక్షేత్రము సందర్శించిన హ్యూయాన్‌సాంగ్' పూర్వకాలంలో జరిగిన గొప్ప సంగ్రామము నకు గుర్తుగా యింకనూ కురుక్షేత్రం ఎముకలకుప్పలతో నిండివున్నదని తెల్పెను ఇక డా॥ శంకాలియ చెప్పినట్లు గాక ఇనుము ఋగ్వేదము నాటికే వాడుకలో నున్నది ఋగ్వేదములో ఇనుపాయుధములు (అయస) వునికి వున్నది "పురాచరిశ్మ" యనే ఇనుప యంత్రము కోటల విధ్వంసకారిగా వేదాలలో పేర్కొనబడింది కావున భారతయుద్ధంలో ఇనుపాయుధములు వాడుటలో విడ్డూరంలేదు అనివారు డా॥ శంకాలియగారి వాదనను త్రోసి పుచ్చిరి.

ఇక డా॥ వి సి. పాండేగారు 8 మహాభారత యుద్ధము చరిత్ర సమ్మతమని నమ్ముచూ మహాభారత యుద్ధము పుక్కిట పురాణం అయితే యిప్పటికి మహాభారత యుద్ధములో తెల్పిన స్థలాలు వీరలు మనకు పుణ్యక్షేత్రాలుగా, ఆరాధ్యదైవాలుగా నిల్చిపోవటంలో గల ఔచిత్యం ఏమిటి? యని సూటిగా ప్రశ్నించిరి మహాభారతము గురించి పౌరాణిక గ్రంథాలు, బౌద్ధ, జైన, గ్రంథాలు, తెల్పుచున్నవి పురాణాలాధారంగా డా॥ పాండేగారు మహాభారతయుద్ధం క్రీ. పూ 1200 - 1000 మధ్యకాలంలో జరిగివుండునని భావించుచున్నారు పురాణాలాధారంగా మహాభారత యుద్ధకాలానికి "మనువైవస్వతుని"కు మధ్య 95 తరాల కాలవ్యవధి వున్నట్లు తెలుస్తుంది "మనువైవస్వతుడు" క్రీ పూ 3100 ప్రాంతానికి చెందిన వాడని చరిత్రకారుల నమ్మిక ఇక తరానికి 20 సంవత్సరములకాలం కేటాయించి చూచిన 95 తరాలకు (3100 - 95 × 20=) క్రీ పూ 1200 అదియే మహాభారత యుద్ధం జరిగిన సంవత్సరము డా॥ పాండేగారు మరో విధంగా కూడ పరిశీలించారు పురాణాలు, చంద్రగుప్తమౌర్యుడు యుధిష్ఠురునకు 36 తరాల తదుపరి వాడుగా పేర్కొనుచున్నవి చంద్రగుప్త మౌర్యుడు క్రీ పూ 322 ప్రాంతం వాడని చరిత్రకారుల నమ్మిక తరానికి 20, సంవత్సరములు కేటాయించిన 36 తరాలకు (36 × 20=) 720 సంవత్సరములు అయిన యుధిష్టురుడు (322 + 720=) క్రీ పూ 1042 ప్రాంతం వాడని తెలియుచున్నది. పై వివరణల మూలంగా మహాభారతయుద్ధం క్రీ. పూ 1200 - 1000 మధ్య ప్రాంతములో జరిగి వుండవచ్చునని బోధపడుచున్నది ఇక ఖగోళ, జ్యోతిశ్శాస్త్రవేత్తల వుద్దేశ్యం చూద్దాం 9 శ్రీయుతులు బి వి. రామన్, కె సి. వర్మ, యస్ బి రాయి మొదలగు వారందరూ మహాభారతయుద్ధం కల్పితగాధ కాదని పేర్కొనిరి. మొదటగా శ్రీ. బి. వి. రామన్‌గారు. 10 ఖగోళసిద్ధాంతరీత్యా కలియుగ ప్రారంభానికి 37 సంవత్సరాలకు ముందుగా భారతయుద్ధం జరిగినదని పేర్కొనిరి వారి వాదన ప్రకారం కలియుగం క్రీ. పూ. 3102 సంవత్సరం ప్రారంభం కాగా క్రీ. పూ (3102 - 37=) 3065 వ సంవత్సరం మహాభారత యుద్ధం జరిగిందని తెలుస్తుంది. మహాభారతంలో "మౌసలాపర్వం" లో శ్రీకృష్ణ నిర్యాణం మహాభారత యుద్ధం జరి 36 సంవత్సరాలకు జరిగినట్లు పేర్కొనబడింది. అయిన క్రీ ష (3102 - 36=) 3066 వ సంవత్సరంలో భారతయుద్ధం జరిగియుం వచ్చునని వివరించిరి. మిగిలిన ఖగోళశాస్త్రవేత్తలు భారతయుద్ధ క్రీ. పూ. 1400 - 1424 మధ్య కాలంలో జరిగివుండవచ్చున పేర్కొనిరి వారి వాదనప్రకారం "సూత్రసారస్వతము" భార యుద్ధం జరిగిన తదుపరి వ్రాయబడినవి ఆశ్వలయణుడు క్రీ పూ 1388 ప్రాంతంలో జన్మించెను. కావున ఆశ్వలాయణ సూత్రా క్రీ. పూ 1300 ప్రాంతంలో వ్రాయబడినవి ఇది ఖగోళసిద్ధాం రీత్యా ధృవీకరింపబడింది అయిన మహాభారత యుద్ధం క్రీ పూ 1400 సంవత్సరానికి ముందు జరిగివుండవచ్చునని పేర్కొన్నారు.[1] ఈ విధంగా ఖగోళశాస్త్రపండితులు, జ్యోతి శ్శాస్త్రవేత్తలు భార యుద్ధం జరిగినట్లు ధృవీకరించిరి. కాని వారొసగిన భారతయు కాలాల్లో మాత్రం బేధాలున్నవి.

ఉత్తర ప్రదేశ్‌లోనున్న "విదుర సేవాశ్రమము" జరిపి గోష్టిలో, సంస్కృత, వేద పండితులు పాల్గొనిరి. వారును మహాభార యుద్ధం జరిగినట్లు సుదీర్ఘోపన్యాసాలుచేసిరి. ముఖ్యంగా ఉపనిషత్తులలో పేర్కొన్న భారత వీరుల వుల్లేఖనాలపై ఆధారపడి క్రీ పూ. 300 సంవత్సరంలో భారత యుద్ధం జరిగి నట్లు వారూహించారు. ప్రఖ్యా చరిత్రకారుడు లలంజి గోపాలుగారు -మహాభారత యుద్ధం గౌతమ బుద్ధుడు జన్మించక ముందే జరిగినట్లు ప్రాచీన చరిత్ర తెల్పుచున్నది పురాణాలలో తెల్పిన రాజుల వంశవృక్షాలను పరీక్షించిచూడగా క్రీ. పూ 1000-900 మధ్యకాలంలో భారత యుద్ధం జరిగి వుండవచ్చునని తెల్పిరి [12]

ఇటీవల ప్రఖ్యాత పురాతత్వవేత్త డా॥ బి. బి లాల్‌గారు మహాభారతవిమర్శపై దృష్టికేంద్రీకరించి మహాభారతంలో పేర్కొన్న స్థలాల్లో త్రవ్వకాలు చేబట్టిరి వారి పరిశోధనలను చూద్దాం మనకులభ్యమైన భారతగ్రంథంలో గ్రీకుల గురించి[13], రోమనుల గురించి చివరకు హూణులగురించి ప్రస్తావనలుండటచే మనకు లభ్యమౌతున్న మహాభారతకథనం పూర్తిగా ప్రాచీనకాలం నాటిది కానేరదనితెలుస్తుంది సహజంగా మహాభారతంలో పేర్కొన్న స్థలాలు- 'హస్తినాపురం (మీరట్ జిల్లా, ఉత్తర ప్రదేశ్) ఇది కౌరవులకు రాజధాని. వార్ణావతము

ర్నావా, మీరట్ జిల్లా) ఇచ్చటనే కౌరవులు పాండవులను లక్క యిం లో సజీవ దహనం చేయాలని తలంచిరి. విరాట నగరం (బైరాటం, క్షపూరు జిల్లా, రాజస్థాను) ఇచ్చటనే పాండవులు అజ్ఞాత వాసం చేసిరి. ాణిప్రష్టము (పానిపట్టు, హర్యానా) వృకప్రష్టము (బాఘపట్, ిరట్ జిల్లా) ఇంద్రప్రస్తము (పురానకోట, ఢిల్లీ) ఇక కురుక్షేత్రం హర్యానా) మధురా (ఉత్తర ప్రదేశ్). డా॥ లాల్ పై పేర్కొన్న ్లాల్లో త్రవ్వకాలు జరిపిరి అన్నిటిలోను. ఆఖరి వరుస (లేయర్)లో ్యమైన పురావస్తువులు పరికించిచూచిన ఒకే సంస్కృతి బయల్పడింది ినగా అన్నియూ ఒకే జాతివార్ని అంటే కురు-పాండవుల నాగరికతనే ల్లడిచేయుచున్నవి. వారివృత్తి ముఖ్యంగా వ్యవసాయం, పశుపోషణ శువులు, గొఱ్ఱెలు, పందులు, గుఱ్ఱములు వీరికి పెంపుడు జంతువులు, ంటిగోడలు మట్టితో కట్టబడినవి.

అక్కడక్కడ కాల్చిన ఇటుకలు వాడినట్లు తెలుస్తుంది.రాగిసామా ులు, ఇనుప పనిముట్లు విరివిగావాడెడివారు. వేట వారివినోదక్రీడ. ాగళ్ళు,కొడవళ్ళు,వ్యవసాయానికి,గొడ్డళ్ళు,ఈటెలు,కత్తులు,బాణములు యుద్ధానికి వాడెడివారు. గ్లాసులు, గాజులు, నిడుపుబాటు (అబ్లాంగ్) ావున్న గవ్వలు ప్రప్రథమంగా ఇచ్చటనే దొరికినవి. అనగా జూదం కూడ వారికి వినోదక్రీడ పాత్రలు అన్నియు మట్టితో తయారుచేసినవే. కోణపళ్లెం, చెంబు, గిన్నెలు దొరికినవి. ఒకరకమైన ఎఱుపు, పసుపు రంగుల మిశ్రమ (ఓకర్- కలర్) మట్టితోచేయబడిన మృణ్మయ పాత్రలు కురు- పాండవుల నాగరికతకు చిహ్నంగా డా॥ లాల్‌గారు పేర్కొన్నారు. ఇక బూడిదరంగు వర్ణచిత్రములు (పెయింటెడ్ - గ్రే - వేర్) గలమట్టి పాత్రలు విరివిగా వాడుకలో నున్నవి ఇది ఈ ప్రజల సంస్కృతికి సంకేతం.

ఇక "మత్స్యపురాణం" (50, 57, 65, 66, 78 - 79) మరియు "వాయు పురాణం' (99, 249, 250, 256-258) బట్టి హస్తినాపురం గంగానది వరదల్లో మునిగినపుడు నిచక్షు మహారాజు (పాండువంశములో 6వ తరానికి చెందినవాడు) తన రాజధానిని హస్తినాపురం నుండి కౌశాంబికకు మార్చినట్లు తెలుస్తుంది. ఈ విషయం గూడా హస్తినాపురం త్రవ్వకాలల్లో బయల్పడింది. డా॥ యస్. ఆర్. రావుగారి 'ద్వారక' త్రవ్వకాలలో గూడా యీ విషయం స్పష్టమైనది.

ఏలయన హస్తినాపురంలో 2½ మీటర్ల లోతుల్లో 'పెయింటెడ్-గ్రే -వేర్ కల్చర్' గంగానది నీళ్ళ వలన నాశనమైనట్లు పూర్తిగా తెలు స్తుంది అట్లే కౌశాంబి (అలహాబాద్, ఉత్తరప్రదేశ్) త్రవ్వకాలలో పై సంస్కృతి కల్చర్‌కి సంబంధించిన పాత్రలు బయల్పడినవి ఇచ్చట దొరికినవి హస్తినాపురంలో దొరికిన వాటికన్న కొంచెం 'ముతక' గా నున్నవి. కావున మహాభారతంలో పేర్కొన్నస్థలాల్లో అన్నిటిలోను ఆఖరిపొర (లేయర్) ల్లో ఒకే సంస్కృతి బయటపడుటచే అది కురు-పాండవుల సంస్కృతిగా పురాతత్వ శాస్త్రవేత్త డా॥ లాల్ పరిగణించిరి అనగా మహాభారతయుద్ధం కల్పితం గాదని పై త్రవ్వకాల బట్టి తెలుస్తుంది

ఇకపై త్రవ్వకాల బట్టి యుద్ధ కాలం పరిశీలిద్దాం. ఇప్పటి వరకు క్రీ. పూ 3000, 1424, 1400. 1200-1000, 950 సంవత్సరములు భారత యుద్ధకాలంగా వివిధ శాస్త్రవేత్తలు వేర్వేరుగా నిర్ణయించిరి

మొదట పురాణ సత్యాలు చూద్దాం. అభిమన్యుడు యుద్ధ భూమిలో మరణించిన తదుపరి తన కుమారుడు, పరీక్షితుడు యుధి ష్ఠురుని తర్వాత రాజ్యానికివచ్చెను. పురాణవంశ క్రమమును బట్టి పరీక్షితునికి 5 తరాల తర్వాత 'నిచక్షుడు' రాజ్యానికొచ్చెను ఇతని కాలంలోనే హస్తినాపురం గంగానది వరదల్లో మునిగిపోయింది. తదుపరి కౌశాంబికకు రాజధానిని మార్చింది ఈతడే. కౌశాంబికను పాలించిన రాజుల వంశక్రమములు పరీక్షించిన ఉదయనుడు, పరీక్షితు నికి 25 వ తరంవాడు ఈ ఉదయనుడు బుద్ధునికి సమకాలికుడుగా చారిత్రకులు పేర్కొన్నారు అనగా ఉదయనుడు సుమారు క్రీ పూ. 500 ప్రాంతం వాడని గ్రహించవచ్చును. ఇచ్చట డా॥ లాల్ ప్రాచీన రాజులైన కణ్వులు, శుంగులు, గుప్తుల జీవితకాలాలను పరీక్షించి. కురు పాండవుల కాలంలో తరానికి 14 సంవత్సరములు మాత్రమే కేటాయించారు అయిన ఉదయనునికి ముందు 24 తరాల రాజుల కాలం (24 × 14=) 336. దీనికి ఉదయనుని కాలం క్రీ పూ. 500 కల్పితే వచ్చినది. భారత యుద్ధకాలం (క్రీ. పూ. 836) గా డా॥ లాల్‌గారు పేర్కొన్నారు ఇది పురాణాల మూలంగా తెల్సిన విషయం.

పై చెప్పినట్లు మహాభారతంలో పేర్కొనబడిన స్థలాల్లో 'పెయింటెడ్ - గ్రే - వేర్ కల్చర్' బయల్పడినదని తెల్సుకొన్నాం. ఆ 'పెయింటెడ్ - గ్రే - వేర్' 'కార్బన్ - 14 వ పద్ధతిని క్రీ.పూ. 1025 + 100 మరియు క్రీ పూ. 820 + 225 ప్రాంతానికి చెందినదని తెలియవచ్చింది అనగా ఆ 'పెయింటెడ్ - గ్రే - వేర్' సంస్కృతి క్రీ పూ. 1000 సంవత్సరముల ముందునాటిదని గ్రహించ వలెను. ఇక శ్రావస్తి (గోండాజిల్లా ఉత్తర ప్రదేశ్) అహిచ్ఛత్ర, అత్రంజిఖెరా (ఉత్తర ప్రదేశ్) లో త్రవ్విన త్రవ్వకాలలో యీ 'పెయింటెడ్ - గ్రే - వేర్' నార్తరన్ - బ్లాక్ - పోలిష్డు - వేర్‌తో దొరికింది 'నార్తరన్ - బ్లాక్ - పోలిష్డు - వేర్ క్రీ. పూ. 500 కాలాన్కి సంబంధించినదని కార్బన్ - 14 పద్ధతి ప్రకారం వెల్లడైంది.

కావున 'పెయింటెడ్ - గ్రే - వేర్ సంస్కృతి క్రీ.పూ. 1000-500 మధ్య కాలానికి చెందినదని డా॥ లాల్‌గారు పేర్కొన్నారు. కావున డా॥ లాల్‌గారు పురాణాలాధారంతోనూ, పురావస్తు త్రవ్వకాలనుబట్టి మహాభారత యుద్ధం క్రీ. పూ. 9 వ శతాబ్దంలో సంభవించి యుండ వచ్చునని తెల్పిరి.

మహాభారతం గురించి యిప్పటికి రెండు శిలా శాసనాలలో వుల్లేఖించబడింది. క్రీ. శ. 5వ శతాబ్దానికి చెందిన వాకాటరాజగు దేవ సేనుని 'హిస్సా బోర్లా శిలాశాసనం[14] తదుపరి పశ్చిమ చాళుక్య రాజగు రెండవ పులకేశి 'ఐహోలి' శిలాశాసనం పై రెండు శిలాశాసనా లాధారంగా క్రీ పూ. 3101 ప్రాంతంలో మహాభారత సంగ్రామము జరిగినట్లు బోధపడుతుంది. కాని చారిత్రికులు పై శాసనాలలో పొందు పరచిన భారత సంఘటనలు పరిగణనలోనికి తీసుకోలేదు. అయినా మహాభారత వృత్తాంతము శిలాశాసనాలలో పొందుపరచుట గమనించ వలసిన విషయం. పై వాదనలు బట్టి మహాభారతగాథ కల్పితము గాదని రూఢిగా తెలుస్తుంది. ఇక భారతయుద్ధ కాలంపై పలువిధాలు పరిశో ధించి పెక్కు తారీఖులు తెలియపరచిరి. కాని క్రీ. పూ. 1200-1000 మధ్యకాలంలో భారత సంగ్రామము జరిగి వుండవచ్చునని డా॥ యస్. పి. గుప్తగారు వివరించిరి. అదియే సమంజసముగా తోస్తుంది.

## పరిశీలించిన గ్రంథాలు, వ్యాసముల పట్టిక

1. ఆర్. వి. వైద్యా : మహాభారతసిద్ధాంత వ్యాసం, పుట - 11
2. యస్. పి. గుప్తా మరియు కె యస్. రామచంద్రన్ (సం) మహాభారతం - మిత్ ఆర్ రియాలిటీ, పుట - 4
3. "యితి హ స్తిత ధన్యత్న। యన్నేహ స్తి - నతత్వచితే
   అదే : పుటలు 140 - 141
4. అదే : పుటలు 142 - 147
5. అదే : పుటలు 180 - 183
6. అదే : పుటలు 176 - 179
7. అదే : పుటలు 8 - 9
8. అదే : పుటలు 183 - 188
9. వివరంగా తెల్సుకోగోరేవారు పై గ్రంథం, పుటలు 81 - 1 పరిశీలించవలెను.
10. అదే : పుట 18
11. అదే : పుటలు 15 - 16
12. అదే పుటలు 13 - 14
13. అదే : పుటలు 52 - 60. మరియు ఏనిష ఇండియా సంపుటాలు 10, 11 పుటలు 147 - 151
14. డా॥ మిరాశి " ఫెలిసిటేషన్ " సంపుటం పుట. ! మరియు ఎ పి గ్రా ఫి యా ఇం డి కా, సంపుటం, పార్టు -1, పుట - 1
15. ఎపిగ్రాఫియా ఇండికా. సంపుటం, 6, పుట - 1 నుండి.

౧౧

# మహాశూన్యం

## శ్రీ శిఖామణి

ఒక్కోసారి నేను మహానదినైపోతాను
అప్పుడు, అప్పుడప్పుడూ ఒకటీ అరా
కలలనౌకలు నిశ్శబ్దంగా నామీదినుండి జారుకుంటూ
నన్ను రెండుగాచీల్చుకుంటూ...... .........
ఆవెనకే నేను మళ్లీ ఒక్కటైపోతుంటాను.
ఉండి ఉండి దూరం అయిపోతాయి నౌకలు.
ఇక్కడిక్కడే తిరుగాడినట్టుండి
ఎక్కడెక్కడికో వెళ్లిపోతాయి.
చివరికి తెరచాప చివరనున్న
జెండాకూడా కనిపించదు
ప్రవహించి, ప్రవహించి, నాలోనేనుసుళ్లుతిరిగి
పిచ్చెత్తినట్టు, చిన్నపిల్లాడిలా
అలలచేతులు ఊపుకుంటూ
సుషుప్తి సముద్రంలో కలసిపోయి
నాఉనికిని పోగొట్టేసుకుంటాను.
నన్ను నేను పోగొట్టుకోవడంలో గొప్పతృప్తి
ఒక్కోసారి నేను
మహారణ్యాన్ని అయిపోతాను
ఎంతదూరంనడిచినా
మొదలేగాని చివరదొరకని ఆలోచనల మహావృక్షాలు
ఎక్కడో రెండుకొమ్మల రాపిడికి అగ్నిపుట్టి
నాలోనేను దహించుకుపోయి .......
ఈలోగా పెద్ద భూకంపం
సజీవసమాధిలో ఉన్న యోగిలా
భూమి పొరల్లో రాక్షసబొగ్గునైపోతాను
మరగకాచిన నీళ్లలో సైతం
నిప్పును ఆర్పేగుణం ఉన్నట్టు
దహించుకు పోయినా నాలో
సహనగుణం దాగునేఉంది
ఒక్కోసారి నేను భూమినైపోతాను
ఒకవానచినుకు పడి నాలోదాగున్న
ఏవిత్తనమో తడిసి, నాని, ఉబ్బి
తనకు తానుగా పగిలి
నన్ను పగులగొట్టుకుంటూ పైకివస్తుంది
అప్పుడు బిడ్డకు స్తన్యమిచ్చిన
తల్లిలాసంబరపడి పోతాను
ఏనాగలికట్టో నన్ను పాయ పాయలుగా
చీల్చేస్తూ నాలోంచిదూసుకు పోతున్నప్పుడు
రేపు నామీద పల్లవించబోయే పసరికను
గుర్తుచేసుకుని అంతబాధనూ
నిండుహర్షంతో అనుభవించేస్తాను
ఒక్కోసారి నేను అగ్నినైపోతాను
అప్పుడు అంతటానేనే
నీటిలోను - నింగిలోను
అడవిలోను - అగాథాల్లోను
బాడబమై - దావానలమై
హోమంలోను - కామంలోను
పుట్టుకకు - వినాశానికి - నేనే
అప్పుడునేనుచేసేది అగ్నిగానం
అప్పుడునేనుచేసేది అగ్నిస్నానం
నేనుధరించేది అనలకిరీటం
కాంతి పాదాలతో నడిచినంతమేర
వెలుగులోకానికి పొలిమేర
ఒక్కోసారి నేను ఆకాశాన్ని
మహాశూన్యాన్ని అయిపోతాను
ఎంతఎత్తుకుచూసినా
ఎంతక్రిందికిచూసినా అంతాలోతే
ఎక్కడినుండి వచ్చి - ఎక్కడికి వెళ్తున్నాన్నేను?
ఎంతగుర్తిద్దామన్నా జీవితంగ్రాఫులో
జనన మరణరేఖలు స్పర్శించిన బిందువు
కనిపించడంలేదు.
శూన్యంగా ఉన్నప్పుడు
వెలుతురూ చీకటి ఒక్కలాగేతోస్తాయి.
సంతోషానికి దుఃఖానికిమధ్య
సరిహద్దురేఖలు చెరిగిపోతాయి
దిగంతరేఖలా నాకునేను కన్పిస్తున్నట్టేకన్పించి
నాకునేనే అదృశ్యమైపోతుంటాను.
నన్ను నేను తెలుసుకున్నట్టు భ్రమించి
నన్ను నేనుకోల్పోతుంటాను.




పట్నం పడమట శివార్లలో ఉంది. పురపాలకసంఘం వారి రహదారి బంగళా ఆ బంగళావరకూ ఉదయం లేవగానే వెళ్ళి రావడంతో నా దినచర్య మొదలౌతుంది

బంగళాకి కాస్త ముందురోడ్డు ప్రక్కన ఓ పెద్ద చింతచెట్టు ఉంది ఆ చెట్టుక్రింద రెండు రోజులుగా ఒక మనిషి కూచుని అట్ట ముక్కలు కత్తిరిస్తూ కనబడుతున్నాడు

నేనతన్ని గమనించినా అతని ముఖం తేరిపార మూడవరోజు కాని చూడలేదు

మొదటిరోజు ఎవడో బిచ్చగాడనుకున్నాను రెండవరోజు పిచ్చివాడనుకున్నాను కొద్ది సెకండ్లపాటే అతన్ని చూశానేమో అంతకంటె మరేం ఊహించలేకపోయాను మూడవరోజు అతను వెదురు పుల్లలు చీరుతుండడమూ చూశాను అతని పక్క ఒక పెద్దసంచి ఉంది.

బజారుకు పాపకు తీసుకుని వెళ్ళడానికి కావలసినవి కొన్నాను తిరిగి వచ్చేస్తూవుంటే సైకిల్ క్యారియర్‌మీద కూచున్న పాప నన్ను పిలిచింది.

"ఆ బొమ్మకొనరూ! ఎంతో ఉండదు. ఓ పావలా ఉంటుదేమో!"

పిల్లలకి కూడా ఈ రోజుల్లో ఏ వస్తువు ఎంత ఖరీదు ఉంటుం తెలుస్తోంది నా కయితే...అసలు ఆ రోజుల్లో మా వయసువాళె రికీ ఈ రోజుల్లో పాప వయసులో ఏమీ తెలిసేది కాదు.

సైకిలు దిగి వెనక్కి వెళ్లాను.

ఆ బొమ్మలమ్మే అతన్ని ఎక్కడో చూసినట్టనిపించింది

"తాతా! ఈబొమ్మ ఎంత?"

నా ఆలోచనలో నేనుండగా పాప అతన్నడిగింది

"బావుందామ్మా?! ఇంద!" అంటూ అతను బొమ్మనె దాన్ని పాపచేతి కందించాడు.

-రక్కున జ్ఞాపకం వచ్చింది రహదారి బంగళా ముం చింతచెట్టు క్రింద ఆసామీని నేను చూసిన విషయం

"నాన్న! డబ్బులు!"

నేనతని ముఖం వంకచూస్తూ ఉంటే పాపాయి నాచెయ్యి ప కొని లాగింది.

"ఎంతయ్యా అది?"-నేనతని కళ్లలోకి చూస్తూ అడిగాన అతని ముఖంలో ఏదో ఆనందం. ఇవ్వక్కరలేదు బాబు!" అనేశా తను "ఏది పాపా..." దాని బుగ్గమీద చెయ్యివెయ్యబోయాడ అది చటుక్కున ముందుకు పారిపోయింది అతన్ని తప్పించుకు

ననతనికి పావలా అందించి ముందుకు నడిచాను. సైకిలెక్కి తుతూఉంటే వెనక నుంచి పాప బొమ్మతో ఆడుకుంటోంది. చూశారా ఎంతబాగా చేతులు, కాళ్లు, ఊపుతుందో..." వెదురుపుల్లకు ట్టలు కత్తిరించిన కాళ్లూ, చేతులు. ముఖమూ దారంతో కట్టిన బొమ్మను డిస్తోంది. వెనక్కి తిరిగి చూశాను. ముచ్చటగా భంగిమలు పెడు ాంది బొమ్మ.

ఏదోజ్ఞాపకం వచ్చింది. సైకిలుకంటె వందవేల రెట్ల వేగంతో ామనసు గతంలోకి పరిగెడుతోంది.

నేను ఆమనిషిని చూశాను... ఎక్కడో.. ఎప్పుడో మనసు దుకుతోంది. గుర్తుకి రావడంలేదు...

రాత్రి సగం నిద్రలో చటుక్కున మెలకువవచ్చింది.

అతను రామంబాబాయి... నిస్సందేహంగా రామంబాబాయే! యిమ్మాటికీ రామంబాబాయే.

రామం బాబాయి పెద్ద లాయరుకదా . మరి ఇలా ...? ా ఆలోచన తెగకుండా తీగ సాగిపోయింది. కేవలం మనిషిని పోలిన ునిషేమో!

నాలుగున్నరకే బాహ్యానికి బయలుదేర బోయాను.

"టైమెంతయిందండీ, ఇంత తొందరగా లేచిపోయారు?" ంటూ పక్కకి తిరిగి పడుకుంది నా భార్య. మంచి నిద్రలో ఉన్న ాప ఆమె మీద చెయ్యి పడేసింది.

నా ఆత్రంలో నేను బయలుదేరితే మాత్రం అతను ఇంకా క్కడే వుంటాడని ఏం నమ్మకం? నాకు కించిత్ సిగ్గనిపించింది.

ఒక వేళ అతను అక్కడే ఉన్నా నిద్రపోతూ ఉండడూ? ా భార్యకు మెలకువ వచ్చేసింది. నా పచార్లు ఆపి చెప్పాను! నేను ూ రామం బాబాయిని చూడటానికి వెళుతున్నా!"

"ఎవరండీ ఆయన, నేనెప్పుడూ చూడలేదే!"

"నాకు పన్నెండేళ్లు ఉంటాయేమో ... మా బీదరికం నీకు తెలి యదులే ... నాన్న న్యూస్‌పేపర్లు పంచేవాడు ... రెండోపూట అన్నం ండేదికాదు ...మా ఇంటికి ఆప్యాయంగావచ్చే చుట్టం రామం బాబాయే వదినా' అంటూ అమ్మను ఆప్యాయంగా పిలుస్తూ వచ్చేవాడు నాన్నకీ ాబాయంటే చాలా అభిమానం ... వచ్చినప్పుడల్లా మా ఇంటిల్లిపాదికీ పేరుపేరునా ఏదో ఒకటి తెచ్చేవాడు ... తలచుకుంటే గగుర్పొడు స్తుంది శరీరం... ఆ అభిమానం .. ఆ ఆత్మీయత .. అమ్మ మా చ్చే గంజినీళ్లే అతడికీ ఇచ్చినా ఎంతో మమతతో తీసుకునేవాడు. ాబాయికి నేనంటే ఎంతముద్దో చెప్పలేం ... మవ్వూ నేనూ ఇప్పుడు ాపని అంతముద్దు చెయ్యటం లేదేమో!"

"మరి ఆయనను ఇంటికి తీసుకువస్తారా?"

—నేను ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయాను. తీసుకువస్తా, తీసుకువచ్చి తీరుతా! ...నేనూ నలుగురిలోనూ పడ్డానని, నాకుభార్యా ఉద్యోగమూ, సైకిలూ, సంసారమూ ఉన్నాయని బాబాయికి చెప్తా!"

ఐదున్నరవుతుండగా వడివడిగా బయలుదేరాను.

—చెట్టుక్రింద మనిషిలేడు. సంచిమాత్రం ఉంది. అతనికోసం నిరీక్షిస్తూ అక్కడవున్న సిమ్మెంటు దిమ్మమీద కూచున్నాను.

అతను వచ్చాడు ... నన్ను పట్టించుకోకుండా తన సంచివద్ద కూలబడి అందులోనుంచి అట్టముక్కలు బయటకు తీస్తున్నాడు

"రామంబాబాయ్!" అని పిలిచాను అతను ఉలిక్కిపడడం గమనించాను.

"మూడు రోజుల క్రిందట మిమ్మల్ని చూశాను .... నాకు పది పన్నెండేళ్ల వయసున్నప్పుడు మా ఇంటికి వస్తూ ఉండేవారు .... చెల్లాయినీ నన్నూ ముద్దు చేసేవారు .... నాకు ఎన్నోకథలు చెబుతూ ఉండేవారు...మీరు వచ్చివెళ్ళినప్పుడల్లా మీగురించి నెలల తరబడి ఇంట్లో చెప్పుకుంటూ ఉండేవాళ్లం, మీ ఊసులు, మీ కబుర్లు, మీ కథలు...."

నా మాటలు వినబడుతున్నాయో లేదో అన్నట్టు అతను అట్ట ముక్కలు కత్తిరిస్తూనే వున్నాడు. నామాటలు నేను కొనసాగించాను ...." నేను బాబాయ్! శేషావతారంగారబ్బాయిని. .. గుడివాడ నన్ను గుర్తుపట్టలేదూ?"

"ఓహ్!" అతను నావంక తేరిపారచూశాడు. "బాబాయ్ నువ్ ఆరోజుల్లో ఎంత అందంగా, హుందాగా, ఉండేవాడివో... నువ్ ఎప్పటికయినా పెద్ద జడ్జీ వైపోతావని నాన్నగారు అంటుండేవారు., బాబాయ్, ఇదేమిటి బాబాయ్... నాగొంతు వణికింది.

అతను చిన్న చిరునవ్వు నవ్వాడు.

"మనమంతా పసిపిల్ల వాళ్ళమైపోతే!?"

"అదెలా బాబాయ్! వయస్సును ఆపగలమా?"

"బాబాయ్ ఎవరో, ఏమిటో! నువ్వంటున్న జడ్జీగారెవరో; నా మానాన్న నన్ను వదిలెయ్!"

వెదురు పుల్లలు చీరుతూ అన్నాడు.

"బాబాయ్! నువ్ మమ్మాటికి బాబాయివే...నేను నిన్ను ప్రశ్నలు వెయ్యను. నువ్ ఏంచేసినా నేను ఏమీ అనను. నా భార్యనీ పిల్లలనీ చూద్దువుగానిరా... నీకు పిల్లలంటే ఎంత గారామో నాకు తెలుసు.. రామంబాబాయంటే తెలియని పిల్లలెవరూ మన కుటుంబా

లేఖ్ ఆరోజుల్లోలేదు. నువ్వంటే అందరికీ అభిమానమే. బాబాయ్ నువ్ హైదరాబాదులో ప్రాక్టీస్ చేసేవాడివి కదూ !"

"మనిషిని పోలిన మనిషి వుండడం కద్దు. నేనేమిటి, తమ రేమిటి, జడ్జీఏమిటి...నువ్ నాతో ఈ చెట్టుక్రింద ...రోడ్డు పక్క మాటాడుతూ ఉంటే నీ గురించి ఏవరైనా ఏమనుకుంటారు ? ఇప్ప టికే నేను దొంగనని ప్రజలలో అప్పుడప్పుడూ అనుమానం కలుగు తూనే ఉంది. వెళ్లిరా బాబూ !"

అతను మరి నా వంక చూడలేదు.

ఎంతో డబ్బుఉండి, ఎంతో చదువుకుని, మంచి కుటుంబంలో పుట్టిన రామంబాబాయి, బికారిలా ఇలా బొమ్మలు చేసుకుంటూ.... ఏమిటి కారణమో ! మనిషి చదువుకున్నవాడిలా ఏ మాత్రమూ తెలియడానికి అవకాశం లేకుండా – గడ్డమూ మీసాలూ, తైలసంస్కా రం లేని జుట్టూ – ఈ తమిళ దేశంనుంచి బిక్షాటనకై ఆంధ్ర ప్రాంతం వచ్చిన సాధువులా విభూతి పిండికట్లూ, నుదుటన తెల్లబొట్టూ సహజావబోధంలా తప్ప మరోలా గుర్తుపట్టడానికి వీలు లేకుండా ఉన్నాడు. నేను వచ్చేస్తుంటే అతను నా వంక చూడలేదు.

ఇంటికివచ్చి నా భార్యతో బాబాయి గురించి చెప్పాను. నాచిన్న తనంలో బాబాయంటే నాకెంత ప్రాణమో, మేమంటే బాబాయికి ఎంత గౌరవమోచెప్పాను

"మరి ఆయన్ను తీసుకొచ్చారుకారేం?" అమాయకంగా అడిగింది.

–"పాపాయిని తయారు చెయ్యి, పదినిముషాలలో బయలుదేరి వెళతా !" అన్నాను.

పాపాయిని సైకిలు ముందు కూచోపెట్టుకొని హోటల్‌లో టిఫిన్‌లు పొట్లాలు కట్టించి బంగళా దగ్గరకొచ్చాను

"పాపా, ఆయనెవరో తెలుసా?"

"నిన్న బొమ్మ... "

"ఈపొట్లాలు ఆయనకియ్యి... వెళ్లు ! "

"నాకుభయం ! "

నాకు కళ్లవెంట నీళ్లొచ్చాయి. రామంబాబాయంటే పిల్లలకు భయమా ?

బాబాయి ఎందుకిలా అయిపోయాడు. ఎవరినడిగి తెలుసు కోవాలి. తనేమో చుట్టాలందరికీ దూరంగా వచ్చేశాడు.

"వెళ్లమ్మా, వెళ్లు !" నేను దూరంనుంచి ఆయన్ను చూ చెప్పాను.

"నేవెళ్లను. "

నిజమే - ఆయన ఇప్పుడు ఒక బికారిలా ఉన్నాడు. ముందు మెదిలే బాబాయే అయితే పాప తనంతటతనే వెళ్లేది

నేనే ముందుకు నడిచాను.

"బాబాయ్ ! ఇది నాకూతురు.. "

బాబాయి తను తీస్తున్న కూనిరాగం ఆపేశాడు.

"నా బొమ్మ విరిగిపోయింది !"

"ఇంద మరోటి... ఇంకోటి కావాలా ?"

బాబాయి కళ్ళలోకి వెలుగు వచ్చింది.

పాప రెండు చేతులలో రెండు బొమ్మలున్నాయి. బాబాయి వెలుగులు విరజిమ్ముతున్నాయి.

"పాపా ఈ ఫలహారం ఆయనకు..."

"నువ్వే ఇయ్యి"

"ఫలహారం తెచ్చా బాబాయ్ ! తీసుకో...పాప నీ కోసమ

బాబాయి తీసుకున్నాడు.

అతను తింటుంటే చూస్తున్నప్పుడు నేనే పొరపడ్డానేమో పించింది. నిజంగా చదువుకున్నాడా ? నిజంగా లాయరో జడ్జీం అయితే ఇలా

ఫలహారం ముగించి ఆకులు పారేశాడాయన.

"మిమ్మల్ని ప్రశ్నలు వెయ్యనని మాట యిస్తున్నా ఇదొక్కటేప్రశ్నే..మీరు నిజంగా రామంబాబాయి కదూ !"

పెద్దపెట్టున నవ్వాడాయన.

"నీకు మాట నిలకడలేదబ్బాయ్... అడగనంటూనే మొద వాక్యం ప్రశ్న..."

"అంటే నా ఉద్దేశ్యం ?"

"నీ ఉద్దేశ్యం ఎవరికాకావాలి... దేవుడిమీద ప్రమాణం చే నిజమే చెబుతున్నా అని మొదటివాక్యమే అబద్ధం చెప్పడమా?

"బాబాయ్ ! నువ్ లాయర్‌వే ...నువ్ బాబాయ్‌వే . "

ఆయన మరి నన్ను పట్టించు కోలేదు.

"నీ పేరేమిటి పాపా ? "

పాప సమాధానం చెప్పలేదు,

"ఇదేంన్యాయం బాబాయ్ ! పాపరమ్మంటోంది. మాతోరావూ?

"నేను ఈ అవతారంలో... నీఇంటికి... రోడ్డుమీద బికారిని. ఏరూ నీగురించి ఏమనుకుంటారు.."

- నేను అవాక్కయి పోయాను.

"అంటే నువ్ బాబాయివే నన్నమాట!"

"మనిషి - తనమీద తనకి నమ్మకం ఉన్న మనిషి - వెయ్యాల్సిన ్నకాదు. దీక్షాబద్ధమైన న్యాయవ్యవస్థ అంటే - అదేకమిటెడ్ సియరీ - అంటే ఏమిటనుకున్నావ్. మనిషిగా న్యాయమూర్తికి ీద నమ్మకం కుదరాలి ఋజువర్తన మీద నమ్మకం ఉండాలి. ాధీక్ష మీద విశ్వాసం ఉండాలి.. తీర్పు గుండెలోనుండి రావాలి. ంం మెదడులోనుంచి కాదు.. తను భగవంతుడవగలగాలి.."

ఆయన కళ్లలో ఏదో ఆందోళన నీడలు ముసురు కుంటున్నాయి. కంతా అయోమయంగా ఉంది

ఆకాశం నలుమూలలా మబ్బులు కమ్ముకు వస్తుంటే చీకటయి కున్నట్టు ఆయన ముఖంలో నల్లని నీడలు.

- "బాబాయ్, నువ్ ఎందుకిలా అయిపోయావ్ ?"

"మాటమీద నిలబడలేని వాడివి అయినా నేనే న్యాయ ర్తినీ అనుమానితుడినీ కాకూడదు పాపా. బొమ్మ బాగుందా ?"

పాపాయి బొమ్మతో ఆడుకుంటోంది

బాబాయ్! నీ కుటుంబం..." ప్రశ్న నేను సగంలోనే ాయించుకున్నాను

ఆనందం కేవలం మానసికం.. అనుభౌతికం. నాచుట్టూ న్న మనుషులందరూ నా కుటుంబంకదూ' నన్ను పిచ్చివాడన్నారు. ఒకటీ ఒకటీ వదిలేస్తూ నిరంతరమైన ఆనందానికి చేరువవు న్నాను.. కూడబెట్టడంలో ఆనందం లేదు. త్యాగం ఉంది... మత్వంలో ఆనందంలేదు తన్మయత్వంలో ఉంది తృప్తి నాకు నా అనే ళ్లు లేరనీ - సుఖం లేదనీ అనుకుంటే అది నీ దృష్టిదోషం ... నా ్రోమాడు .... అందరూ నావాళ్లే ... కోరికలు లేకపోవడమే ్రప్తికి సోపానం నాగరికత కాలక్రమేణా అభివృద్ధి చెందుతుందను ంటున్నామా ?"

"అవును."

"నాగరికత అభివృద్ధి చెందుతున్నకొద్దీ వివక్ష పెరుగుతోంది హూ.."

"అవును..."

"అంటే నేటి సమాజం ప్రాచీన సమాజం కంటె న్యాయ వ్యవస్థలో ముందంజ వేసిందనే కదూ...."

"అవును."

"గౌతముడెప్పటివాడు ?"

"క్రీస్తుపూర్వం. నాకు తేదీ జ్ఞాపకం లేదు ..."

"అడవికి పోయిన గౌతముడిని రాజు ఎందుకు బంధించలేదు?"

"అతని జీవనమార్గం అతను ఎంపిక చేసికొనే ప్రాథమిక హక్కు ఆయనకు ఉందనేమో!"

పెద్ద రాజ్యాంగ కర్తలా చెప్పాను

"బాగుంది .... నన్ను ఇప్పుడు ఇక్కడ

ఎరస్టు చెయ్యాలనుకునేవారూ ఉన్నారు.. అనుమానం మన ఊపిరి.. నేనొక సంఘటన చెబుతావిను...నిందితుడిమీద క్రింది కోర్టులో విచారణ జరిగింది. అతను ఇల్లూ వాకిలీ లేనివాడు. సదా తిరిగే దేశదిమ్మరి. కాని నిజానికి ఆస్తీ, అంతస్తూ ఉన్నవాడు.. ఎవరినో ఎందుకో మోసగించాలని బికారిలా ..రోడ్డు ప్రక్క...విచారణ మీద తెలిసిన దేమంటే అతనొక ధనవంతుడు. సర్వసంగపరిత్యాగం చేసి...అతనిమీద నేరమేమీ చేసినట్టు అభియోగంలేదు. అతను తప్పి పోయినట్లు ఎక్కడా ఫిర్యాదు నమోదు కాలేదు. అతని సంచిలో చెక్ బుక్ అతని నిజనామాన్ని బయట పెట్టింది. అనుమానానికి అదే దారి తీసిందనుకో .. మందలింపుతో - కోర్టులేచేవరకూ శిక్షతో అతన్ని పంపించడం జరిగింది అపీలు నేను చేశాను. శిక్షఎంతని కాదు - అసలు శిక్షఎందుకని అతని వాదన జడ్జీగారు విచారణ చేశారు.... ఇతరుల హక్కులకు భంగం వాటిల్లకుండా తన హక్కులను అనుభ వించడంతో న్యాయవిరుద్ధంకాని, చట్టవిరుద్ధంకాని, ధర్మవిరుద్ధంకాని ఏదీలేదని వాదించాను. క్రిందకోర్టు అతనికి వేసిన శిక్షనురద్దుచేసి - శిక్షవేసినందుకు అభిశంసనురాసి అతన్ని కోర్టువారు నిర్దోషిగా నిర్ణ యించారు... ఆ నిర్దోషి నాకు మార్గదర్శకుడయ్యాడు. ఆయన ఇచ్చిన ఫీజు. సరే అదంతా ఎందుకు... నా ఆనందాన్ని వెదు క్కుంటూ ఆయనకోసం వెదుకుతున్నాను... ప్రతి శనివారం మధ్యాహ్నం ఆయన మంచి బట్టలు వేసుకుని తన బ్యాంకుకి ఫోన్ చేస్తుంటాడు... కాని తనెక్కడ ఉన్నది చెప్పడు... ఆడపిల్లకు పెళ్ళి చెయ్యడమన్నది ఒక చిత్రమైన పరీక్ష... దానిలో ఓటమి జీవితంలో ఘోరమైన పరాజయం... బీదరికం నేరంకాదు... కట్నాలని చట్టం నిషేధించవచ్చు కాని నిషేధాన్ని అమలు చెయ్యడం అసాధ్యం... ఈయన మారువేషం - బీదరికం - అభాగ్యులని ఆదుకోడానికే... మనిషిగా మనిషితో చెప్పిన గుండెలోతుల్లోని ఆంతరంగిక రహస్యం... సార్వజనీనమైన ప్రేమతో నవ్వులు పంచుతూ తిరిగే అతని ఆలోచనా సరళి నన్ను ముగ్ధుణ్ణి చేసింది"

బాబాయి ముఖంలో ఏదోతేజస్సు. కళ్లలో ఏదో ఆనందం.. ఆయన్ను చూస్తే విచిత్రమైన అనుభూతి కలుగుతుంది.

"నాన్నా! ఇంటికివెళదాం!"

"బాబాయ్.. నువ్వూ.."

"రావటానికేం అభ్యంతరంలేదు.. కాని నేనువస్తే ఆతరువాత వచ్చే పరిణామాలు అప్రీతికరంగా ఉండవేమోనని.."

పద! అనడానికి నాకు ధైర్యం చాలలేదు

"నాచరిత్ర తెలుసుకోవాలన్న ఉత్కంఠలో ఎక్కువగా ఉందికదూ! డబ్బులు ప్రమేయం లేకుండా వృత్తినీ, ఉద్యోగాన్నీ.. చేశాను. దీక్షా బద్ధమైన న్యాయవ్యవస్థ అంటే, ఒకవర్గానికీ, ఒకపక్షానికీ – లేకపోతే ఒకఅక్షర సముదాయానికి కట్టుబడి ఉండాలంటే ఉండలేక పోయాను నా మనస్సాక్షి, నాఅంతరాత్మ ప్రేరేపించే మానవత్వానికి విలువనిచ్చాను.. కోరికలను తుంపుకోవడంలో ఆనందం ఉంది. ఇప్పుడున్నంత అర్థవంతంగా ఇంతకు ముందెప్పుడూలేదు నాబ్రతుకు... పాపకు ఇంటిమీద మనసు పోయింది.. వెళ్లిరా! శాంతిరస్తు!"

– నేను వచ్చేస్తుంటే కనీసం ఆయన గమనించినట్టు లేదు..

బాబాయి గురించి నాఆలోచన తెగలేదు – నిజమే ఆయనమీద ఆపేక్షకంటె ఆయన చరిత్ర తెలుసుకోవాలనే ఉత్సుకతేనాలో మెండుగా ఉంది.

– మరుసటిరోజే మళ్లీవెళ్లాను.

"బాబాయ్ నువ్ నాతో రావాలి.."

"ఇప్పటికి ధైర్యంకుదిరిందా. పద!

మేము రిక్షాలో వస్తూవుంటే నావంక ప్రజలు వింతగా చూస్తున్నారు నేనుతలవంచు కున్నాను

"నీకూ రుచిగా ఉండడంలేదు చూశావా?" నేను ఆయోమయంగా చూశాను ఆయనవంక

స్నానంచేసి ఆయన పిండిన తడిధోవతితోనే భోజనానికి కూచున్నాడు మా ఆవిడ మౌనంగా వడ్డిస్తోంది. భోజనం అయిపోయింది. "పొడి దోవతి కట్టుకో బాబాయ్" నేనివ్వబోయాను.

బయటగదిలో కూచున్నాం. పాప బొమ్మలన్నిటినీ చూపిస్తోంది. నాఉద్యోగం అదిభోగట్టాలు చేస్తున్నాడు బాబాయి.

"ఆఫీసుకు వెళ్లవా?"

"ఈరోజు ఆదివారం!" అతను చిరునవ్వునవ్వడంతో నాకు ధైర్యంవచ్చింది. "బాబాయ్ నువ్మాతో... ఉండిపో.: నీకు పిల్లలంటే ఎంత ఇష్టమో నాకుతెలుసు..."

– "సన్యాసులకీ, సాధువులకీ మనకేం కొదవలేదు.. జోగీ రాసుకుంటే బూడిద రాలుతుంది.." మా ఆవిడ మా మాటోందని నాకు తెలియదు.. ఆమె మాటలు నాకేకాదు బాబా స్పష్టంగా వినిపించాయి.

"నీపేరేమిటిబ్బాయ్?" నన్నడిగాడు.

నేను తెల్లబోయి, తేరుకొని. చెప్పాను.

"పాపా! కలం ఇస్తావా ఒక్కసారి!" బాబాయి అడిగా

సంచిలో నుంచి చెక్కుపుస్తకంతీసి బరబరా రాసి సంతకం 'అమ్మకియ్యి' అంటూ పాపచేతిలో ఉంచి మారుమాటాడకుండా మె దిగివెళ్లిపోయాడు.

ఆయనవెళ్ళినట్టు మా ఆవిడకు తెలియదేమో ఇంకా ఏవే. అనేస్తోంది. నేను లోపలకు వెళ్ళి ఆమెకు పాప అందించిన చెకు వంక చూశాను.

"ఇదో బడాయి! చెక్కట చెక్కు... అదే ఉంటే ఈ బికా బ్రతుకెందుకు?"

నాకు ఒళ్ళు మండలేదు... చెక్కు ఆమెచేతిలోనుంచి తీస కుని బ్యాంకుకు పరిగెత్తాను... అంతడబ్బే! .. హైదరాబాద్‌కి మేనేజ ఫోన్‌చేశాడు.. అవతల మేనేజర్ నన్ను మాటాడమన్నాడట ఎవ తోనో! మా బ్యాంకు మేనేజర్ నాకు ఫోన్ అందించాడు

"చెక్కును అనుమానించనక్కరలేదు. ఆయన ఎక్కడ ఉన్నదీ వెంటనే తెలియచెయ్యండి.. ఆయనను మాటాడమని నేను బ్రతిమాలుతున్నానని చెప్పండి... ఆయన మాటాడక పోయినా.. మా అమ్మాయి నిశ్చేసుకుందని ఆయన పేరు చెప్పుకుంటున్నామనీ చెప్పండి."

మరో అద్భుతమైన కథ వింటున్న అనుభూతి కలిగింది,

"మీపేరు? ఆయనకు చెప్పాలిగా .." నేనుఆత్రంగా అడిగాను లైన్‌కట్ అయిపోయింది...

నేను ఇంటికి రాకుండా వెళ్ళా బంగళా దగ్గిరకు.. బాబాయి జాడలేదు రెండు రోజులు సెలవుపెట్టి వెదికాను. ప్రయోజనం లేక పోయింది. మా ఆవిడ కళ్ళవెంట నీళ్ళు ఆగకుండా వస్తునేఉన్నాయి... ఇప్పటికీ బాబాయిని తలుచుకున్నప్పుడల్లా.

# ప్రజ

## డా॥ సి. నారాయణరెడ్డి

గొర్రెలు పంచుకుని
వకాశాలను మేసుకుంటూ పోయే
గొర్రెలమంద,
ండగ పండగకూ
ండెల్ని జెండాల్లా ఎగరేసే
ర్రిమేళం,
కుల్లోంచి వర్షించే వాగ్దానాల్తో
డిసి మోపెడై జైకొట్టే
డత మూక,
ప్రభుత్వాలు మారినప్పుడల్లా
పాక ఇల్లవుతుందని ఆశించే
పిచ్చిమాలోకం,
జపమాల కనిపిస్తేచాలు
జాతకం మారుతుందని విశ్వసించే
జాలిగుండె.
—
పదిచినుకులు పడితేచాలు
బతుకంతాపడ్డ ఆవిరిపాట్లను మరిచే
మరుపుతెర,
ఇదేనా ప్రజ ?
ఇంతేనా ప్రజ ?
వాగ్దానాల వర్షాజలాలు
పార్టీల కాల్వల్లోనే ప్రవహిస్తే —
తేబిల్ మారిన ప్రభుత్వాలు
ఊబినే ఈతకొలనని ఊదరగొడితే —
పక్కనున్న బలిసినమేడ
పాక పీక నొక్కితే —
వేళ్ళమీది జపమాల
విషజ్వాలగా బుసకొడితే —
గొర్రెలమంద కొమ్ములెక్కుపెడుతుంది.
వెర్రిమేళం విప్లవభేరి కొడుతుంది.
జాలిగుండె ఝంఝులా ప్రసరిస్తుంది.
మరుపుతెర మెరుపుకత్తులు దూస్తుంది.
అప్పుడంటుంది లోకం
" అదీ ప్రజ అదీ ప్రజ ".



## శ్రీ విక్రాల శేషాచార్యులు

# ఆంధ్ర - దేశ భాషలు

శ్లో॥ ఆంధ్రదేశ శ్చాఽస్త్రిభాషా జీజీయేతాంతరా మభే।
యయో ర్నాథో హరి స్సాక్షా ద్వైకుణ్ఠ రమయోరివ॥

ఈ శ్రీ విజయసంవత్సర భాద్రపద బహుళనవమీ గురువారము ( 1953 అక్టోబరు ) ఆంధ్రరాష్ట్ర మవతరించిన సందర్భమున ఆంధ్రులు తమతొల్లింటి వారియొక్క జ్ఞానవిజ్ఞాన విశేషముల నప్పుడప్పుడు పత్రికాముఖమున నెఱిఁగియున్నారు.

అట్టులే యాంధ్రదేశమును యాంధ్రభాషనుఁ గూర్చి శాస్త్రములలో నేమి చెప్పియున్నదో? దానినిఁ గూడా నాంధ్రులెఱుంగఁదగియున్నారు. కావున నవ్విషయము నిట సంగ్రహముగ వ్రాయుచున్నాఁడ.

మనయాంధ్ర దేశమునకు ఆంధ్రము తెలుగు త్రిలింగము తెనుఁగని నాలుగు సంజ్ఞలు కలవు. ఆ సంజ్ఞలయొక్క అర్థములు ఆ యీదేశమునకు కలిగిన కారణములున్ను ముందుగఁ దెలియనగును.

భారత వర్షమునందు అంగ - వంగ - కళింగాది నామములు కల రాజులు పాలించినదేశము లాయారాజుల పేర్లతోనే వన్నె కెక్కినట్లు మనదేశమున్ను "యాంధ్రుఁ" డను రాజుచే పాలింపఁబడుటచేత నాంధ్రమని పేరొంది యుండునని కొందరు తలచుచున్నారు. అట్లుకాదు. అంగాదిదేశములు కొన్నిమాత్రము పాలించినరాజుల పేరనే వ్యవహృతంబు లగుచున్నవి. ఈ యంగుఁడు మున్నుగాఁగలవారు బలి యను రాజుయొక్క పుత్రులు. వా రేలినదేశములు వారి పేరనే చెప్పఁబడుచున్నవి.

ఇందుకు హరివంశము హరివంశపర్వము 31వ అధ్యాయమునందు -

శ్లో॥ మహాయోగీ స తు బలి ర్బభూవ నృపతిః పురా 1133
పుత్రా నుత్పాదయామాస పంచ వంశకరా న్భువి
అఙ్గః ప్రథమతో జజ్ఞే వఙ్గస్సుహ్మ స్తథైవచ॥ ౩౪
పుణ్డ్రః కళిఙ్గశ్చ తథా బాలేయం క్షత్రముచ్యతే॥

ఇయ్యది కలికివాయలో విద్యార్థి సంఘమువారి కోరిక ననుసరించి యాంధ్రరాష్ట్రావతరణమునకు ప్రక్కదినము సంఘటిల్లిన గాంధీజయ న్తినాడు వారు జరిపిన సభయందును, క్రమ్మఱ రెండుమాసములలో నిందుకయ్యే ప్రత్యేకముగ వారు జరిపిన మఱియొకమారు స యందు నుపన్యస్తమయ్యెను.

తేషాంజనపదాః పంచ అంగావంగాస్సు సహ్మకాః॥
కళింగాః పుండ్రకాశ్చైవ— యనిగలదు. ఇట్లు పాండ్యుడు, చోళుడు కురుడు, కేకయుడు, కోసలుడు, విదర్భుడు, విదేహుడు మున్న రాజులు పాలించిన మరికొన్ని దేశములున్ను, ఆయా రాజుల పేరు నవగా పాండ్యదేశము, చోళదేశము, కురుదేశము, కేకయదేశమ కోసలదేశము, విదర్భదేశము, విదేహదేశము యని మున్నగు పేర్ల ప్రసిద్ధిజెందియున్నవి. ఈ విషయము పురాణములయందు వారివారి క లలో దెలుపబడియున్నవి. వ్యాస విస్తరభీతిచే వ్రాయవిరమించి ప్రక్క మనుసరింతును.

ఐతే విష్ణుపురాణము ౨వ యంశము ౧వ యధ్యాయముల

శ్లో॥ తతశ్చ భారతం వర్షమేతల్లో కేషుగీయతే।
భరతాయ యతః పిత్రా దత్తం ప్రాతిష్ఠతావనం॥ ౩౩॥ య

తండ్రిచే భరతునకివ్వబడినందున యాయనపేరనే భరతవర్షమని చె బడుచున్న ఒక్కదేశములో కొన్నిభాగములు అన్యరాజుల దేశము వ్యవహారము నొందుట యెట్లుపొసగెనని కొందరకు సందియము గల నోపు, చెప్పెదను. వారి వంశము రానురాను అసంఖ్య శాఖలుగా రిల్లగా నొకప్పుడా వంశస్థులగు సోదరులు కొందరు పంచుకొని యే భాగములు వారి దేశములుగా నుడువబడుచున్నవి. ఇచ్చట దేశ రాజ్యమని లక్షణయా అర్థము భావింపదగు. ఇందుచేతనే నొక్క గల దేశమునందనేక రాజులపేర దేశములు పుట్టినవి. ఉదాహరణవ ఒక్క యాంధ్రదేశములో కొంతభాగమైన యిప్పటి కృష్ణా గుంటు జిల్లాలు అపుడు విదర్భదేశముగా చెప్పబడినది. ఉత్తరమున కొ భాగము కళింగదేశము. ఇట్లే ద్రవిడదేశములోనూ చోళదేశము, పాం దేశమనియు రెండు దేశము లున్నవి.

కొన్ని దేశములకు ఆ దేశమునందలి మహానది పేరు గుటయు గలదు. సింధుదేశమిట్టిది. ఇక కాశ్మీరము మున్నగ కొన్ని రూఢనామకములుగ నున్నవి.

మన యాంధ్ర దేశమునకు పూర్వోక్తములైన సంజ్ఞ ఆంధ్రము త్రిలింగము తెనుగు 1-3-4 సంజ్ఞలు పర్వతములచే

నవి. 2వది తెలుగు యనునది గోసంపదచే సిద్ధించినది. ఈ యంశ మును మాతాతగారు ( పితామహులు ) కాళహస్తి సంస్థాన పండితులు షడంగ వేదజ్ఞ బిరుదాంచితులైన శ్రీమాన్ కళత్తూరు వీరకాల రాఘవా చార్యులవారు "ఆంధ్రదేశభాషా మహిమాను వర్ణనమ్" యను గ్రంథములో దెలిపియున్నారు. ఎట్లన,

ఆంధ్రశబ్ద నిర్వచనము :—

శ్లో॥ "అనంతం ధారయత్యేష దేశశ్శైలా కృతిర్యతః
అనంతధ్రస్సవ వాంధ్రః పరోక్షేణేంద్రవత్స్మృతః"

అని పర్వత రూపియైన యనంతుని ( శేషాహిని ) ధరించుచున్నది గాన యీ దేశము అనంతధ్రమనంబడెను. ఆ యనంతధ్రశబ్దమే ఇదంధ్ర శబ్దము దకారము లోపించి యింద్రశబ్దముగ నయినట్లు దేవతల యొక్క పరోక్ష ప్రియత్వమునేకదేశలోపవత్త్వము ననుసరించి యోగరూఢితో "ఆంధ్రయనియయ్యెను. అనగా పర్వతరూపియైన యనంతుని ధరించుటచే ఆంధ్రయనం బరగెనని యర్థము. ఆంధ్ర శబ్దమునకే స్వార్థమందు అణ్ప్రత్యయమురాగా ఆంధ్రమనియయ్యెను. ఇవ్విషయమింకను యతివిపులముగ ఈ శ్లోకవ్యాఖ్యయందు తెలుపబడి యున్నది.

ఇచ్చట దేవతలయొక్క పరోక్షప్రియత్వ మనగా యదార్థ మైన నామధేయమునకు రూపాంతముంజేసి నామధేయము యొక్క స్వరూపము దాచుట, అట్లు పిలచుటయు పరోక్ష ప్రియత్వమనబడును. అనగా వ్యాకరణ సిద్ధమైన తమ నామ శబ్దము(పేరు) నకు రూపాంతర మును కల్పించి యా పేరుయొక్క స్వరూపమును కప్పిపిలచుట. ఉదా॥ ఇచ్చట 'ఇదం పశ్యతి అనువ్యుత్పత్తిచేత ఇదంద్రః అని శబ్దము సిద్ధించును. దేవతలు పేరులో కొంత మార్పుజేసి పిలచుట యందు ప్రియులుగాన ఇదంద్ర శబ్దములో మధ్యమాక్షరము అయిన దకారము లోపించి "ఇంద్రః అని యయ్యెను. ఇట్లు శబ్దమునందు అక్షరములు లోపించుటయే యేకదేశ లోపము. అనగా ఇదంద్రుడు అనుపేరుతో నేకదేశలోపముచే (ఇదంద్రుడు అను) శబ్ద స్వరూపము మారి ఇంద్రుడని రూపాంతరము నొందెను. ఇట్లు పూజ్యతములు పరోక్షనామము చేతనే పిలువదగిన వారట అని ఐతరేయోపనిషత్ 1వ యధ్యాయము 3వ ఖండ 14వ మంత్రము యొక్క శంకర వ్యాఖ్యానందగిరి టీకయందు గలదు.

ఆంధ్ర దేశమునకు విష్ణువు నాయకుడైనందున పూజనీయము ప్ర పూజ్యుల పరోక్షనామ వక్తృత్వతననుసరించి అనంతం ధరతీతి వ్యుత్పత్తిచేత సిద్ధించిన అనంతధ్రః అను శబ్దము (పేరు) ఏకదేశ లోపముచే 'ఆంధ్రః' యని రూపాంతరము నొందెను. ఆంధ్రదేశము నకు విష్ణువు నాయకుడను విషయము ముందు వివరింపబడును. ఈ పర్వతము తిరుపతి యనంబడు శేషాచలము. ఆంధ్ర దేశములోనికి శేషాచలము ప్రధానము యని పైపైన నుడివియున్నారు. ఇట్టులీదేశము అనంతుని ధరించుటచేతనేగాక అకారవాచ్యుడైన శ్రీ మహావిష్ణువును నాయకునిగ ధరించుటం జేసియు నాంధ్రయని పేరొందెను. ఇయ్యంశము దేశముయొక్క సేశ్వరత్వవైభమును దెలుపునపుడు వివృత మయ్యెడి.

ఇట్లీదేశమునకు ఆంధ్రసంజ్ఞ కలిగినది. ఇక తెలుగు (తెలుంగు) శబ్దముయొక్క యుత్పత్తి ఎట్లన?

శ్లో॥ సరసాస్తిల వద్గావస్సంతి యత్ర సహస్రశః
సదేశస్తిలగు గుర్నాయతతోఽసౌ యజ్ఞియస్మృతః"యని

ఏదేశమునందు నువ్వుల వలె సరసములైన యావులు వేనవేలుగలవో యాదేశము తిలగు యనంబడును. కాననే యీ తిలగుదేశము యజ్ఞియ మైనదిగా పెద్దలచే ప్రశస్తంబయ్యెనని యర్థము. ఈ తిలగు శబ్దమే వికృతిరూపము నొంది తెలుగు అనియు లకారోత్తరవర్తియైన ఉకార మాను నాసికమగుటచే పాక్షికముగా తెలుంగు యనియు రూపమగు చున్నది.

ఇందుకు తద్వ్యాఖ్యలో శ్రీయాచార్యులవారి శిష్యులు శ్రీమాన్ పర్ణశాల నరసింహాచార్యులువారు (ఆంధ్ర రఘువంశాది గ్రంథకర్త, చెన్నపురి పచ్చయప్ప కళాశాల పండితులు) "—ఎతాదృగ్గిర్గోభిస్తిల సదృశై స్సుప్రసిద్ధోఽ యందేశస్తిలగు శబ్దేనోచ్యతే. గోశబ్దస్యోపసర్జన స్యహ్రస్వాదేశేతిలగు రితిరూపమ్. అయమేవ తిలగు శబ్దోవికృతి రూపం ప్రాప్య తెలుగు ఇతి. లకారోత్తరవర్త్యుకారస్యాఽనునాసి కత్వేన పాక్షికం తెలుంగు ఇతి రూపంచ భవతి." యని రూపసిద్ధి నుపదేశించియున్నారు.

ఈతిలగు శబ్దమునకే వైకృతపాఠభేదముచేత తెనుగు తెనుంగు యనియు రూపము కలిగెనని కొందరు తలంచుచున్నారు. అట్లుకాదు ఆ శబ్దము యొక్క వ్యుత్పత్తిపై నుడువంబడు. ఇందుకును ఆ వ్యాఖ్యలో "అస్యైవతిలగు శబ్దస్యవైకృత పాఠభేదేన తెనుగు తెనుంగు ఇతిచరూపం జాతమితి కేచనమన్వతే. తన్నతస్య శబ్దస్యాఽన్యధా వ్యుత్పత్తేర్వక్ష్యమాణత్వాత్." అని ఇంకను త్రిలింగ తెనుగు శబ్దముల నివృత్తి.

శ్లో॥ అహో బిలాద్రిర్భద్రాద్రి ర్వేంకటాద్రి శ్చయస్యతే
లింగభూతా స్సదేశోఽయం త్రిలింగ ఇతిచాఽపరే" యని

అహోబిలాద్రి, భద్రాద్రి వెంకటాచలము ( తిరుపతి ) లింగము (చిహ్నము)లుగా గల యీ దేశము త్రిలింగమనంబడు ననియు కొంద

శందురు. ఈ త్రిలింగశబ్దమే వైకృతరూపముతో తెలుఁగు తెలుగు యని చెప్పబడుచున్నది. ఈ యహోబలము మున్నగునవి మూడు పర్వతములు. పర్వతమునకు నగమనియు మరియొక పేరు గలదు గాన మూడు నగములు గలది త్రినగంబనబడు. ఈ త్రినగ శబ్దమే వికృత రూపములో తెనుగు అని యయ్యెను. ఇంకను విశేషాంశములు తద్వ్యాఖ్యలో తెలుపఁ బడియున్నవి. ఇందుచే తెలుఁగు అను పదము (పేరు) దేశమునకు గోసంపదచే సిద్ధించిన తిలగు శబ్దముయొక్క వికృతరూప మనియు, తెలుగు అనునది తెలుగు యొక్క పాక్షిక రూపముగను త్రిలింగయొక్క వికృతరూపముగాను రెండువిధముల సిద్ధించిన దనియు, తెనుగు త్రిలింగమను శబ్దపర్యాయమైన త్రినగశబ్ద వికృతి యనియు తెలియఁ దగును.

త్రిలింగ మనుపేరు దేశమునకు గిరిత్రయము చిహ్నమైన కారణముచే కలిగెనని ముందే చెప్పియున్నది కదా?

ఇట్టి దేశమునకు ఆంధ్రాదిసంజ్ఞలు కలుగుటకు కారణములం జెప్పిన పిమ్మట దేశముయొక్క భాగ్యవిశేషముల నుపదేశించి యున్నారు. వాఁటిలోఁ గొన్నింటి నిట నుగ్గడించి పిదప భాషయొక్క విశేషములను పేర్కొనెదను.

ఈ భారతభూమియందు (౫౬) ఏబదియాఱు దేశములు కలవు. వానిలో కెల్ల నాంధ్రదేశ మొక్కటియే యైశ్వరవంతమైనది. కడమ దేశముల కీభాగ్యములేదు ఎట్లన? ఎచ్చట నైనను వరదరాజు వైకుంఠ నాథుఁడు రంగనాయకులు జగన్నాథుఁడు అను మున్నగు నామములు కల భగవంతుడున్నాడే కాని ద్రవిడనాయకుడని కాని కర్ణాటనాయకుఁడని కాని ఓడ్రనాయకుఁ డని కాని మఱియేదేశము పేర నాయకుఁడుగ దేవుఁడు లేడు. మన యాంధ్రదేశమునకన్ననో కృష్ణాజిల్లాలో [1] శ్రీకాకుళ మను గ్రామమునం దాంధ్రనాయకస్వామియను పేర శ్రీమహావిష్ణువు నెలకొనియున్నాఁడు. ఇట్టి భాగ్యమాంధ్ర దేశమునకే యబ్బినది. దీనినే మా తాతగారు పైగ్రంథమునందు

1 ఈ శ్రీకాకుళ మష్టోత్తరశత వైష్ణవ దివ్యదేశములలో నొక్కటి.

"కాకుళే త్వా ఽన్ధ్రనాయకమ్" అని 1897 సంIIరములో బెంగుళూరులో తూప్పుల్ వేంకటాచార్యులగారు వాజపేయం కృష్ణశాస్త్రుల గారు నచ్చువేసిన స్తోత్రరత్నాకరము ౨౬౮ వ పేజిలో శ్రీవిష్ణ్వష్టోత్తరశ దివ్యదేశస్తోత్రమునందు శ్లో॥ ౧౧

శ్లో॥ నిరీశ్వరాః పరాదేశా ఆంధ్రస్త్వేకోఽస్తి సేశ్వరః
యత్రాఽస్తే భగవాన్విష్ణురాంధ్రనాయకసంజ్ఞయా॥

యని సెలవిచ్చి యున్నారు.

ఇట్లు నారాయణుని నాయకునిగ ధరింపుచున్నది గనుకను దేశమున కాంధ్రదేశమని పేరుగలిగెను. అక్షరా ణామకారోఽస్మి అకారో విష్ణువాచకః అకారార్థోవిష్ణుః, ఇత్యాదిప్రయాణములచేత అకా వాచ్యుండైన నారాయణుని నాయకునిగ ధరించునట్టి దేశమాంధ్రదేశః "అంనారాయణంనాయకత్వేనధరతీతి ఆంధ్రః, సఏవాఽంధ్రః,, య మాతంౘ్రడిగారు విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి శ్రీమాఁడ్రి కా రామచంద్రాచార్యులు గారాంధ్రవేదమునందుపదేశించియున్నారు. ఇట్లై నచో రంగనాయకాది నారాయణమూర్తులను ధరించునవిగాన ద్రా డాదిదేశములున్నూ ఆంధ్రములని చెప్పదగవా? యని ప్రశ్నవచ్చిన నట్లుగాదు. ఆంధ్రేతరదేశములు తమకు నాయకుడుగాగాక కారణాం రములచే నెలకొనియున్న నారాయణుని ధరించునవిగాన యాంధ్రశబ్ద మున కనర్హంబులయ్యెఁ.

ఇక నీదేశము "రక్షించుటకెల్లప్పుడు నేనిచ్చటనే యుందునని నిశ్చయించి తనకు నాయకుడుగా (ఆంధ్రనాయకుడుగా) విలసిల్లి నారాయణుని ధరించునదిగావున యీదేశమే యాంధ్రశబ్దముచే ప్రశస్త మయ్యెఁ. (ఇక్కడ శ్రీకాకుళ మహాత్మ్య పరమైన పురాణభాగము యందు పఠింపదగును.) అయితే జగన్నాథుడైన నారాయణుడు ఒక్క యాంధ్రదేశమునకే నాయకుడగుటయేమి గొప్పయనినచో? జగముల గాక సమస్తబ్రహ్మాండములకు నధీశ్వరుండైన యానారాయణుం వైకుంఠ నాథుడు క్షీరాబ్దినాథుడు వెంకటాచలపతియని యొకలోకవ నందును భూమ్యేక దేశములందును నాయకుడుగా విలసిల్లుచున్నాడ గదా? ఎందుకు? అవి యాయనకంత ప్రీతిపాత్రములు గనుకనేగద యచ్చట వాటికి నాథుడనియుండుట అట్లుతే యాంధ్రదేశము యావ యాయనకంతటి ప్రియముగాన దీనికి నాయకుడుగా విలసిల్లుచున్నాడ

ఐనచో సర్వసముడుగా నుండదగిన యా పరమాత్మున క భేదబుద్ధి యేలకలిగెనని కొందరడుగుదురు. దాని కాయనయే యడు దగినవాడు. అందుకేగదా యాయన యచింత్య లీలుండని శాస్త్రముఁ ఘోషించుచున్నవి. నమేద్వేష్యోఽస్తి కశ్చన॥ అని నుడివిన యాయ అదితిజులకుహితుడు దితిజులకు అహితుడు నగుట యేమి?

జగజ్జనకుండైన యాయన దేవకీనందనుడగుట యేమి? కావు నీ యాంధ్రదేశము సేశ్వరము వైష్ణవముగాన పరమపవిత్రమైనది.

మరియు మనదేశమ్మున శ్లో॥ యత్రదక్షిణకైలాసోయత్రా స్తేచాఽఽమరావతీ యత్రవైకుంఠనగరంససాక్షాత్స్వర్గ ఉచ్యతే" య దేవభూములతో తుల్యములైన దక్షిణ కైలాసము అమరావతి వైకుం పురము యను పుణ్యభూములు విలసిల్లుచున్నవి. దక్షిణకైలా కాళహస్తి. అమరావతి వైకుంఠపురము గుంటూరు జిల్లాలోని మన కాళహస్తి యనంబడు దక్షిణ కైలాసము, వైకుంఠపురవ

శివకేశవులకు క్రమముగ కైలాసము వైకుంఠములవలె ప్రియ నిలయములుగాన నా పేరితోనే వన్నెకెక్కినవి, యమరావతి యమరావతివలె యనేక దేవతాయతనములు గల్గి యా పేరనే ప్రశస్త మయ్యెను. ఇయ్యంశములు అయా క్షేత్రమహాత్మ్య ప్రతిపాదక పురాణ భాగములందు గాంచనగు.

మరియు సర్వపావనియైన గంగకు యక్కయని పేరొందిన గోదావరీ మహానదియు మన్నదేశముననే పావన మొనర్చుచున్నది. గంగకు గోదావరికి యక్కచెలియండ్ర చుట్టరికమను చెప్పుటకుంగారణము - గంగనీరు పట్టిన చెంబులను గోదావరి సరిక్రితేగా యా చెంబులలోని గంగాజలముపైన బిగించియుండు మూతనుగూడా రంధ్రమములు వేసి కొని బుస బుసమని పొంగును. అప్పుడు గోదావరిలోని యుదకమును కొంచెము, ఆ చెంబులలోనునచ తిరిగి యా గంగాజలము పొంగు తగ్గును. ఈ విషయమును నిప్పుడున్ను చూచినవారు చెప్పుచుందురు. ఇవ్విషయమును ప్రత్యక్షముగగాంచిన మాతాతగారును పైగ్రంథములో-

శ్లో॥ యత్రగోదావరీ దేశే వృద్ధగంగాఽస్తిపావని
బ్రాహ్మణాశ్చత్రయాద్వృద్ధాః కస్మస్మా' దపరదశ్శకః॥
ది దృశ్యమాణాయాందేవీం భాగీరథ్యవర్ధతే
క్షీయతే చయయా స్పృష్టాసాయుజ్యం యత్రగచ్ఛతి॥

యని నుడివియున్నారు.

మరియు నుత్తరకాలంబున సర్వలోకములకు క్షేమకరంబైన రామసుగ్రీవుల యొక్కయు రుక్మిణీ కృష్ణులయొక్కయు సమాగమ మున్ను యీ యాంధ్రదేశముననే జరిగెను. బళ్లారి జిల్లాయందలి యిప్పుడు హంపీ విరూపాక్షయనంబడు కిష్కింధయందు పంపాసరో వర సమీపస్థ ఋష్యమూకగిరిమీద రామసుగ్రీవసంధి జరిగెను. రుక్మిణి యొక్క పుట్టిల్లు కుండిన నగరము గుంటూరుజిల్లాగాన యామెకు కృష్ణునితోటి తొలికూటమియు నాంధ్రదేశముననేజరిగెనని యెరుంగునది.

బళ్ళారి తత్పరిసరమునున్ను యావత్తు యాంధ్రదేశీయము లనుటలో నిర్వివాదములుగాన శ్రీ యాచార్యులవారు బళ్ళారి మండ లాంతర్గత కిష్కింధాదుల నాంధ్రదేశాంతర్గతములుగా వక్కాణించిరి.

ఇప్పగిది మనదేశమునకు ఆంధ్రాది సంజ్ఞా చతుష్టయము గలుగు టకు కారణము తదర్థమునున్ను కొన్ని పుణ్య విశేషములం జెప్పుటి మైనది. ఇకనీభాషయొక్క ప్రశంసను గాంతము.

## ఆంధ్ర భాషోత్పత్తి

1. తరచుగా నొకదేశమునందు వాడబడు భాషకు ఆ దేశపు నామమే గలిగి యుండునని కొందరు తలచుచుండ మరికొందరు ఒక భాషవాడుకగల దేశమునకు ఆ భాష పేరే కల్గునని రెండవవారి వాదము మొదటి వారి వాదము దేశమునునసరించి యేభాషకు పేరు వచ్చు ననియు, రెండవ వారి వాదము భాషనుబట్టి యే దేశమునకు పేరు వచ్చుననియు తేలినది. ఇట్లు భాషనుబట్టి దేశమున కాదేశమును బట్టి భాషకా పేరు గల్గుటయను చర్చ విత్తుముందా చెట్టుముందా అను రీతి నుండు ఎట్టులైనను (ప్రకృతము) భాషయొక్క చర్చ గాన భాషాంత రముల పుట్టుకను కొంతదెల్పి పిదప యాంధ్రభాషోత్పత్తిని దెల్పెదను.

2. భారతదేశము నందలి భాషలకన్నిటికి సంస్కృతము తల్లివంటిది. ఎందులకన దడమభాషలు దానినుండి జనియించినవి యగుటచే నది తల్లిగా చెప్పబడుచున్నది. ఇతర దేశముల యందును ద్వీపములయందును వుండు భాషలకును సంస్కృతమే మాతృభాషయని శ్రీమాన్ మాతండ్రిగారొక సభలో నుపన్యసించియున్నారు. (పురాణము లలో సంస్కృత నామములు గలఅన్ని ద్వీపములు యిప్పుడు భాషలలో ఏ పేరు గల్గియున్నదియు మాతండ్రిగారి పురాణ జ్యోతిశ్యములో చెప్పబడియున్నది.) దానికి వారు చెప్పినకారణము. పూర్వము స్వాయంభువ మనువుయొక్క పుత్రుడైన ప్రియవ్రతుడు తానే సార్వ భౌముడుగా గల సమస్త భూగోళమునందలి సప్తద్వీపములను తన పుత్రసప్తకమునకు పంచియిచ్చెను. వారందరు సంస్కృత భాషా వ్యవహర్తలు గాన వారివారి పాలికివచ్చిన సప్తద్వీపములు యందును సంస్కృతభాషయే యుండెను. అది బహుకాలము గడువ భారతదేశ మందు వలెనే అచ్చటనూ పెక్కుదేశములవారి నోటంబడి పెక్కు రీతుల వికృతరూపముల నొందెను. ఎట్లన పితా మాతా భ్రాతా మొద లైన శబ్దములు ఆద్వీపాన్తరములలో ఫాదర్ మదర్ బ్రదర్ మున్నగు నవిగా రూపభ్రంశముతో నుడువ బడుచున్నవి. ఇట్టి భాషలు భ్రంశ ములుగాననే కర్మకాలముల నుచ్చరించదగవు. యని

3. ఇట్లు సర్వభాషలు సంస్కృతముయొక్క భ్రంశరూప ములై వుట్టగా నాంధ్రము ద్రావిడములయొక్క యుత్పత్తి శాస్త్రము లలో నుడువడియున్నది. ఎట్లన? ద్రవిడము అగస్త్యమహర్షియొక్క అపానమునుండి జనించినదియట ఆంధ్రము దేవతల సంరక్షణార్థము నారాయణుననుజ్ఞ చేగరుడునిచే దేవతలకుపదిష్టమైవచ్చినదియట. అందుచేతనే యీభాషకాంధ్రమనిపేరుగలిగెనట. ఎట్లన? ఆః అనగా విష్ణువు. ఆయనను ధరించువాడు అంధ్రుడు. అంధ్రునివల్ల వచ్చినది. గానయాంధ్రము.

4. గరుడుని వలన యాంధ్రము పుట్టెనను విషయమును మా తండ్రిగారు విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి శ్రీమాన్ వి్రకాల రామచంద్రాచార్యులవారు, "జనకజీవితము" నందు మా తాతగారు పైగ్రంథమును రచించిన చరిత్రము నుడువుచు అందులోని॥ చతుష్షష్ట్య క్షరా కాచిత్ యను శ్లోకమును వుదహరించి యా శ్లోకవివరణములో

నాంధ్రభాషోత్పత్తి కథను కృష్ణయజుర్వేదశాఖలలోనుండి యెత్తి వ్రాసి యున్నారు. దానినే నిట వ్రాయుచున్నాడ.

"దేవతలకును రాక్షసులకును, విరోధము గలుగగా రాక్షసులను జయింపగోరి దేవతలు యాగములను జేయదొడంగిరి. అపుడు రాక్షసులు ఆ యాగమున చారులనుంచి దేవతలు జేయు కర్మక్రమమును గనిపెట్టి తామున్నూ ఆ యాగము ననుష్ఠింపుచుండిరి. దేవతలకును రాక్షసులకునూ సంస్కృతభాషయొక్కటే యయినందున రాక్షసయాగమున్నూ స్వక్రమముగనే జరుగుచుండెను. ఇట్లు ఇరువురు పరస్పర జయార్థము యాగములు సలుపుటచే నొక్కరికిన్నీ ఫలముగలుగకపోయెను. అటుల శ్రుతియుం గూడ తెలుపుచున్నది.

"దేవా వై యద్యజ్ఞేకుర్వత తదసురా అకుర్వత" యని అంతట దేవతలు నారాయణమూర్తివద్ద 'కుంజని' మాకు యాగఫలము గలుగకున్నది. మేమేమిచేయుదు" మని మొరలిడుకొనగా అపుడు నారాయణమూర్తి గరుడుని వంక క్రీగంటిచూపును సారింపగా నా వేదాత్మయగు వైనతేయుడు దేవతలకు నాంధ్రభాష నుపదేశించి యాగమందీ భాషతో వ్యవహరించుడీ రాక్షసులు పరాభూతులగుదురు. మీరు జయింతురుఅని పలికెను. అంధరతీతి అంధ్రః గరుడః సపవాంధ్రః అని భాషకు పేరు గలిగెను.

దేవతలా యాంధ్రభాషను గ్రహించి మరలివచ్చి అసుర పరాజయార్థమునకై యాగమునారంభించి, అదివరకు సంస్కృతముతో మాటలాడుచోట నంతయు నాంధ్రభాషపలుకసాగిరి. "హోతరమ్మ" "అగ్నిద్రుడపొమ్ము", సోమమును దంచుడీ", "మేకనుతెమ్ము", అని దేవతలు మాటలాడంగ నామాటల యర్థమును అసురచారులు తెలిసికొనలేక ఆ మాటకు చేయుపనిని గనిపెట్టి అర్థమును నిర్ణయించుకొని ఆ యర్థమును రాక్షసులకు దెలుపుసరికి కొంతతడవు గలిగి ఈ నడుమ కొంతక్రియా భాగములు జరిగిపోవుచుండెను. అవి రాక్షసుల యాగమున లోపించి రాక్షసయాగమున వైకల్యము గలుగసాగెను. అంతట రాక్షసులు పరాభూతులైరి. కావున దేవతలకు జయము నొసంగిన భాషగావున నీ యాంధ్రభాష మిగత భాషలకన్నను శ్రేష్ఠము."—అని

ఈ ప్రకారము అంధ్రు ( గరుడు ) నివలన వచ్చిన భాషగాన యాంధ్ర భాషయని యీ భాషకు పేరు కలిగెను. దీనినే మాతాతగారు,

శ్లో॥ దైవీచాంధ్రీచ భాషేద్వే పరస్పర సమేస్మృతే।
యస్మా ద్దైవస్సమభ్యస్తే విష్ణుతత్వ ప్రకాశికే" యని

విష్ణుతత్వ ప్రకాశములు దేవతలచే నభ్యస్తములు గాన సంస్కృతములు రెండు నన్యోన్య తుల్యములని యుపదేశించిరి.

ఇట్లు వేరువేరు కారణములచే దేశభాషలకు రెండింటికినీ పేరుగల్గుట విచిత్రము.

భాషావాచకమైన యీ యాంధ్ర శబ్దమునందు ఒక్కరహ[illegible] గలదు. దానిని కనుగొన్నవారు మాతండ్రిగారు. తమ జీవిత కాల[illegible] నుపన్యాసముద్వారా లోకమునకుందెలిపి 'యాంధ్రపత్రిక'లో ప్రక[illegible] యున్నారు. దాని సారాంశమునిట యెత్తివ్రాయుచున్నాడ.

—"అంధ్రభాషకు స్వార్థికతద్ధిత ప్రత్యయమును వివక్షి[illegible] తొలుత అంధ్రీయని యుండును. ఇది యాంధ్రశబ్దముయొక్క స్త్రీ రూపము. భాషాయను స్త్రీలింగ శబ్దమునకు విశేషణమైనందున ని[illegible] స్త్రీలింగము గలదిగాపలసివచ్చెను. ఈ అంధ్రీయను పేర న[illegible] వర్ణములను జూడ, అ న్ ధ్ ర్ ఈ అని [illegible] అక్షరములు [illegible] యున్నవి. ఈ యక్షరములకు గలసంఖ్యలను గలియగూడంగ ३[illegible] లెక్కయేర్పడును. అదెట్లన్నను ? అచ్ సంకేతములనియు హల్ [illegible] తములనియు రెండుతెగలు. ఈ రెండుసంకేతముల ప్రకారము అ[illegible] ౨౦ ధ్ ౯ ర్ ౨ ఈ౪, = ౧ + ౨౦ + ౯ + ౨ + ౪ = [illegible] మొత్తమగుచున్నది. న కారమునకు సున్న యనియర్థము. ఇచ[illegible] సున్నవలన ప్రయోజనము లేదుగావుగ రెండవ శూన్యస్థానమని [illegible] చేర్చినను క కారము మొదలు న కారము వరకెంచినను ౨౦ ద[illegible] లెక్క ఏర్పడును గాన ౨౦ యను లెక్కవేయబడినది.

ఇటుల ముప్పదియారు అను సంఖ్యయేర్పడిన దానికి కా[illegible] మేద్దియో యొకటి యుండునని యోచనగలుగును. భాషకు విశేష[illegible] అంధ్రీశబ్దముచే గలిగిన లెక్కగనుక భాషవర్ణరూపముగ నుండు[illegible] గాన నీ భాషలోని అక్షరముల యొక్క లెక్కగనుండ వచ్చు[illegible] యూహింపనగును. ఆ యూహ సరియైనదిగనే యుండును. గా[illegible] యాంధ్ర వ్యాకరణమున నన్నయ భట్టారకుండు గూడ తనచే రచియి[illegible] బడిన అంధ్రశబ్ద చింతామణియందు అంధ్రభాషకు వర్ణములు ముప్[illegible] యారని వచించెను.

సూ॥ షట్త్రింశదాంధ్రతే, యని.

ఇందువలన యీ యాంధ్రభాష ఎన్ని యక్షరములు యున్న దీన్ని ఈ భాషయొక్క నామధేయము తెలుపుచున్నయది. [illegible] యొక వింత. ఇటుల మరి యే భాషలోని పేరులున్నూ వాటిలో యక్షరసంఖ్యను దెలుపునవిగావు. మరిన్నీ నింద్యమైన యరపుగల[illegible]


6

కో గూడుకొనునది - మున్నగు అక్షరములను ఇచ్చుపేరులు గ నితరభాషలున్నవి. ఇటుల ముప్పదియారు యను లెక్కను టి, యన్ని యక్షరములే యీ భాషలో నుండుట చూడంగ ఇది యొక విశేషమని తోచును. అది తెలిసికొనదగియున్నది.

తొలుత దెల్పిన చొప్పున దేశము విష్ణుసంబంధమైనది. గాన వైష్ణవదేశమున వాడబడు భాషయు గూడ వైష్ణవముగనే యుండ మును. విష్ణుతత్వములు ముప్పదియారు గన్పట్టుచున్నవి. విష్ణు ములు ౩౬అని వరాహోపనిషత్తున పరిగణింపబడియున్నది. మాధ్యాయము. "ఆహత్య తత్వజాతానాం షట్త్రింశన్మునయో ॥ యని. అటులనే అభియుక్తులున్ను ఆనతిచ్చియున్నారు.

శ్లో॥ బాలా అప్యవగచ్ఛంతి యత్ర షట్త్రింశతాక్షరైః

వైష్ణవాన్యేవ తత్వాని ఆంధ్రదేశస్సవైష్ణవః॥ అని యున్నది

క భాషయు గూడ వైష్ణవమైనవి. ఇటుల దేశము భాషయు గూడ ష్ణవమైనందున పరమపావనమైనది.

అయితే నకారమునకు ఇఱువది యర్థము కాదు. పదిగ హింపవలయుననినచో అం, న్ం ధ్ క్, ర్ ఈ నాలుగు యున నిఱువది (౨౬) యేర్పడును. పంచవింశాత్పరో వ్యయః, ఇరువదియైదవవాడైన జీవునికి బైవాడని పేర్కొనబడిన దాన పురుషేశ్వరుడగు శ్రియఃపతియైన నారాయణుడే తెలుప ను.

ఇటులనైనను భాషకు వైష్ణవత్వము దృఢముగానే యున్నది. ని

ఇందుచే నీ యాంధ్రము పరాత్పరుడైన నారాయణునివలన త్పన్నమై యాయననుంచి గరుడుడు, ...యననుండి దేవతలు హించిరి కాన వైష్ణవము, పూర్వోక్తరీతిగ వైష్ణవదేశమున వాడబడు ది కానను పరమపవిత్ర మైనది. కావుననే దేశాంతరమున బుట్టి షాంతరమునే వ్యవహరించు నప్పయదీక్షితులున్ను నీ యాంధ్ర ును గూర్చి యిట్లు ప్రశంసించిరి.

ఆంధ్రత్వ మాంధ్రభాషాత్వం ప్రాభాకరపరిశ్రమః

తత్రాఽపి యాజుషీ శాఖా నాఽల్పస్య తపసః ఫలమ్,, అని

భాషావాచకమైన యాంధ్రశబ్దములో నింతటి రహస్యము లదు. కనుకనే కవిత్రయమువారు పోతనామాత్యుడు మున్నగు పాచీనులైన మహాకవులందఱు (యెఱింగియే కాబోలు) తాము తెని గించిన భారతాదులయొక్క పేరునందు ఆంధ్రశబ్దమునే ప్రయోగించిరి. ఆంధ్రభారతము ఆంధ్రభాగవతము ఇత్యాది ఇంకను యాంధ్రభాష విష్ణుసంబంధమైనది యనుటకు నిదర్శనము లనేకములు కలవు. అవి మా తండ్రిగారి యాంధ్రదేశభాషామాహాత్మ్యప్రకాశములో చూపబడి యున్నవి. వాటినిట విస్తర భీతిచే వ్రాయ విరమించితిని.

ఇకనాంధ్రము సంస్కృతముతో సమానము. దానివలె విష్ణు తత్వబోధకమనియు ముందుజెప్పినది ఎట్లన? వేదములో 'శతాక్షరా భాషా' యనిచెప్పిన నూరు అక్షరములు గలభాష "చతుష్షష్ట్యక్షరాకా చిదన్యాషట్త్రింశదక్షరా" యని ౬౪ వర్ణములుగల సంస్కృతము, ౩౬ వర్ణములుగల ఆంధ్రము అని రెండుభాగములుగ నున్నది. ఈ ౬౪ - ౩౬ వర్ణములుగల సంస్కృతాంధ్రములు ఒక్కటిగనుండి, సృష్ట్యాదినశతాక్షర భాషగనుండినది. గాన యీ వేదోక్తమైన శతా క్షర భాషకు సంస్కృతమువలె నొక భాగమగుటచేతను దానివలె దేవతలచే నభ్యస్తమగుటచేతను సంస్కృతముతో తుల్యమైనది. యను టయు సహజమైనది.

ఇక సంస్కృతము విష్ణుతత్వ ప్రతిపాదక మెట్లునగా వేదైశ్చ సర్వైరహమేవవేద్యః' అని యన్ని వేదములచే నేనే తెలియదగిన వాడనని కృష్ణుడే వేదములలో తెలియదగిన యంశము నుపదేశించెనో యా వేదములు సంస్కృతభాష గాన వేదతదంగాది శాస్త్రరూపమైన సంస్కృతము విష్ణుతత్వ ప్రతిపాదకమని యెరుంగునది. ఇక యాంధ్ర మన్ననో ౩౬ వర్ణములుగలిగి వాటిచే విష్ణు తత్వమును బోధించునది. ఇక నీ యాంధ్రభాష విష్ణుప్రియమెట్లనగా? తనచే (విష్ణునిచే) సృష్టమై తన తత్వములన్ని బోధించుచు తనునాయకుడైన (శ్రీకాకుళ క్షేత్రములో) యాంధ్రనాయకస్వామి దేశములో వాడబడునది కావునను విష్ణువునకత్యంత ప్రియమైనది ఇంకనుతద్వ్యాఖ్యానమునందు విస్తర ముగ ప్రతిపాదితమై యున్నది.

మఱియు మండ లక్ష్మీనృసింహకవి "యాంధ్రకౌముది" గ్రంథమునందు సంస్కృతాంధ్ర ప్రాకృతములు వరుసగ బ్రహ్మ విష్ణు రుద్రులకు ప్రియములైనవి. సంస్కృతాంధ్రములు దేవతలకు యోగ్యములు. సంతోషకరములు. దేశములం దాంధ్రదేశము, భాషల యందు సంస్కృతాంధ్రములు శ్రేష్ఠములు. ఆంధ్రసంస్కృత భాష లతో కవిత్వము రచించుట ముక్తిప్రదము. నారాయణుని యను జ్ఞచే కణ్వమహర్షి యాంధ్రవ్యాకరణము రచించెననుటకు ప్రమాణ ములను చూపియున్నాడు. వాటి నిచ్చట వరుసగ పాఠకుల ప్రమోదా ర్థము వ్రాయుచున్నాడ.

అథర్వశిఖోపనిషత్తు :

త్రిమూర్తీనాం సంస్కృతాంధ్ర ప్రాకృతాస్తు ప్రియంకరాః ॥
కణ్వస్మృతి :-
ఆంధ్రసంస్కృతభాషాస్తు దేవతార్హాః ప్రమోదదాః ।
సుబంతైశ్చ కృదంతైశ్చ యుక్తా స్స్వర్గప్రదా నృణామ్॥
ధర్మరాజస్తు యథాఽఽహ :-
బ్రాహ్మం జన్మ, సుదేశేషు త్రిలింగం, దైవతం హరిః ।
రాజా కురూద్భవో, భాషా సంస్కృతాంధ్రమయీ తథా॥
స్మృత్యంతరేచ
ఆంధ్రసంస్కృత భాషాభ్యాం కవిత్వ మృషిత్వాపదమ్ ॥
పునః కణ్వస్తు యథాఽఽ హ -

ఆంధ్రపిష్టో రనుజ్ఞాకృతస్య మద్వ్యాకరణస్య ద్రోహీ గురు ద్రోహీ,,

ఇచ్చట సంస్కృతము, ఆంధ్రము వేరువేరుగ చెప్పఁబడుట చేత రెండు వేరు వేరని సందు దొరకేగదా ? యని పురోభాగు లెరుగుదురు.

ఇట్లు ఆంధ్రము సంస్కృతము లని వేరు వేరుగఁ జెప్పుచు తొల్లి నుడివిన వేదోక్తశతాక్షరభాషయొక్క భాగద్వయ మగుటయే కాని యన్యత్వముచేతకాదని యెఱుంగఁ దగును. ఆశతాక్షరభాష యొక్క సంస్కృతము ఆంధ్రము నను రెండు భాగములు నామతః గ్రహింపబడిన వని తెలియవలెను. ఆంధ్ర మనెడి యొక్క భాగమని గ్రహింపనగును.

అనఁగా శతాక్షర భాషయొక్క సంస్కృత మనెడు భాగము ఆంధ్ర మనెడి భాగము అను రెండు భాగములయొక్క పేళ్లు చెప్పఁబడిన వని భావము. ఇందుల కనియే "బ్రాహ్మం జన్మ" యను శ్లోకము నందు జన్మ, దేశ, దేవ, రాజ భాషలలో నుత్తమములనుఁ బేర్కొను టలో సంస్కృతాంధ్రమయమైన భాష యని రెంటినిఁగలిపి యేకవచన ముగ చెప్పబడినది. ఇట్లే కవచనముగ నుడువుట సంస్కృతాంధ్ర నామకరములైన రెండు భాగములు కలసిన శ్రుత్యుదితశతాక్షర భాష యని సంప్రదాయవేత్తలు నుడువుదురు.

యజుర్వేదము శుక్లయజుర్వేద మని కృష్ణయజుర్వేదమని రెండు విధముల నున్న వడువున యా శ్రుత్యుక్త శతాక్షరభాష సంస్కృతము ఆంధ్రము నని రెండు భాగములుగ నున్నది.

ఈ యాంధ్రభాషా ప్రశంసయందు ఆంధ్రవేదద్రష్టయైన శ్రీ రామదాసుగారి నొకమారు ప్రణమిల్లి మరొక విషయమునకు మఱలుదము.

శ్లో॥ "ద్రష్టార మాంధ్రవేదస్య
రామదాసం భజేఽనిశమ్
బహుప్రీహౌ తత్పురుషే
ఉపయన్వర్తతి యదాహ్వయః"

ఇట్లు దేశమును భాషనుగురించి నుడివి దేశప్రజలను గూర్చి నుడువుట అసంమంజసము కాదా. గాన వారిని గూర్చియు కొం ముచ్చటించి యీ యుపన్యాసము ముగింతును.

ముందుదేశమునకు రెండువిధములగు భిన్న కారణములచేతన భాషకు మరియొక హేతువు చేతను యాంధ్రయని యొక్కటియే సంజ్ఞగలిగిన వింతయటులుండ ఇచ్చటి జనులకు నాంధ్రమును మాటలాడుటచే గాన మరియొక కారణచే నాంధ్రులనియే పేరుగలిగినది. ఎట్లన శతాక్షర భాషను సాత్వికులు బ్రహ్మయొక్క అహోరూప దేహజాతులై ధరించి యాంధ్రులన బరగిరియట. ఈ విషయమును మాతాతగారిపై గ్రంథములోని,

శ్లో॥ భాషాచవిహితా తద్వద్బ్రహ్మణాఽధశతాక్షరా
అహ స్తన్వాధియం త్యాగేయస్మాదాంధ్రా స్స్మృతా స్తతః ॥

అను శ్లోకముయొక్క వ్యాఖ్యానములో బహువిశదము గందేలుపబడి యున్నది. ఇట్లు దేశమునకొక కారణముచేతను భాషకు మరియొక కారణముచేతను జనుల కింకొక కారణముచేతను నొక్కటే పేరుగల్గుట భోజనప్రియులకు పప్పన్నము మీద పప్పన్నమన్నట్లు భాషాప్రియులకు వింత మీద వింత.

ఐతే సంస్కృతములో ఒక్కొక్క శబ్దము బహువిధ సమాస ముతో సిద్ధించియుండనిది యేమివింత యన్నచో దెలిపెదను. అట్లు బహు సమాసములతో సిద్ధించిన శబ్దముయొక్క వ్యక్తికే వాచకముగా నుండునుగాని దానికి సంబంధించిన అన్య వ్యక్తులకు వాచకమునాదు. ఎట్లన ? విష్ణుపర్యాయములలో నారాయణ కృష్ణమాధవ కేశవశబ్దము లకు ఒక్కొక్కదానికి ౩-౪ విధములైన సమాసములుగలవు. ఇన్ని విధములైన సమాసములతో సిద్ధించిన ఒక్క విష్ణువునకే నామమైన శబ్దము వేరు విధముతో సిద్ధించి యాయన సంబంధమైన యితర వ్యక్తులకు వాచకములుగావు. ఇట్లే దేవాన్తర పర్యాయములందు వస్త్వంతర పర్యాయములయందును గలశబ్దములలో కొన్నియనేక విధ సమాసములు గలిగినను అన్ని విధములైన సమాసములు గలిగి యే యొక్క దేవతనో వ్యక్తినో చెప్పునేకానీ దాని సంబంధమైన యితర వస్తువును జెప్పవు. ఆంధ్రశబ్దమన్న నోనొక్క సమాసము

మే

కలిగి దేశమునకు మఱియొక సమాసముతో సిద్ధించి భాషకు వేరొక విధమున సిద్ధించి భాషమాటలాడు జనులకున్నూ వాచకంబగుటయే ఏంత.

ఐతే నానార్థములలో పుండరీకాది పదములు కొన్ని యొక్కొక్క యర్థమునందొక్కొక్క విధమైన సమాసము గలిగి యుండలేదా ? యన్నచో భిన్నభిన్న సమాసములతో సిద్ధించిన శబ్దమునకు అర్థభూతములైనవ్యక్తులు ఎన్నియైన నొకదానితోనొక దానికి సంబంధమేమియు లేదుకదా ? ఉదా :- పుండరీకశబ్దము తెల్ల దామరకు పేరైనప్పుడు పుణతి (పుణ్యశుభకర్మణి) శుభకర్మము నొనర్చునదియనియు, పెద్దపులికి పేరైనప్పుడు పుండం మాంసందీకతి ( ) మాంసము హరించునదియని వేరువేరు వ్యుత్పత్తులతో నొక్కటిగ సిద్ధించినది. పుండరీక శబ్దమునకు అర్థభూతములైన శ్వేత పద్మ శార్దూలములకేమి సంబంధముగలదు ? ఇట్లే పెక్కులుకలవు. ఇది సహృదయుల పరస్పర సంబంధముగల దేశమునకు భాషకు జనులకు వేర్వేరు కారణములచేత వేర్వేరు సమాసములతో ఒకే రూపమున నిష్పన్నమైన యాంధ్రశబ్దములో వింతగలదో ? పరస్పర సంబంధములేని శ్వేతపద్మ శార్దూలములకు వాచకముగ వేర్వేరు సమాసములుగల పుండరీకాది శబ్దముల్లో వింతగలదో ? యూహింతురు గాక?

## అనుబంధము

### 1. భరతవర్షమను పేరు ఏ భరతుని వలన కలిగెను.

పూర్వదక్షిణ పశ్చిమ దిశలయందు సముద్రముల యొక్కయు నుత్తరమున హిమాచలము యొక్కయు నడుమ నుండు భూభాగమునకు శకుంతలా దుష్యంతుల పుత్రుండైన భరతుండు పాలించినందున భరతవర్షమని పేరు కలిగెనని హిందూదేశ కథా సంగ్రహము మున్నగు ఇప్పటి దేశచరిత్రలలో వ్రాసియున్నది. అవ్రాత నిర్మూలము. ఈ శకుంతలా దుష్యంత పుత్రుండైన భరతుని కన్నను బహుకాలము ముందటివాడు సృష్టిప్రారంభమునకు దాదాపు కాలములోనివాడు స్వాయంభువ మనువు యొక్క నాలగవ తరము వాడమైన ఋషభుని జ్యేష్ఠ పుత్రుండగు భరతుండేలినందున భరతవర్షమని పేరు గలిగెను. ఇందుకు విష్ణు పురాణము నుంచి ప్రమాణముంజూపి యున్నాను-

### 2. ఇంద్రశబ్ద విశేషము

ఇందు దేవతుల యొక్క పరోక్ష ప్రియత్వమునకు ఉదాహరణముగ నివ్వంబడిన యింద్ర శబ్దమునకు పరమాత్మయైన శ్రీమన్నారాయణుండు వాచ్యుండు గాని యష్టదిక్పాలురలోం జేరిన శచీపతికాదు, ఇంద్ర శబ్దము శచీపతికి వాచక మయ్యేనేని ఇందతీత ఇంద్రః అని సమాసము. పరమైశ్వర్య యుక్తుండని యర్థము. ఇది పరమైశ్వర్యే యను ధాతువు. ఈ యింద్రశబ్దమునందు పరోక్షత్వములేదు.

అయినచో పరోక్షత్వముచే రూపాంతరము నొందక యథారూపముగ నిలచియున్న శచీపతి వాచకమైన యింద్రశబ్దమును వదలి తొలుత ఒక విధముగ నిష్పన్నమైన పరోక్షత్వముచే రూపాంతరము నొందిన పరమాత్మ వాచకమైన యింద్రశబ్దమేల దృష్టాంతముగ నివ్వబడెననంగా ?

పరమాత్మయగు శ్రియఃపతి సంబంధమైన దేశమును గుఱించి చెప్పునపుడు పరమాత్మ వాచకమైన శబ్దమునే నిదర్శనముగా నిచ్చుట సమంజసము.

మఱియు పరమాత్మ వాచకమవునప్పుడు ఇంద్రశబ్దముయొక్క నిష్పత్తి వైదికము. అందుకు ఐతరేయోపనిషత్ ౨వ అరణ్యకంల వ అధ్యాయం ౧౪వ మంత్రము "తస్మాదిదంద్రో నామేదంద్రో హవై నామ తమిదంద్ర సంత మింద్ర మిత్యాచక్షతే పరోక్షేణ పరోక్షప్రియా ఇవ హిదేవాః— అని గలదు, కాన తతోఽసౌ యజ్ఞియ స్స్మృతః అని యజ్ఞాది వైదిక క్రియలకు యోగ్యమైన దేశమునకు వైదిక నిష్పన్నమైన శబ్దమునే యుదహరించుట సూక్ష్మజ్ఞత.

కొందరు కాళహస్తి శ్రీశైలము ద్రాక్షారామములను మూడు క్షేత్రములందలి మూడు లింగములనడుమ నుండుటచే నాంధ్రదేశము త్రిలింగమనంబడె నందురు. వీటిలో దక్షిణమున కాళహస్తి చిత్తూరు జిల్లాలోనిది. ఉత్తరమున ద్రాక్షారామము గోదావరి జిల్లాలో కాకినాడకున్ను దక్షిణమున ౧౬ మైళ్లలో గలదు. దక్షిణోత్తరముల నీరెండు వూళ్లకన్నను పైన చాలా యాంధ్రదేశముగలదు. కాన యీ యెల్లల వలనపైనవున్న యాంధ్రదేశము యాంధ్రదేశముగా భావింపంబడదు. ఈ యెల్లలు యాంధ్రదేశముయొక్క సహజమైన వైశాల్యమును కుదించునవిగా నున్నవి.

ఆంధ్రదేశమే తల్లింగత్రయాస్తర్వర్తియైనందున త్రిలింగమనంబడు ననుటకు నొక్క కథ యాంధ్రకౌముదిలోం గనుపించుచున్నది.. ఎద్దియన ?

తొల్లిస్వాయంభువమను కాలములోం గలియుగమునందురుద్రుండు కాళేశము (కాళహస్తి) శ్రీశైలము ద్రాక్షారామము (భీమేశము) మహేంద్రపర్వతములను ఉన్నత ప్రాకారముగా నొనర్చి మూడుద్వార

ములంగావించి యాద్వారములయందు తానులింగమూర్తియై ప్రమథుల తోఁటినుండెను. ఆంధ్రనాథుండైన నారాయణుండు సురపరివృతుండై లోననిశుంభుఁడను దైత్యుని 'బరిమార్చియటనివసించె. నాటంగోలి యాక్షేత్రము త్రిలింగమనబడెనని ఇయ్యతహాసము చక్కగ విమర్శింపకముందు శాస్త్రాంతరప్రత్యక్షములరెంటికినీ విరుద్ధముగనున్నది. యని తోఁచును ఎట్లన? ఇందు శాస్త్రములంజెప్పియున్న విశాలమైన దేశము కన్నను ప్రత్యక్షములోను విశాలముగనున్న దేశముకంటెను తగ్గించి యెల్లలు చెప్పియున్నవి. విశాలముగనుండు దేశమునకుపెక్కు తగ్గించి కొన్నిహద్దులంజెప్పి యీలోపలనే యాంధ్రదేశమని చెప్పుట ప్రత్యక్ష విరోధము అందరకుందెలియును. ఇంకశాస్త్రములలో నాంధ్రదేశపు టెల్లలంజూచిన రెండవ విరోధము తెలియును. ఎట్లన?

శాస్త్రములయందుత్తరమున జగన్నాథము మొదలు దక్షిణమున చోళదేశమధ్యము వరకు నాంధ్రదేశమనిచెప్పఁబడియున్నది. తారానాథ తర్కవాచస్పతి వాచస్పత్యములో జనపదశబ్దములో ౩౦౨౨వ పుట శ్లో॥జగన్నాథా దూర్ధ్వభాగాదర్వా క్ర్చీ భ్రమరాంతికాత్। తావదాంధ్రస్స విజ్ఞేయః-అనియు (ఇచ్చట భ్రమరాన్తికాత్ అన నంటికాత్రయములోని భ్రమరాంబికకు నివాసమైన శ్రీశైలము) శ్రీశైలాత్తు సమారభ్యచోళే శాన్మధ్యభాగతః। తైలంగదేశో విజ్ఞేయోధ్యానాధ్యేయన తత్పరః॥ అనియు ద్రవిడతైలంగ యోర్మధ్యే చోళదేశ్యః ప్రకీర్తితః॥ అనియు దేశములయొక్క యెల్లల నుడువుటయందు శక్తిసంగమ తంత్రము నుంచి ప్రమాణముల జూపియున్నాఁడు.

అనగా జగన్నాథము మొదలు శ్రీశైలమువరకు నాంధ్రదేశము శ్రీశైలమునుంచి చోళదేశమధ్యముదనుక తైలంగదేశమనియు నర్థము.

ఆంధ్రదేశములో నుత్తరమునందు కొంతభాగము కళింగదేశమనియు కొంతభాగము అనఁగా కృష్ణా గుంటూరుజిల్లాలు విదర్భదేశమనియు (చూడుడు గురుజాడ శ్రీరామమూర్తిగారి కవి జీవితములయందు కృష్ణరాయచరిత్రములో చివర శృంగారకవులప్రశంస) చెప్పఁబడునట్లు శ్రీశైలాది చోళదేశమధ్యమువరకు తైలంగదేశమని నుడువంబడును, తెలుంగునే యుత్తరహిందూదేశములో తైలంగమని యుచ్చరింతురని తెలియుచున్నది. తైలంగదేశ మాంధ్రదేశభాగమనుటకు 1. ఆంధ్రదేశాంతస్థమైన శ్రీశైలము మొదలుకొని తైలంగదేశమని నుడువుటయు. 2. అరవదేశమునకు తైలంగదేశమునకు మధ్యముననుండు చోళదేశములో సగమువరకుఁ తైలంగమనుటయు. 3 చోళదేశములో చోళభాషయని తైలంగదేశములో తైలంగభాషయని వెవ్వేరుభాషలు లేమియు ఈమూఁడు కారణములు చాలును. ద్రవిడ తైలంగదేశమధ్యమున చోళదేశముగలదనుటచే చోళదేశము అరవదేశములో సగము తైలంగదేశములో సగము వ్యాపించియుండును!

అనఁగా చోళదేశములో తైలంగమనంబడు తెలుంగు దేశము సగమునకుఁబైన దక్షిణమున ద్రవిడదేశముమొదలు అగును.

ఈతైలింగదేశము చోళదేశములో సగముదనుక గలదనుఁ చోళదేశము యొక్క యెల్లలు ముందు ఎఱుంగఁ దగును.

వైష్ణవ తిరుపతులలో నుత్తరదేశపు తిరుపతులు తొండదేశ తిరుపతులు చోళదేశపు తిరుపతులు పాండ్యదేశపు తిరుపతు ఇత్యాదిగా నాయాతిరుపతులు దేశవిభాగపూర్వకముగా గలవు. తిరుపలనఁగా నాళ్వారులుచే అరవ ప్రబంధములలో స్తోత్రము జేయఁ నవి. అట్టి తిరుపతులలో నుత్తరదేశపు తిరుపతులలోనికి తిరుః మొదటిది. అంతకు దక్షిణమున తొండదేశపు తిరుపతులు. ఈతొం దేశము సంస్కృతములో తుండీరదేశమని చెప్పఁబడునది. ఈతొం దేశపు తిరుపతులు కంచి తిరువళ్లిక్కేణి తిరువళ్లూరు మున్నగున ఈతొండదేశమునకుపైన దక్షిణమునందు చోళదేశపు తిరుపతు పూర్వము చోళదేశమునకు కాంచీనగరము రాజధానిగ నుండిన చరిత్రములు చెప్పుచున్నవిగాన యీభాగమున్నూ పూర్వము చో దేశముగానే యెన్నఁబడుచుండెడిదియని యూహింపనైయున్నది.

ఎట్లులైనను చోళదేశము దక్షిణమునందు కావేరివరకు నావరిం యున్నది. కాన శ్రీశైలాత్తు సమారభ్య చోళేశా న్మధ్యభాగతః తైలింగదేశః - అని శ్రీశైలము మొదలుకొని చోళదేశమధ్యము దను తైలింగదేశ మని చెప్పఁబడు నాంధ్రదేశభాగము చోళదేశములో సగము వరకు నావరించి యున్నది. కనుక కావేరిగట్టున నుండు చో దేశాంతర్గత శ్రీరంగము చెన్నపురికి దక్షిణమున దాదాపు(250) రెండ వందలాయేఁబదిమైళ్ల దూరమునఁ గలదు. కావున నందులో సగమ 125 నూటయిరువదిఐదుమైళ్లు. కనుక తైలింగదేశాఖ్యమైన యాంధ్ర దేశ భాగము చెన్నపురికి దక్షిణమునందు (125) నూటయిరువదిఐద మైళ్లు నావరించియుండును. తొండమండలమున్ను యీ లోనిద కనుక యాంధ్రదేశములోనిదే నని వేరుగఁజెప్పఁబని లేదు.

ఈ చోళదేశ తొండమండలము లాంధ్రదేశభాగములు కనుకనే నట నుండు వారిలో బహుమంది యాంధ్రదేశ సంప్రదాయమైన యింటి (వంశము) పేరు కలిగియుండుట పొసఁగినది. వా రాసూరివారు ప్రతివాది భయంకరమువారు, మున్నగువారు.

ఈ యింటిపేరు నాలుగు (4) విధములఁ గలుగుచుండును. 1. తమ పెద్దలు బహుకాలము నివసించిన యూరిపేరింటిపేరుగ వచ్చునది. ఇట్టివంశములే బహుసంఖ్య కలవిగ నున్నవి. పర్ణశాలవారు మొదలైనవారు ఇట్టివారు. (ఈ పర్ణశాల భద్రాచల సమీపములోనిది. 2. తమ వంశములో చాల ప్రసిద్ధుండైన పూర్వ పండితునియొక్క

కాని బిరుదము కాని వంశమున కంతయు (గౌరవముగ) చిహ్న
《 గలుగుట ఉత్తరాంధ్రమున చిత్రకవివారు మున్నగువారు, దక్షి
ధ్రమున ప్రతివాది భయంకరము మొదలగువారు. మా వంశము
వి కాల యను నామము శ్రీభగవద్రామానుజాచార్యులవారి శిష్య
వ శ్రీమాన్ నరసింహాచార్యులవారికి 3. యాచార్యదత్తమైన బిరు
ు. ఇవ్విషయ శ్రీమాన్ మా తండ్రిగారు శ్రీరామానుజాచార్య
శిష్టా వైభవమునందు కాంచఁదగినది. 4. పెద్దలలో నొక్కరేదేని
ఒక శాస్త్రమునందు గొప్ప పేరుఁ గాంచినను యా శాస్త్రము పేరిటనే
ు మొదలు చెప్పబడుటయుఁ గలదు. భారతమువారు మున్నగువా
వారు. 5. పెక్కు తరములు పెద్దలవలంబించిన వృత్తిపేరింటి
గ నగుటయుఁ గలదు ఇట్టి వంశములు చాలయరుదుగ నున్నవి.
రీతి నింటిపేరాంధ్రులలోనే కాని యరవలలో లేదు. కాన తొండ
ండలమున్ను చోళదేశపు యుత్తరపు సగము నాంధ్రదేశము కనుక
దుండు వారాంధ్రసంప్రదాయకమైన యింటిపేరు (వంశనామము)
గియున్నారు.

వంశములోని పూర్వపండితుని పేరు వంశమునకు వచ్చుటకు
శరధివారు మున్నగువారు. (దాశరధి యనఁగా భగవద్రామానుజా
ర్యులవారి మేనల్లుఁడు. అరవములో మొదలియాండాన్ అనబడు
రు.)

ద్రవిడ తైలింగయోర్మధ్యే చోళదేశః అనినందున చోళదేశ
ాంధ్రదేశములో సగము అరవదేశములో సగమని తేలినది. కాన
ంధ్రదేశమందలి చోళదేశముయొక్క యుత్తరార్థమునకు తైలింగ
శమని పేరు. దీనికి దక్షిణమునందు ద్రవిడదేశము అనఁగా నరవ
శము మొదలు.

ఇట్లు తైలింగదేశము ఆంధ్రదేశభాగ మగుటచేతనే యాంధ్ర
శమునకు పశ్చిమోత్తరముల నుండు భాషాంతరీయుల తైలంగశబ్ద
ున కాంధ్రమని యర్థము వ్రాయుదురు. ఎట్లనిన? బొంబాయి
ర్ణయసాగర ముద్రాలయములో 1935 సం॥రమున ముద్రితమైన
భాషిత రత్నభాండాగారము నందు 200వ పేజీలో నాలగవదియైన
త్రప్రకరణమునందు బహిరాలాపములలో

శ్లో॥ కి మస్తి యమునానద్యాం జారా న్కిం వక్తి జారిణీ
ఆంధ్ర గీర్వాణ భాషాభ్యా మేకమేవో త్తరం వద ॥౩౪శ్లో॥

యను శ్లోకమును వేసి ఆంధ్ర గీర్వాణ శబ్దములకు పైన
గురుతుగా రెంటిని వేసి గీటుక్రింద తిఱుగ యా రెండు అంకెను వేసి
(ఫట్ నోట్‌తో) ఆంధ్రగీర్వాణ శబ్దములకు తైలింగభాషయా
సంస్కృత భాషయాచయని యర్థమును వ్రాసియున్నారు. ఇట్లే
కాశీలోను కలకత్తాలోనూ అచ్చయిన గ్రంథములయందు తైలంగ
శబ్దమున కాంధ్రమని యర్థమును వ్రాసియున్నారు.

ఇనచో కొన్నితావుల పంచద్రావిడులను చెప్పుటలో నాంధ్రులను
తైలంగులను వేరువేరుగఁ బేర్కొనుటచేత నీ రెండు వేరువేరని తలంప
గూడదు. ఆంధ్రదేశములో గోదావరికి నుత్తరమున కళింగదేశ మని
కృష్ణాజిల్లా విదర్భదేశమనియు నుడువబడు రీతిని శ్రీశైలము మొదలు
చోళదేశ మధ్యమువరకు తైలంగదేశమని యానడుమ కొంత తొండ
దేశమనియు చెప్పఁబడునని తెలియఁదగును.

అందఱకు శాస్త్రము నొక్కటియే యైనను యేదోకొంత
యాచారభేదముచేత పంచద్రావిడు లని పంచ గౌడులని వేరువేరుగ
వాకొనినమాదిరి యొక్క యాంధ్ర దేశములోనే తైలంగ మను భాగ
ములో నవుదేదియో కొంత యాచారభేద ముండుటంగని దానిని వేరుగ
జెప్పియుందురే కాని దేశము వేరైకాదు.

ఇన్ని భాగములుగ నున్నను ఈ తెనుఁగుదేశము పూర్వోక్త
రీతిగ అకార వాచ్యుఁడైన శ్రీమన్నారాయణుని (వాహనమై) ధరించు
వాఁడగుటంజేసి యందుఁడనం బరఁగిన గరుడునిచే దేవతలకున్ను,
తద్వారా భూలోకమునకు వచ్చుటచే నాంధ్ర మనంబడిన యొక్క
(తెనుఁగు) బాసయే (వాడుకభాషగ) కలిగినందునను, అకారవాచ్యుం
డైన నారాయణుని నాయకునిగ ధరించుటం జేసియు తిరుపతి ముఖ్య
చిహ్నముగ గలది యగుటచేతను మొత్తముదేశ మాంధ్రదేశ మని
నుడువంబడుచున్నది.

ఇట్లు దేశమునకు దక్షిణోత్తరములయం దింతటి వైశాల్యమును
నుడివెడు శాస్త్రాంతమునకు విరోధముగ నున్నది.

ఒకవేళ యాంధ్రులు పూర్వోక్తగాధనాటికి యా త్రిలింగ మధ్య
దేశములోనే యుండి కొంతకాలమునకు ఉత్తర దక్షిణములయందు
జగన్నాథము మొదలు చోళదేశమధ్యమువరకు నావరించియుందురు. అట్లు
వా రంతవరకు నావరించినపిదప శక్తిసంగమ తంత్రము రచింపఁబడి
క్రమముగ తనకాలమునకు వచ్చిన యంతటి వైశాల్యమును చెప్పిన
దేమో? తొల్లింటికథను నుడివిన పురాణము శక్తిసంగమ తంత్రము
రెండును అక్షరములు. ఆర్షగ్రంథములలో నేది ముందు నేది వెనుక
రచింపబడినది నిర్ణయింపనలవి కాదు.

అష్టాదశ మహా పురాణములయందు ప్రతి పురాణమునందు
పురాణముల పేర్లను చెప్పెడి పట్టికలో న ష్టాదశ మహాపురాణముల పేర్లు
చెప్పఁబడి యుండును. ఏ పురాణము ముందు రచిత మైనదియు
నిర్ణయింపగలము?

కనుక నీ లింగత్రయము కన్నము నావలను పెక్కువైశాల్యము
కలదేశ మీలింగత్రయము లోనిదే యనుటకంతెను ఆ పర్వత ప్రాకా

శము లోపల నాంధ్రనాథుండైన నారాయణుండు నిశుంభుని సంహరించి నివశించె నన్ని యున్నది కనుక ఆంధ్రదేశము నకంతటికి నాయకుండై మధ్యమునందుండు నారాయణునకు రాచనగరికి చుట్టు కోటవలె నుండు యీ పర్వతచతుష్టయమునకు శ్రీశైల భీమేశ కాళేశములనెడు ద్వారముల వసించి యుండు యాలింగత్రయములోపల నుండు యాంధ్రదేశ భాగము త్రిలింగ మనంబడునన బాగుగ నుండును. అన్నగా విశాల విశాలతమమైన యాంధ్రదేశములో నాత్రిలింగమధ్యస్థ భాగమునకు త్రిలింగ మనిచెప్పనగునని

ఆ త్రిలింగ సమధిష్ఠిత శ్రీశైల భీమేశ కాళేశ నామద్వారములు కల శ్రీశైల భీమేశ కాళేశ మహేంద్రగిరులు కోటకాఁగా శ్రీకాకుళము రాజధానిగ యావదాంధ్ర దేశమునకు నధీశ్వరుండైన శ్రీమన్నారాయణుండు ఆంధ్రనాయకుండై వెలుంగుచున్నాఁడని భావింప నగును.

**లింగభూతములైన వేంకటాచలాదులలోని విశేషము**

ఇంకను మా తాతగారు ప్రతిపాదించిన త్రిలింగశబ్దమునకు లింగమనఁగా చిహ్నము కావున మూఁడు చిహ్నములు కలది యని యర్థము. ఏమి చిహ్నమనఁగా గౌరవ చిహ్నము. ఐనను యింకను పురాణాగమప్రసిద్ధములైన యనేక హరిహర శక్తి క్షేత్రము లుండ నీ తిరుపతి యహోబలము భద్రాద్రి యనెడు మూఁటినే విశేషించి చిహ్నములుగ చెప్పుటకు వీటియం దేమి విశేషము కలదన వేంకటాచలము భద్రాచలము వేదోక్త శతాక్షరభావ కొక్కభాగమైన సంస్కృత భాషయందలి వేదమునం బ్రతిపాదితములు. ఎట్లనిన ?

ఋగ్వేద శాకలసంహిత ఎనిమిది యవయష్టకము ఎనిమిదవ యధ్యాయమునందు వర్గమునందలి.

మం॥ అరాయి కాణే వికటే గిరింగచ్ఛ సదాన్వే
శిరింబిఠస్య సత్వభి స్తేభిష్ట్వా చాతయామసి॥

అను మంత్రము శ్రీవేంకటేశ్వర పరమైనది.

ఇవ్విషయము మా తండ్రిగారు రచియించిన తరిగొండ వేంగమాంబా విజయములో చదువఁదగును. ఇఁకను భద్రాచలము అశతాక్షర భాషయొక్క రెండవభాగము విష్ణుప్రియమునైన యాంధ్ర భాషయందు వెలసినవేదమైన దాశరథి శతకమునందు స్తుతింపఁబడినది ఈయంశము మా తండ్రిగారి యాంధ్ర వేదమునందు కనుగొనందగు.

అహోబలము నారాయణుకు విభవావతారములలో నరసింహావతార మెత్తిన క్షేత్రము. నారాయణుఁడు నరసింహావతార మెత్తినది యహోబలమునందను విషయము మాతండ్రిగారి మహాత్మ్య సంగ్రహములో నుపదేశించిరి. ఇట్టివిశేష మెద్దియు నేహరిహర శక్తి క్షేమములలోనులేదు.

కాళహస్తి శ్రీశైల ద్రాక్షారామములను శాస్త్రాంతర ప్రతిష్ఠానుభవములలో నున్నయెల్లలు కన్నను మిగులబోబడిన వగుటచే దేశమున కెల్లలుగను, వేంకటాచలాదులయందుండు విభవావ వేదోక్తిత్వాది విశేషము లెవ్వియు లేక అన్ని క్షేత్రములవలె కేవల (మొక్కము పురాణప్రతిపాదితత్వము మాత్రము కలవి యగుటచే దేశమునకు గౌరవ(కర) లింగములుగ వక్కాణించుట యోగ్యమా ? వేదస్తుతత్వ భగవద్విభవావతారక్షేత్రత్వము లనెడు విశేషములు కల వేంకటాచల భద్రాచల అహోబలాచలములను దేశమునకు (గౌరవ) లింగములుగ వక్కాణించుట యోగ్యమో ? పండితలోకము గ్రహింపఁగలదు.

పురాణ మి త్యేవ న సాధు సర్వం
న చాఽపి కావ్యం న వమిత్యవద్యం
సంతః పరీక్ష్యా ఽన్యతర ద్భజన్తే ॥
" .... .... ... ... "

తా॥ ప్రాచీనమైనదని యంతయు మంచిది కాదు. క్రొత్తవాడు రచించినదని యంతయు చెడుదికాఁదు. పండితులు చక్కఁగ చూచి బాగుగ నుండునానిని స్వీకరించెదరు.

ఇట్టివిశేషము లితరక్షేత్రములలో లేవా యనతెలిపెదను. ద్రవిడ (అరవ) దేశములో ననేక క్షేత్రములున్నను అచ్చట క్షేత్రములలో నేయొక్కటియూ వేద ప్రతిపాదితము కాకుండుటయు, నచ్చట నారాయణుఁడే విభవావతారము నొంద కుండుటయు నను రెండు లోపములు కలవు. ఉత్తరమున కొన్ని క్షేత్రములు- నారాయణుఁ డచ్చటనే యనేక విభవావతారముల పొందుటయు నను రెండు విశేషములున్నను అచ్చట యేక్షేత్రమున్ను వేదప్రతిపాదితము కాఁ లేదను యొక్క కొదువ యున్నది. ఇటొక్కొక్క దేశములో నొకటి రెండు లోపములుండి యాంధ్రదేశములోనే లోపము లేకుండ మూడువిశేషము లుండినందున నీదేశమునకే త్రిలింగ మను సంజ్ఞ విశేషముగ చెప్పఁబడినది.

కడమ దేశములలో నిట్టి మూఁడుకాని యంతకంటె నెక్కువ కాని విశేషములు లేమింజేసి యాదేశముల కిట్టి విశేషనామ మెద్దియు కలుగదయ్యె.

ఈ వేంకటాచలాదిగిరిత్రయ మాంధ్రదేశమునకు చివరయందు హద్దుగగాక దేశమునకు లోపల చిహ్నముగ నున్నది. ఇందు కాంధ్ర దేశ మాగిరిత్రయమున కావలిభాగమునందును పెక్కు వుండుట ప్రత్యక్ష నిదర్శనము. కాననే పెద్ద లీగిరిత్రయ మాంధ్రదేశములోపల యజ్ఞశాలయం దగ్నిత్రయము చందమున వెలుగుచున్నదని ప్రశంసించుట కలిగెను. ఇందుచేత యాగశాలయొక్క లోపలనుండి యాగశాల గోడలా యగ్ని త్రయమున కావల కొంత దవ్వున నున్నట్టు తగిరిత్రియ మాంధ్రదేశపు చివరియం దంటియుండక యాంధ్రదేశములో నుండి యాంధ్రదేశమాగిరి త్రయమున కావలను పెక్కు కలిగియున్న దని తేలినది.

## 4. విదర్భదేశము

ఆంధ్రదేశములోని విదర్భదేశము కాక బొంబాయిరాజధాని లోను విదర్భమను పేర నొకదేశ మున్నట్టు వినవచ్చుచున్నది. కాని నొక్కపేరుకల దేశములు రెండుండునా ? యని శంక కలుగును. అందుకు విదర్భరాజ వంశీయులు రెండుచోటుల రాజ్యము కలిగియుండవచ్చును. అక్కారణముచేత రెండుతావులను విదర్భదేశమని వ్యవహారము కలిగియుండనొప్పును. ఇప్పుడు పాకిస్థానము భారత దేశమున కిరుప్రక్కలా నాపేరనే పుట్టినది కదా ? అదియు నిట్టులే అయియుండవచ్చును. అయినచో రుక్మిణి పుట్టినదియే విదర్భ మందని వచో రుక్మిణి పుట్టిన కుండినగర మాంధ్రదేశమందలిదేనని వృద్ధజను లందరు నుడివెదరు. గుంటూరుజిల్లాలో కొండవీటిసీమలో పెద్ద లప్పటివారున్ను రుక్మిణి పుట్టిన దేశమిదియేనని చెప్పెదరు. కాన రుక్మిణి పుట్టిన విదర్భదేశ మాంధ్రదేశము నందలిదియే నని నిర్ణయము. ఇట్లే దానివ్యాఖ్యయందు నుక్తము. అత్రాఽన్తర్భూతఏవ కుండిన నగరదేశ ఇతి బహువృద్ధజనవాద మనుసృత్యే దముక్తమ్॥ అని. అయినచో కృష్ణుడు రుక్మిణిని గొనిపోవుటకు ద్వారకనుండి విదర్భ దేశమున కొక్కరాత్రి రాత్రిలో చేరెనని భాగవతములో చెప్పబడినది కనుక ద్వారకకు దగ్గరనుండు బొంబైరాజధానిలోని విదర్భదేశము నందే రుక్మిణి పుట్టియుండెనేని ద్వారకనుండి యట కంతతొందరగ రాగలిగె నందురేమో ? అత్యంతబాల్యమునందే తండ్రియైన నందుని వరుణలోకమునుండియు, విద్యాభ్యాసము పూర్తిగావించిన క్రొత్తలలో గురుపుత్రుని యమలోకమునుండియు (నాటి చిరకాలములోనే తెచ్చిన పరమాత్మయైన కృష్ణునకు యౌవనమునందు ఒక్క భూలోకములోనే ద్వారకనుండి కొంతదూరమున నుండు యాంధ్రదేశాంతస్థమైన విదర్భదేశమున కొక్కదినములో వచ్చుటయం దేమి సందియము ?

సౌరమాన చాంద్రమాన నుష్ఠానమునకు ద్రావిడాంధ్ర నిర్ణయములేదు ఆంధ్ర ద్రావిడదేశములయొక్క హద్దులను ప్రతిపాదించు సందర్భములో నొక్కలు శేషాచలమునకు దక్షిణమునందు సౌరమాన మనుష్ఠింపదగినది కదా? ఆ సౌరమాన మరవల కాచరణీయము. శేషాచల (తిరుపతి) మున కుత్తరమునందు చాంద్రమానము గ్రాహ్యము. అది యాంధ్రుల ( తెలుగుల ) కాచరణీయము. కాన తిరుపతికి దక్షిణమునుండియే యరవదేశము. ఉత్తరమునందే యాంధ్రదేశ మగును కదా ? యని యడిగిరి. వారట్లు మోసపోవుటకు కారణము కొందరి సిద్ధాంతులయొక్క పంచాంగములలో శేషాచలస్య దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యః అనెడు వ్రాత. అట్లుకాదు. ఈ సౌరచాంద్రాది మాసములు ఒక్కొక్కదేశమున కనియెండె యొక్కొక్కభాష మాటలాడు వారి కనియోడె యేర్పడినవికావు. అన్నిమాసము లన్నిదేశముల యందు నన్నిభాషల మాటలాడువారికిని కర్మభేదము ననుసరించి యాచరింప దగినవి. కనుకనే తిరుపతికి దక్షిణమునందును అందునను అరవలుసైతము నరకచతుర్దశి శివరాత్రి మున్నగుపండుగలను చాంద్రమాసానుసారముగను తిరుపతి కుత్తరమునను తెలుగువారును వైకుంఠైకదాశి (ముక్కోటి యేకాదశి) ధనుర్మాసము మున్నగు పండుగలను సౌరమానానుసారముగ యాచరింపదగి యాచరించుటయు గలిగియున్నది. ఇంకను పెక్కులుకలవు. ఇందుచేత అన్నిదేశముల వారికి నన్నిమాసములు నొక్కొక్క కర్మయం దాచరణీయములు. ఈ విషయము విశేషముగ మా తండ్రిగారి మాననిర్ణయ మను గ్రంథమునందు తెలుపబడి యున్నది.

ఇందుచేత ద్రవిడు ( అరవ ) లే సౌరమానానుష్ఠాతలు, ఆంధ్రులే చాంద్రమానానుష్ఠాతులు ఆసౌర చాంద్రమానములు క్రమముగ శేషాచలమున ( తిరుపతికి ) కు దక్షిణోత్తరముల యందు గ్రాహ్యము లనియు దలచుట కేవలమసమంజసము లోక ప్రవాదానుగతము.

ఇక్కారణముచేత తిరుపతి యాంధ్ర ద్రావిడదేశములకు మధ్యమునందు యెల్లగ గాక యాంధ్రదేశగర్భస్థ మైనదని తెల్లంబు.



# మృతి లేని స్మృతి

ఎప్పుడో....
నన్ను విడిచిన బాల్యం
ఎక్కడో........
నన్ను జాజిలో దాక్కొని
గాలి వాలుకు తేలి వచ్చి
కౌగలించు కుంటుంది నా గుండెను !
తీపి గుర్తుల జోల పాటతో
స్వప్నాల పాల వేళ్ళను
చప్పరిస్తూ
తృప్తిగా లిప్తపాటు
నిద్రలో నవ్వుతున్న పసివాడిలా
తన్మయ ముద్రలోకి జారుతుంది మనస్సు !
నాడెప్పుడో
నే విడిచిన కాగితం పడవలా
జీవితపు వాననీళ్ళలో బాల్యం
కాలమనే తీరానికి తట్టుకొని
కదలకుండా నిలచిపోయింది !
నా ఎదగది
ఇప్పటిలా
పిశాచాల ప్రయోగశాలగా మారకముందు
నవ్వే నా కన్నులు
నాద స్వరాలు వినిపించేవిటు !
నా ఎదిగిన
నాగరికత
గొంగళి పురుగులా మారకముందు
నా తలపులు
సీతాకోక చిలుకలేనట !
బాల్యం !
ఏ గాలిపటంతో ఎగిరిపోయిందో !
ఏ జాబిల్లితో సాగిపోయిందో !
జీవితపు పుస్తకంలో
దాచుకున్న నెమలీకలా....,
జ్ఞాపకాల పేటికలో
నలిగిన పూరేకులా....,
ఎంత మురిపిస్తుందది !
ఎంత మరపిస్తుందది !
బాల్యం !
మృతి లేని స్మృతి !
జీవన సంగీత శృతి !

# పగిలిన ఎదలో పలికే రాగాలు

ఎవరి కోసం
ఈ వెదురు అదే పనిగా
పగిలిన గొంతులోనుండి
పలికిస్తున్నది గుండెను !
రగిలిన ఏ మధుకోలను
రాగంగా ఆలపిస్తున్నది !
బదులు పలకని ఏ పెదవి కోసం
వదులుకోలేని ఈ రాగబంధం !
ఏ నీలజలదం పంపిన కబురును
ఏ సాంధ్యసమీరం మోసుకొచ్చి
దీని ఎదలో ఊదిందో !
ఈ సాంద్ర గహనాంతరాన
రసార్ద్ర గీతాలు పలుకుతూ
ఆటవిక హృదయాల
పాటలు పూలు పూయించాలని
నాదోపాసన చేస్తున్న
ఈ పేదవెదురును సమాదరిస్తూ
నాగుండెను కానుక చేస్తా !
నాగొంతను జతగా చేస్తా !

శ్రీ కావూరి పాపయ్యశాస్త్రి

## త్త సీరియల్ ప్రారంభం!




ంచు తెరల మధ్య - మాస్కోనగరం మౌనంగాఉంది. ప్రపంచపు అగ్రదేశాలు రెండింటిలోనూ మొదటిది కాకపోతే కనీసం ఒకట రష్యాదేశపు రాజధానీనగరం తీవ్రమైన ఆలోచనలో మునిగినట్లు బ్ధంగానూ గంభీరంగానూ ఉంది.

దూరానికి సామాన్యంగా కనిపిస్తున్న ఆ కాలనీలోని ఒక భవ లోని నేలమాళిగ (అండర్‌గ్రౌండ్) లోని వాతావరణం సాంద్రంగా . విశాలమయిన హాలు. మధ్యగా చాలా పెద్దదీ అందమయినదీ దాతనం కలదీ ఐన కోలబల్ల. దాని చుట్టూ సింహాసనాలవంటి యిన కుర్చీలు అవన్నీ నిండి ఉన్నాయి - ఒక్కటి తప్ప. ఖాళీగా ఉండడంవల్లనే కాక సోవియట్ రష్యా ప్రెసిడెంటుది శం వలన కూడా ప్రత్యేకంగా కనిపిస్తుందేమో। అది - సరిగ్గా జి. బి. ఛీఫ్ ఆసనాని కభిముఖంగా ఉంది. కె. జి. బి. అంటే - న్ స్టేట్ సెక్యూరిటీ ఫోర్స్ కమిటీ. [రష్యన్ భాషలో వివరణ- nitet Gosu - darstvennoi Bezopasnosti]. అంతర్జా ంగానే అసమాన పేరు ప్రఖ్యాతులు చెందిన ఆ కె. జి. బి. కి అయి ఉండీ - ప్రెసిడెంట్ ఖాళీ కుర్చీని చూసే వణుకు న్నడు. ఇస్తినోవ్. ఆ సమావేశపు హాలులో స్థానం లభించడమే ఒక ప్రత్యేకత. పొలిటి బ్యూరో సభ్యులూ... సెంట్రల్ కమిటీ మెంబర్లూ....కె. జి. బి. చీఫ్...వంటి అతి పెద్ద స్థానాలలో ఉండే వారికే అక్కడ ప్రవేశం. ఆ కుర్చీలతో కూర్చొన గలిగే వారికి సోవి యట్ రష్యా అధ్యక్షుని మీద ఎంత గౌరవమూ భక్తి శ్రద్ధా ఉన్నా భయపడవలసిన ఆగత్యం సాధారణంగా ఏర్పడదు.

ఇస్తినోవ్ మాత్రం యిప్పుడు భయపడుతున్నాడు. కె.జిబి కి హెడ్ తను. ఇంతవరకూ యీ సమావేశాలలోకి పిలువబడని తన దిగువ అధికారి యిప్పుడు తన ప్రక్కనే కూర్చున్నాడు. ఏదో తనకి మేలు జరగబోతున్నట్లూ ఆ క్షణం కోసం ఎదురు చూస్తున్నట్లూ ఆనం దంగా చిరునవ్వులు నవ్వుతున్నాడు కనీకనిపించకుండా. ఆ విరిసీ విరియని మందహాసాలు ఇస్తినోవ్‌ని అదృశ్యపిశాచాలలా భయ పెడుతూ - చెమటలు పట్టిస్తున్నాయి. ఎదురుగా - బల్లమీద - లాంఛ నాని కుంచిన వోడ్కాపానీయం. కాని అతను దాన్ని తీసుకుందుకు జంకుతున్నాడు. యూనిఫారమ్ లో అతని శరీరం స్వేదగ్రస్త మౌతూంది ఆ హాలు చక్కగా సమశీతోష్ణం చేయబడినా మధ్యాహ్నం- అత్యవసర, సత్వర సమావేశపత్రం మీద సంతకం చేస్తున్నపుడే అతని వేళ్ళందుకో వొణికి కలం చేజారి క్రింద పడింది. అతనికి మూఢనమ్మ

కాలు లేకపోయినా -భయం వేసింది ఏంజరగబోతూందో అని. ఒక్కసారి మనోభావాలు మార్పు చెందాయి.

"ఎందుకిప్పుడీ మీటింగ్ నోటీసు;" అడిగింది సోలంకీ.

"తెలియదు" అన్నాడతను సిగ్గుపడుతూ.

"కె. జి. బి. కి తెలియని విషయమూ !" ఆశ్చర్యపడుతున్నట్లూ పరిహసిస్తున్నట్లూ చూసిందామె. ఆమె మందహాసంలో ఆమె ప్రేమంతా ప్రతిఫలించింది. ఆమె చూపులో అతని పట్ల అనురాగమూ ఆత్రతా ఆరాధనా అన్నీ నిండిఉన్నాయి. వలపు నిండిన సోలంకీ ముఖం... ప్రణయమూర్తిలా ప్రభాసించి - ఆమెనే చూస్తూ ఇస్తినోవ్ తనని తానే మరచిపోయాడు.

సోలంకీ పార్టీ వర్కరే అప్పటికి. అద్భుతసౌందర్యరాశి. అసమాన వివేకవతి...ఐన ఆమెను ప్రేమించకుండా ఉండలేక పోయాడు. నిజమయిన చాలా ప్రేమికుల వలెనే ఇస్తినోవ్ సోలంకీలు కూడా తమ ప్రణయాన్ని వివాహంగా స్థిరపరచుకుని శాశ్వతం చేసుకుందుకు రాజకీయ సాంఘిక అడ్డంకు లెన్నిటినో అధిగమించవలసి వచ్చింది. ఓర్మితో పట్టుదలతో కృషిచేసి - ఎలాగయితేనేం చివరకు దంపతులు కాగలిగారు పదేళ్లక్రితం వాళ్ళిద్దరూ. ఈ పదేళ్ల అనుబంధమూ వారినింకా ఎంత సన్నిహితులని చేసిందంటే - ఆమె లేకుండా అతనికీ, అతను లేకుండా ఆమెకీ జీవితమేల్లేదు. వారిమధ్య హద్దులూ సరిహద్దులూ లేవు వియోగమనేది ఊహలో అయినా భరించలేరు.

కొరడా ఝుళిపించినట్లు అంతరాత్మ హెచ్చరిక.

"నీకేదో జరగబోతూంది, ఇస్తినోవ్.."

"ఏమిటి ?"

నిశ్శబ్దమూ మౌనమూ - అనే జవాబులు. అతని ముఖం నిండా భయం. గుండెలనిండా దడ. ఈ అత్యావసర సత్వర సమావేశం- తన నెత్తిమీద పడబోయే పిడుగుకి ఉరుముకాదుకద ? ముంచుకు రాబోతున్న ఆపదకో, సంభవించ బోతున్న అపాయానికో సూచన కాదుకద ?

మెదడునీ మనసునీ కూడ కంపింపజేస్తూ- క్రూరమూ అతి భయంకరమూ ఐన సందేహం. కె. జీ. బి.ఛీఫ్‌గా తను స్థానభ్రంశం చెందితే? తనకి సోలంకీ మిగలదు.. ప్రేమమిగలదు.. జీవితం మిగలదు. ఏమీ మిగలదు. అంతాశూన్యం.. శుద్ధశూన్యం.. అంతే.. ఔను. ఈదేశ సంప్రదాయం అంతే. పార్టీముందు స్టేట్‌ముందు వ్యక్తిఉండడు.. ప్రేమ ఉండదు.

పార్టీ ప్రతిష్టను నిలుపలేని ఏపొరపాటయినా అది పొరపాటుగా కాక ఘోరమయిన తీవ్రమయిన నేరంగా మాత్రమే పరిగణించ బడుతుంది. అటువంటి వాటికి విధించబడే శిక్ష ఆనేరాలకంటే అనేకవేల రెట్లు అధికంగానూ కఠినంగానూ ఉంటుంది.

రోమ్ ఒకరోజుతో నిర్మించబడలేదు. రష్యాకూడాఅంతే. రష్యాను నిర్మించిందీ అభివృద్ధి చేసిందీ అగ్రగామిని చేసిందీ పార్టీయే. అందుకే యిక్కడ పార్టీకి ద్రోహదం చేయకపోవడమే పెద్దనేరంగానూ ద్రోహంగానూ పరిగణించ బడుతుంది. అటువంటి తీవ్ర నేరస్తులు వేపొరైజేషన్ అనే అతితీవ్ర శిక్షకు గురిచేయబడ్డారు. వేపొరైజేషనంటే- ఆమనిషికి శేషముండదు. గుర్తింపుకార్డు ఉపసంహరించబడుతుంది. అతి త్వరలోనే రికార్డులలోంచి అతని పేరూ, స్థానమూ తొలగించ బడతాయి. చివరకతను మనుషుల జ్ఞాపకాలలో కూడా మిగలకుండా అవిరైపొతాడు. అదీ యీ సోవియట్ రష్యా సంస్కృతి. ఆచారం. తనకి ఆగతే పట్టబోతూందా ? ఛీ ఛీ.. ఏమిటిది ? ఇప్పుడేమైందని ? గాలయినా లేకుండానే తుఫాన్‌నీ సర్వనాశాన్నీ ఊహించుకుని ఎందుకిలా అవివేకంగానూ అనవసరంగానూ భీతి చెందుతున్నాడు ? తను సోలంకీతో సుఖంగా.. ప్రేమగా.. జీవితపుటంచుల వరకూ అనురాగపు బాటమీద ఆనందంగా పయనించ గలుగుతాడు. తమ ప్రేమ- చిరంజీవీ, శాశ్వతమూ. వృత్తిబాధ్యతలరీత్యా తనకొక వేళ ఏదయినా ఆపదరాబోయినా అమోఘమయిన సోలంకీ ప్రేమ తనకి శ్రీరామ రక్ష ఔతుంది. కాపాడి వొడ్డున పడేస్తుంది.

ఇంత ప్రేమను పార్టీ అనుమతించదు- బాధ్యతకల తనవంటి వాడి విషయంలో. ఆమోదించదు. కాని.. తనచేతిలో ఏమీలేదు. ప్రేమ కంటె పార్టీకే ప్రథమస్థానం యిస్తున్నట్లు కనీసం నటించనయినా నటించాలి. ప్రాణంకంటె పార్టీ; పార్టీకంటె ప్రేమా అధికమన్న సత్యాన్ని బయటపడనివ్వకుండా హృదయాంతరాలలో దాచుకోవాలి. తనకేమీ అవాంఛనీయమైనది జరగదు. మేకపోతుగాంభీర్యం తెచ్చుకున్నాడు ఇస్తినోవ్. కాని- ఆ కుహనా గాంభీర్యం కాన్ఫరెన్స్‌హాలులో అడుగు పెట్టేవరకూ మాత్రమే నిలవగలిగి- మరుక్షణం నీరుకారిపోయింది. అతని అంతరాత్మ.. ఆరవ పంచేంద్రియం (? సిక్త్స్ సెన్స్..) మళ్లీ అతని మెదడుకి ఏవేవో భయానక సంకేతాలు . అర్థమయీకానివి ..పంపడం ప్రారంభించి అతన్ని అస్తిమితంగానూ అస్థిరంగానూ చేసి వొదులుతుంది. ముఖ్యంగా- ప్రక్కనున్న- తనధిగువ మనిషి- ఇస్తినోవ్‌ని- వోడ్కా అయినా తాగనీయనంతగా కలవరపరచి వొదులుతున్నాడు. ఎందుకో.. ఏమిటో తెలియని భయం అతన్ని పూర్తిగా ఆక్రమించుకుంది.

ప్రెసిడెంట్... సోవియట్ రష్యా అధ్యక్షుడు ప్రవేశించబోతున్నట్లు సున్నితమయిన సూచన. భయం భయంగా కుర్చీలన్నిటినీ కలియజూశాడు ఇస్తినోవ్. ప్రెసిడెంట్ కుర్చీకి అటూయిటూ పొలిటి

బ్యూరో... తరువాత సెంట్రల్ కమిటీ... సరిగ్గా అభిముఖంగాతను అతనొక్కసారి రుమాలుతో ముఖంతుడుచుకున్నాడు.

రష్యన్ ప్రెసిడెంట్ హాలులోకి వచ్చాడు. అందరూ గౌరవ పురస్కరంగానూ, ఇస్తినోవ్ భయపడుతూనూ లేచి నిలుచున్నా రొక్కక్షణం. ఈ సమావేశాలలో లాంఛనాలు అధికంగా పాటించ బడవు. కాలానికీ మాట పొదుపుకీ ఎక్కువ విలువ ఇవ్వబడుతుంది బయట- సోవియట్ అధ్యక్షుడు ఏంమాట్లాడాలో, ఏంచెయ్యాలో .... ఎలాప్రవర్తించాలో- ముందుగా యిక్కడి సమావేశంలోనే చర్చించ బడి నిర్ణయించబడతాయి ముఖ్యవిషయాలలో వాస్తవానికి సోవియట్ రష్యా యిక్కడినుంచే పరిపాలించబడుతుంది. అందుకే యిచ్చట పొలిట్‌బ్యూరో— సెంట్రల్‌కమిటీ— కె. జి. బి. వంటి అతిముఖ్య మయిన శాఖలకు చెందిన అగ్రవక్త్యలకు మాత్రమే ప్రవేశం లభిస్తుంది దేశీయ, అంతర్దేశీయ వ్యవహారాలు క్షుణ్ణంగా చర్చించబడే యీ సభలు— అతి రహస్యంగా ఉంచబడతాయి. ఒక విధంగా- రష్యా అధ్యక్షుడికిక్కడ రిహార్సల్ జరుగుతుంది. సభ ప్రారంభమయింది. పొలిటిబ్యూరో సభ్యుడు ఉపన్యాసం మొదలుపెట్టాడు. "కామ్రేడ్స్! ఒక్కసారి మనమందరమూ భారతదేశం గురించి తలుచుకుందాం. బహుశా మీఅందరికీ నేను వర్ణించబోతున్న చిత్రం మీ మెదడులలో మెదలుతూండ వచ్చునని ఆశిస్తాను. పేదరికం— నిరక్షరాస్యత— కుత్సితమూ, స్వార్థపూరితమూ ఐన రాజకీయాలు... సోమరితనం— బానిసభావాలు— కులమత విభేదాలు సృష్టించే కొట్లాటలు— భద్రతా రాహిత్యం— సంపన్నదేశాల ప్రాంగణమందు దేహీ అంటున్న భిక్షా పాత్ర— విదేశీవ్యామోహ పెనుసుడులలో గానుగెద్దులా తిరగుతున్న మనుషులు— గెడ్డాలుపెంచిన ఋషులు— పట్టపగలే యధేశ్ఛగా వీధులలో విహరిస్తున్న శార్దూలాలు— భయం— వీటికలగలుపు చిత్రమే మీ ఊహలలోకి వొస్తే అది— అర్థ సత్యమే ఔతుంది. ఇదే సంపూర్ణమూ సమగ్రమూ ఐన చిత్రమనుకుంటే, భారత దేశాన్ని నిర్లక్ష్యం చేయడమూ— తేలికగా తీసుకోవడమూ సోవియట్ రష్యాకీ దానికి ప్రాతినిధ్యం వహించే మనకీ ఎంతమాత్రమూ తగనిపని—"ఊపిరి తీసుకుందుకాగాడు వక్త. ఈమాటలు శ్రోతలకి అప్రస్తుతంగా అర్థరహితంగా తోచాయి. ఆశ్చర్యంగా చూస్తూ ఆలోచిస్తున్నారు వారందరూ.

"ప్రస్తుతం పేదభూమి ఐన భారతదేశం- ఒకప్పుడు వేద భూమి. వేదాలూ ఉపనిషత్తులూ అక్కడ ఉద్భవించాయి. వేదాలంటే ప్రమాణగ్రంధాలే. ఆయుర్వేదం— జ్యోతిషం— సంగీతం— శిల్పం— ఖగోళశాస్త్రంవంటివి ఎన్నో శాఖలు భారత జాతీయులకు కరతలామల కాలు. మానవకథ వికాసం విషయంలో అధ్యయనపరంగా చూస్తే మొహంజోదారో, హరప్పాలు, అనేకచోట్ల అత్యంత పరిపక్వశిల్పకళ" అవి ప్రారంభసమయాలే. నాగరిక జీవితం విస్తృతమై- జీవితఘట్టాల్లో శృంగారం ప్రధానంగానూ ఉత్కృష్టమయినదిగానూ పరిగణించబడి మానవ జీవితం ఎగసిపడిన సమయాలలో ఖజూరహోలూ కోణార్కలు శృంగారంతో మలచ బడ్డాయి. నేటికీ మతాతీతమయిన మానవమిధున సంపర్క బహు భంగిమలను బోధనావిషయంగా వేయేళ్ళ క్రిందటే మలచిన ఆ భారతీయశిల్ప చక్రవర్తులు— ప్రపంచమానవ జాతులన్నీ నిర్ద్వంద్వంగా తలవంచి నమస్కరించవలసిన వంద్యులే. భారతీయ శిల్పకళ అజరామరమూ, ప్రథమశ్రేణిదీ. మానవ మహాప్రస్థానంలో యింతగొప్పశిల్పకళ నందించ గలిగినది భారత్ మాత్రమే. ఇతర దేశాలకు నాగరిక భిక్షవేసినది హిందూదేశమే. మిగిలినకొన్ని దేశాలు బట్టకట్టుకోడం వింతగా భావిస్తూంటే- భారత దేశం ఢక్కామస్లిన్‌లు తయారుచేసేది. శిల్పమూ, సంగీతమూ, వైద్యమూ— ఏవిషయంలో చూసినా ఆదేశానికి ఉత్కృష్టమయిన గతం ఉంది. సంస్కృతి ఉంది. ఐతే వర్తమానం అధ్వాన్నంగా ఉందని చెప్పక తప్పదు. దేశంనిండా ఉన్న అమూల్య మానవశక్తి— ఖనిజ శక్తి— అన్నిటినీ త్రాగలేనిపిల్లి వొలక బోసుకున్నచందంగా వృధాచేసుకుంటూ వలసపోతున్న అమోఘ మానవ మేధను వైరిముఖం వేసుకు చూస్తున్నదావేశం. ఆశ్రిత జన పక్షపాతం— అసమర్థ పాలన— క్షుద్రరాజకీయాలు— ప్రజలలో జాతీయతాభావం లోపించడం వగయిరాలు ఆ దేశ అభివృద్ధికి నివురు కప్పాయి. ఐతే—ప్రజాచైతన్యం ఏక్షణంలో అయినా ఆ నివురునుచెదర గొట్టి- అగ్నిప్రజ్వరిల్ల జేయవచ్చు. అప్పుడు భారతదేశం యావత్ప్రపంచానికి ముందునిలుస్తుంది— శ్రోతలకు విసుగొస్తూంది. ఇండో సోవియట్ మైత్రిఉందిసరే. మరీ- జనాభాపరంగా తప్పమరేవిధంగానూ పేరుపొందలేని భారతదేశానికి స్తోత్రమేమిటి? ఎందుకు? ఈ సభా ప్రాంగణం వ్యర్థ ఉపన్యాసానికి తావిస్తూందేం తొలిసారిగా?

"కామ్రేడ్స్... ప్రపంచంలో అగ్రదేశం కావడానికహరహమూ అకుంఠిత కృషి సలిపే సోవియట్ రష్యా భారతదేశాన్ని గౌరవించ డమే కాదు, దాని నత్యంత జాగరూకతతో పరిశీలిస్తూ ఉండాలి కూడా. ఎందుకంటే.... ఏదేశానికి సంస్కృతి ఉంటుందో, ఏదేశంలో కళ లుద్భవించాయో.... ఆ దేశం తాత్కాలికంగా మరుగున పడినా —మళ్లీ ఏదో మహాద్భుతం చేసి తన స్థానం నిలుపు కుంటుంది. సాన పెట్ట బడిన వజ్రంలా. భారతదేశం అటువంటి అత్యద్భుత... మహా కార్యమే తలపెట్టింది.

కామ్రేడ్స్! శాస్త్రీయాభివృద్ధిలో... సాంకేతిక నైపుణ్యంలో .... ఎంతో ముందంజ వేసినా— మన కె. జి. బి. ప్రపంచ ప్రఖ్యాతి చెందినా— యివాళ— మనం మనసోవియట్‌రష్యా— ఒకవిధంగా

తీవ్రమయిన అవమానానికి గురి అయినట్లే.... ఓడిపోయినట్లే వక్త దృష్టి సూటిగా ఇస్తినోవ్ మీదకు ప్రసరించింది. ఇస్తినోవ్ చెమట తుడుచుకునే నెపంతో రుమాలులో ముఖం దాచేసు కున్నాడు.

"భారతదేశం పూనుకున్న... ఆలోచిస్తున్న ... ఆలోచన మనకి ఎన్నడూరాలేదు. అందుకు చింతించనక్కరలేదు. ఆ ఆలోచన క్రియారూపంలో పెడుతున్నప్పుడు కూడా దానిని మనం పసిగట్టలేక పోయాం. ఇదీ అంతగా సిగ్గుపడవలసిన విషయం కాదు. కాని... దానిని... మనకంటె ముందుగా అమెరికా పసిగట్టింది! ఇది మనకి మన సోవియట్ రష్యాకి.... కె. జి. బి. కి ఎంత అవమాన కరమయిన విషయం! సి. ఐ. ఏ. (Crime Intelligence Agency) ని ట్రాప్ చేయడంలో తప్పిస్తే మనకి రహస్యం తెలియలేదంటే .... ఒకప్పుడు C. I. A. కంటె ఎంతో ముందుండే K. G. B. యిప్పు డెక్కడుందో స్పష్టంగా తేలిపోవడంలేదూ?" వక్త నూటిగా చూశాడు ఇస్తినోవ్ వేపు. ఇస్తినోవ్ అపాదమస్తకమూ గజగజ వొణికి పోతు న్నాడు. అతని తలమీద ఒక్కసారి వెయ్యి పిడుగులు పడ్డాయి. అతనికి నోటిమాట పెగలడంలేదు. యావత్ప్రపంచమూ అంధకార బంధురమై పోయింది. సోలంకి! బాధగా మననం చేసుకున్నాడు. ఇంక తనని భగవంతుడు రక్షించలేదు. ప్రేమ కూడా రక్షించలేదు.

భారతదేశం తలపెట్టిన — తను కనిపెట్టలేక పోయిన ఆ అద్భుత కార్యమేమిటి?

అడిగినా ప్రయోజనముండదు. తన చుట్టూవల పన్నబడింది. తను తప్పించుకోలేడు. తను సోవియట్ రష్యాను అమెరికా ముందు అప్రతిష్టపాలు చేశాడు. ఇది తీవ్రమైన నేరం. తనకి తెలుసు .... దీనికి వేపొరైజేషన్ కూడా తక్కువ శిక్షే ఔతుంది. సోలంకి... ఐ లవ్ యు. కాని... సారీ... గుడ్ బై ఫరెవర్... నిశ్చేష్టుడూ నిర్వీర్యుడూ ఐ మిగిలిన ఇస్తినోవ్ కనులముందే — కె. జి. బి. కి కొత్త చీఫ్ నియామకం చేయబడ్డాడు, అక్కడికక్కడే అప్పటికప్పుడే. సమావేశం ముగిసింది.

తన ప్రాణాల మీదకూ ప్రేమమీదకూ తెచ్చిన — భారత దేశం కనుక్కోబోతున్న కొత్త అద్భుతం ఏమిటి! ఆ ప్రశ్న యిస్తినోవ్‌ని తెగకలవర పెడుతూంది. అతన్ని యిద్దరు మనుషులు బయటకు నడిపించడంకూడా అతనికి తెలీదు. భారతదేశం కనుగొన బోయే ఆ అత్యద్భుత మేమిటి?

(ఇంకా వుంది)

# సుస్వాగతం

## శ్రీ మూర్తిరాజా

ఆమని వుదయం కోసం—
అక్షరాలు
లక్ష గొంతుకలతో
యక్ష గాన మాలపించి—
నరాలు, సప్త
స్వరాల గమకములతో

మయూర నటనల నర్తించి—
కోకిల క్రొత్తగొంతు
పాడే మంత్రస్వరం—
వసంతానికి
అభిషేకంలా
నా దోసిలితో—

# దర్శనం

- ఆదూరి వెంకట సీతారామమూర్తి



బస్సు కిటికీలోంచే చూశాను నారాయణని - బస్టాండులో పెట్రోలు బంక్ దగ్గర నిలబడి ఆత్రంగా చూస్తున్నాడు - ముందుగా మేం వస్తున్నట్లు రాశానేమో తంచనుగా మమ్మల్ని ఆహ్వానించడానికి వచ్చేడు. 'నే చెప్పలేదూ - అదిగో మనకోసం వచ్చాడు నారాయణ' అని విశ్వానికి నారాయణను చూపించాను.

నారాయణ ఎంత హితుడో, సన్నిహితుడో విశ్వంకూడ అంతే నాకు - కానీ... నారాయణకూ విశ్వానికీ మధ్య ఎంత తేడా?

పదోతరగతిలోనే చదువాపేసి ఉన్న వూళ్ళోనే ఓ చిన్న ఉద్యోగం సంపాదించుకుని నారాయణ కుటుంబ భారాన్ని లాగుతుంటే, తరగని ఆస్తికి వారసుడుగా తల్లిదండ్రులనుంచి తనక్కావల్సిన డబ్బు రప్పించుకుంటూ ఉస్మానియా యూనివర్సిటీలో తెలుగులో రిసెర్చి చేస్తున్నాడు విశ్వం —

వారంరోజుల క్రితం ఉత్తరం రాశాడు విశ్వం — తనకో వారం రోజుల సెలవులు లభించబోతున్నాయనీ; యాంత్రికమైన ఆ వాతావరణానికి దూరంగా కొద్దిరోజులు నాతో గడపాలని వుందనీ; విశాఖ పరిసర క్షేత్రాలూ, స్థలాలూ చూడాలనీ —

సంతోషంగానే రమ్మని రాశాను —

రెండు రోజుల్రకితం వచ్చాడు విశ్వం — అరకులోయ, సింహాచల క్షేత్రము, సాగరదుర్గ, కనక మహాలక్ష్మి; వెంకటేశ్వర మెట్ట; రామకృష్ణా మిషన్ బీచ్; కథలలో ప్రాశస్త్యాన్ని పొందిన ఎర్రమట్టిదిబ్బలూ — ఊపిరాడనట్టుచూశాం.

మానవాళి మహోదయానికి స్ఫూర్తినిచ్చే ఆదిత్యుని ఆలయం చూసే ప్రయత్నమే యీ అరసవల్లి ప్రయాణం —

విశ్వాన్నీ, నారాయణనీ, పరస్పరం పరిచయం చేశాక, ఇక నీదే బాధ్యత— విశ్వానికి ఏమేం చూపించ దలచావో— సాయంకాలం బస్సులో వెళ్ళిపోవాలి మరి మేం'. అన్నాను నారాయణతో—

'ముందు మా అతిధ్యాన్ని స్వీకరించండి. తర్వాత బయల్దేరుదాం' అంటూ తనింటికి తీసుకు వెళ్ళాడు నారాయణ.

చిన్న పెంకుటిల్లు - చుట్టూ వెదురు ఫెన్సింగు, ఇంటిముందు అరటి, మామిడిచెట్లు కూరగాయల పాదులు, పారిజాతం, నందివర్ధనం, మొదలైన పూలమొక్కలు -

'చక్కగా ప్రశాంతంగా వుంది యిల్లు' మెచ్చుకున్నాడు విశ్వం. అల్పాహారం, కాఫీలు అయి, బయల్దేరేసరికి తొమ్మిదయింది -

నారాయణ పుట్టిందీ, పెరిగిందీ అక్కడే కావడం వల్ల అక్కడి స్థలాలూ వాటి చరిత్రలూ అతనికి కొట్టినపిండే -

మరో పావుగంటలో రిక్షాలు సూర్యదేవాలయంముందు ఆగేయి

"ఇదే అరుణదేవుని ప్రసిద్ధ పుణ్యక్షేత్రం అరసవిల్లి - దేశమొత్తం మీద ఉన్న రెండు మూడు సూర్యదేవాలయాల్లో ప్రతినిత్య సకల లాంఛనాలతో పూజలందుకుంటున్న సూర్యదేవాలయం యిదొక్కటే అంటారు -

...సూర్యభగవానుడు ప్రత్యక్ష దైవంగదా. అంచేత భక్తుల పెద్ద సంఖ్యలో వస్తూ తమ మొక్కుబడులను తీర్చుకుంటూవుంటారు - ముఖ్యంగా మాఘమాసంలో వచ్చే రథసప్తమికి యిక్కడకు భారీఎత్తున భక్తులొస్తారు. కనులపండువుగా వేడుకలు జరుగుతాయి -

...ఈ ఆలయ గర్భగుడిలోని మూలవిరాట్ చూశారా? ఇది కృష్ణశిలతో మల్చబడిన ఏకశిలా విగ్రహం. సుమారు ఆరడుగుల పొడవు; మూడడుగుల వెడల్పు వుంటుంది - అదిగో ఆయన పాదాల చెంతనే ముగ్గురు దేవేరులు...ఛాయ, ఉష, పద్మిని - అటు అధో భాగాన అనూరుడు రథసారధిగా, సప్తాశ్వరథంపై అభయ ముద్రతో సూర్యభగవానుడు -

ఇక, యిక్కడి యీ ఆదిత్య, అంబిక, విష్ణు, మహేశ్వర, గణేశ్వర, నందీశ్వర, విగ్రహాలు వైష్ణవ శైవ మతాల సమన్వయత్వాన్ని సూచిస్తాయి.

...ఈ మూలవిరాట్ ప్రతిష్ట క్రీ. శ. 676 - 688 మధ్య కాలంలో జరిగినట్టు చరిత్ర చెబుతోంది -

ప్రతియేడూ సూర్యుడు ఉత్తర దక్షిణాయణానాలకు మారే సమయంలో ప్రభాత భానుని లేతకిరణాలు గర్భగుడిలోకి ఐదుమార్గాల గుండా చొచ్చుకువచ్చి మూలవిరాట్ పాదాలు, నాభి, శిరోభాగాలను తాకుతాయి- ఇదొకగొప్ప విశేషం".

నారాయణ చెప్పే ప్రతి అంశాన్నీ ఆత్రంగావింటూ, అవలోకిస్తూ అవసరమైనవిషయాల్ని తనడైరీలో నోట్‌చేసుకున్నాడు విశ్వం.

అక్కడ్నించి శ్రీ కూర్మక్షేత్రానికి బస్సులో తీసుకెళ్ళాడు నారాయణ.

"అతి ప్రాచీనమైన అలయాల్లో శ్రీకూర్మంకూడా ఒకటి" చెప్పడం మొదలుపెట్టాడు నారాయణ.

అక్కడవుండే శిల్పకళ మతోన్మాదుల దాడులకు ధ్వంసమైందనీ వచ్చేభక్తులకు తగిన రవాణా సౌకర్యాలు లేకపోవడంతో నిధులు లేక దేవాలయం అతి దయనీయమైనస్థితిలో వుందనీతన ఆవేదనను వ్యక్తం చేశాడు నారాయణ - మాతోనేఉంటూ ఒకగైడ్‌గా వ్యవహరిస్తూ ఆ యా ప్రాంతాలకు చెందిన చారిత్రాత్మక విశేషాలను అతనుచెప్పడం విశ్వానికీ నాకూ ఎంతో ఆనందాన్ని కలుగజేసింది.

మధ్యాహ్న భోజనానంతరం కాస్సేపు పిచ్చాపాటి అయ్యాక 'మనం ఇప్పుడు వెళ్ళేది కళ్లేపల్లి' అన్నాడు నారాయణ.

'ఏముందక్కడ ?'

'నాగావళి నదీతీరం పొడవునా వుండే అయిదు శివాలయాల్లోనూ ఒకటి అక్కడవుంది. అక్కడిదేవుడు మణినాగేశ్వరుడు. మిగిలిన నాలుగూ పాటలేశ్వర, సోమేశ్వర, సంగమేశ్వర, కోపేశ్వరాలు.

...పంచలింగ క్షేత్రంగా వ్యవహరించే యీ లింగాలను అల నాటి బలరాముడు ప్రతిష్ఠించాడనీ, అతని నాగేటిచాలు వెంబడే నాగావళి ఉద్భవించిందనీ ఇతిహాసం చెబుతూంది."

నారాయణ మాటలువిని, నిండు ఉత్సాహంతో కదిలాడువిశ్వం—

మణి నాగేశ్వరుడి మూలవిరాట్ అర్ధనారీశ్వరుడిగా కన్పిస్తాడు. నలుపు తెలుపుల సంగమమైన ఆలింగం ముందుభాగం శివుడుగా, వెనుక భాగం గౌరీదేవిగా పరిగణింపబడుతోంది. లింగాకృతి నిలువునా సగానికి చీలివుండి, శిరోభాగంలో పెద్దరంధ్రంవుంటుంది. ఆ రంధ్రం స్థానే ఒకప్పుడు పెద్దనాగమణి వుండేదట.

ఆ కథను అక్కడి అర్చకులు చెబుతూంటే విస్మయంగా విన్నాడు విశ్వం.

నాగావళినదీ సంగమాన్ని చూసి పులకించి పోయాం.

తిరిగివచ్చి నారాయణ యింట్లో కాస్సేపుగడిపి, బస్టాండుకొచ్చే సరికి చీకట్లు ముసురుకున్నాయి.

'ఈరాత్రికి మాయింట్లో వుండిపోతే సంతోషించేవాడిని' అన్నాడు నారాయణ.

'శ్రమతీసుకుని మీరు మాతోగడపడమే చాలు. యింకా మీకు శ్రమకావడ మెందుకూ' అన్నాడు విశ్వం.

నారాయణ మరేం మాట్లాడలేదు.

రాత్రి ఎనిమిది వరకూ బస్సులేదని తెల్సి నిరుత్సాహ పడిపోయాం.

కూర్చునేందుకైనా సదుపాయంలేని యీ బస్టాండులో గడిపే బదులు అంతవరకూ నాగావళి ఒడ్డున గడిపితే మంచిదనిపించింది.

ముగ్గురం కదిలాం. కోపేశ్వరాలయం దగ్గర నాగావళి పిల్ల కాలువలా ప్రవహిస్తోంది. ఒడ్డునవున్న సిమెంటుతిన్నెలపై కూర్చొని చూస్తే ట్యూబులైట్లకాంతిలో వెండిజలతారులాఉంది నాగావళి.

శ్రమనూ, అలసటనూ మరపించే చల్లనిగాలి- భాషకందని అనుభూతిని విశ్వం కళ్ళలోచూశానా క్షణాన.

నారాయణ యేదో మాట్లాడుతూనే వున్నాడు.

అక్కడ్నించి వచ్చాక బస్టాండు కళావిహీనంగా తోచింది-

ఎనిమిది గంటలకు రావల్సినబస్సు రాలేదు. పది- ఇరవై- ముప్ఫయ్- నిముషాలు గడుస్తూనే ఉన్నాయి-

రోజంతా కూడగట్టుకున్న ఉత్సాహమంతా హరించి పోతోంది.

ఎట్టకేలకు రాత్రి తొమ్మిదిగంటలకు వచ్చింది ఆశియాడ్‌బస్సు- ఎక్కడున్నారో అంతవరకూ- బిలబిల్లాడుతూ ఒక్కమారు చుట్టు ముట్టారు జనం- పరుగెత్తుకెళ్ళి ఎలాగో మాకోసం రెండు సీట్లురిజర్వు చేయించుకొచ్చాడు నారాయణ-

గొప్ప పెన్నిధి దొరికినట్లు లోపలికి జొరబడి కూర్చున్నాం— సీట్లకోసం బస్సుబయట చాలా కోలాహలంగా వుంది.

'నువ్వప్పగించిన బాధ్యతను నెరవేర్చాను' అన్నట్లు నిల్చు న్నాడు నారాయణ నా ఎదురుగా.... మౌనంగా రోడ్డుమీద.

కృతజ్ఞతలు చెప్పుకునేటంత దూరంలేదు మా మధ్య——

అంచేతే గొంతు విడివడలేదు ——

నారాయణ వెళ్ళిన అరగంట వరకూ బస్సు కదలనే లేదు—— బస్సులోవున్న నలభై ఒక్క సీట్లనీ; కూర్చున్నవారినీ నలభై ఒక్క సారి లెక్కపెట్టేడు కండక్టరు —— సీట్లు దొరకక చాలామంది జనం బయటే వుండిపోయారు.

'ఆలస్యమైనా సుఖమైన ప్రయాణమే చెయ్యొచ్చుయిందులో' అన్నాను.

'మరే. అందులోనూ ఆసియాడ్ బస్సుకదా. ఆసియా ఆట గాళ్ళ సౌఖ్యంకోసం ప్రత్యేకంగా తయారుచేయబడ్డ బస్సులు కదా యివి. ఆ సౌఖ్యాల్ని వారనుభవించాక తర్వాత మనకు సంక్రమింప జేశారు. మన గౌరవ ప్రభుత్వంవారు —— టిక్కెట్టు మీదో రూపాయి న్నర ఫైనువేస్తూ'

విశ్వం మాటల్లో నిజం లేకపోలేదు—— మామూలు ఎక్స్‌ప్రెస్, నాన్‌స్టాప్ డీలక్సు బస్సుల టిక్కెట్టు ధరకంటె ఏషియాడ్ బస్సులలో టిక్కెట్టుధర కాస్తో కూస్తో ఎక్కువే- కారణం ప్రత్యేక సదుపాయాలూ, అలంకరణలూ.

అద్దాలూ, కుషన్‌లూ, సీటుసీటుకి ఫేనూ, లైటూ—— నిజా నికి వీటన్నిటి ధరా యీ పెంచిన టిక్కెట్టు ధరద్వారా ప్రభుత్వా నికి ఎప్పుడో వచ్చేసి వుంటుంది —— అయినా కల్పించిన ప్రత్యేక సదుపాయాలదృష్ట్యా టిక్కెట్టుధర మరి తగ్గించలేదు —— సామాన్య ప్రజలపై అది తలకి మించిన భారమైనాసరే?

చీకటి చిక్కగా వుంది — టైము తొమ్మిదింపావు. బస్సు కిటకిటలాడుతూంది — కండక్టరింకా టిక్కెట్లిస్తున్నాడు — ఆ తతంగం కాస్తా పూర్తయితే బస్సు బయల్దేరుతుందన్న ఆశతో ఓపిగ్గా కూర్చున్నాం —

ఈ లోగా బ్రీఫ్‌కేసులు పట్టుకుని యిద్దరు భారీ వ్యక్తులు బస్సెక్కడం నా కంటబడింది— కండక్టర్ని ప్రక్కకు పిలిచి ఏదో మాట్లాడేరు గుట్టుగా—

కండక్టరు మాత్రం గుట్టురట్టుచేసేశాడు.

"ఎలాసార్. చూడండి బస్సుకెపాసిటి సరిపోయింది - ఎవరైనా అడ్జస్టయి మీకు సీటిస్తామంటే చూడండి. నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు -

ఆ ఇద్దరు యువకులూ బస్సులోని అందరివంకా చూశారు. అందరికీ వారి మాటలు అర్థమైనా ఎవరూ చోటివ్వడానికి ముందుకు రాలేదు. అసలేరాత్రి...అందులోనూ దూరప్రయాణం - అంత డబ్బు పెట్టి టికెట్టుకొని ప్రయాణం చేస్తూ సర్దుకోవాలని ఎవరికనిపిస్తుంది?

ఇక లాభం లేదనుకున్నారోయేమో వాళ్ళు మళ్ళీ కండక్టర్నే పట్టుకున్నారు. ఏదోలా చూడమని - తమ అవసరం కొద్దీ ఎదుటి వ్యక్తికి ఆశజూపి, ప్రలోభానికి గురిచేసి వీలైతే అవినీతికి కూడ పాల్పడేలా చేయగల సమర్థులు యిటువంటివారే అన్పించింది -

'చూడ్డానికి డాబుగా దర్జాగా వున్నారు - మధ్యదార్లో బస్సాపించి పిస్తోళ్ళో కత్తులో చూపించి డబ్బుదోచుకుంటే ఎవరేం చేయగలరు. రోజూ పేపర్లలో ఎన్ని చూడ్డంలేదు? ముందు సీట్లో ఎవరో గుసగుస లాడుకుంటున్నారు -

ఈలోగా కండక్టర్ దృష్టి వెనకసీట్లలో కూర్చున్న వారిపై బడింది.

"ఎవరయ్య అక్కడ. టిక్కెట్లు తీశారా" అంటూ వెనక్కు వెళ్ళేడు.

'తీసోకవాలి బాబయ్యా. ఇదిగో' అంటూ లాల్చీపక్కజేబు లోంచి యాభైరూపాయలనోటు తీసి అందించాడతగాడు -

'ఎంతమంది మీరు?'

'నానూ; మా యాడది; యీ ముసిల్దీ యిద్దరు పిల్లలూ' అంటున్నాడతడు - ఆ మాటల్లోనూ ముఖంలోనూ పల్లెటూరి అమాయకత్వం తొంగిచూస్తోంది -

'టిక్కెట్లిస్తానుగానీ కాస్తజరిగి కూర్చుని ఆ బాబుకి చో క్కడ' అని ఆర్డరేసేడు కండక్టరు నోటుతీసుకుంటూ -

అతగాడు తాము కూర్చున్న సీట్లవంక చూశాడు. ఎక చోటులేదు.

'ఇంకెక్కడి సోటు బాబయ్యా - సోటుంటే కూకోబెట్ట' అన్నాడు.

ఆ జవాబు కండక్టర్ని సంతృప్తి పరచలేదు -

'పోనీగదాని వూర్కుంటే లాభం లేదయ్యా మీతో - ద లిస్తున్నాంగదాని మారాజుల మనుకుంటే ఎలా. రెక్కట్టుకుని కి దింపేస్తామంటే అంచక్కా సర్దుకు కూచుంటారు' అన్నాడు.

'ఎందుకు దింపేస్తావయ్యా. మావేం టిక్కెట్లు తీయ బస్సునిండేక వొచ్చినామా? మా నాలుగు సీట్లలోనే మాం కూచున ముసిల్దానికొంట్లో బావుండలేదు — మా యాడదానికి పొద్దున్ వాంతులు- పిల్లలు తొంగుండే పోయారు. ఇంకెక్కడియ్యాల సో ఆ బాబులే యిక్కడ కూకుని మావే ఆలీసంగా వొస్తే సోటిస్తారే అన్నాడు—

ఏమైనా అతగాడి వాదనను పట్టించుకోలేదు కండక్టరు.

ఎలాగోలా అక్కడ చోటిస్తేనే బస్సుకదుల్తుందన్నాడు—

వాదనంతా వింటున్నా బస్సులో ఎవరూ ఎటుపక్కా మాట్లా లేదు.—

కాస్సేపయాంక ముసిల్ది నాను కిందకూసుంటాలే అబా యిక్కడ కూసోబెట్టు! అంటూ క్రిందకు దిగింది,—

సమస్య పరిష్కారమై బస్సుకదిలింది. -

కిటికీలోంచి చల్లనిగాలి వీస్తోంది- విశ్వం ఆలోచనలో వున్నా

'ఎలాగయితేనేం యీ రోజు అనుకున్నట్లు ఆది దేవ దర్శనము జరిగిపోయింది.' అన్నాను మాటల్లోకి దింపా

ఆలోచనల్లోంచి కాస్తయివతలికొచ్చి;

'అవును. మాహాత్మ్యంవున్న దేవుళ్ళతో పాటు త అన్యాయం జరుగుతున్నా నోరు మెదపక సహించే దేవుళ్ళనీ; అధి దర్పంతోనూ; నోటిదబాయింపుతోనూ సొమ్ముచేసుకునే దేవుళ్ళ బాగానే దర్శించుకున్నాం" అన్నాడు విశ్వం.

నేనేం మాట్లాడలేక పోయాను.

)( — ० — )(

# ద్వాత్రింశత్

## శ్రీ ముదివేడు ప్రభాకరరావు

హృదయాస్తమానాలనే విస్మరించిన
విలక్షణ జీవిత ప్రాంగణంలో
న్ని అమూల్యక్షణాలు జారిపోతే
న్ని సంవత్సరాలు గడిచిపోయామో!
య్యో! ఒక్కనాడైనా
        ఒక్కక్షణమైనా
పభూ! నీపాదాల చెంతనే
        పడివున్న నేను
        నీ దివ్యమంగళ సుందర విగ్రహాన్ని
        దర్శించాలని తహతహలాడనేలేదు
        తలయెత్తి చూడనే లేదు!

ఉపాసన'కు నీవు అంది వస్తావని
ఎవరో చెప్పగా విన్నాను
కర్మకూ జ్ఞానానికి మధ్య 'ఉపాసన' ఉందటు!
ఉపాసన విధిగా ఆచరించితే
అదే 'విద్య' అవుతుందటు!!
నిజానికి నాకే ఉపాసనా తెలియదు
ఏ జపానికీ నా మనస్సు లొంగిరాదు
ఏ విద్యా నా కలవడలేదు సరికదా
'నేను' 'నేను' గా మిగిలిపోయాను!
ఎలా ఉద్ధరిస్తావో నన్ను!!

ఆవేవో 'బ్రహ్మవిద్య'లట కదా!
ముప్ఫయి రెండు వున్నాయటు!
నీ గురించి యింకాబాగా చెబుతాయటు!
నాకేమీ బోధపడలేదా విద్యలు!
కాని, నీవున్నావన్నది మాత్రం మిథ్యకాదు!!
అజాయమానుడివి! అంతర్యామివి!
అసలే విద్యలకూ అంతుచిక్కనివాడివి!!
చిగురాకుల కంటే సుతిమెత్తనైన నీపాదాలను
నా చిక్కణమైన ఆర్తితో అభిషేకిస్తాను!
నా హృదయావేదనే నీకు నైవేద్యంగా సమర్పిస్తాను!!
గడచిన నా ద్వాత్రింశత్ వర్షాలే
ఆ ముప్ఫయిరెండు బ్రహ్మవిద్యాసోపానాలనుకో!
కొండెక్కలేక కుములుతూ
కొడిగట్టే ఈ దీపాన్ని
కొండంతగా ఆదుకో!!

—((((♦))))—

# ప్రార్థన



మండే ఆ ఎర్రటి సూర్యుడు
చురుక్కుమన్పించే ఎర్రని ఎండను
కురిపించడం లోను....,

చల్లనైన ఆ తెల్లటి చంద్రుడు
చలువ లూదే తెల్లని వెన్నెలను
సోకించడం లోను....
ఏముంది వింత ?

నల్లటి నీ కంటి కనీనికలు
నీవు కోరచూపు చూసినప్పుడు
సూర్యుళ్ళ వలె చురుక్కుమన్పించడం లోనూ,
అవే- నీవు ఓరచూపు చూసినప్పుడు
చంద్రుళ్ళవలె చలువ లూదడం లోనూ....
ఉంది అసలైన వింత !

ఓ ప్రియతమా !
నీ ఆ కోరచూపు
నా బ్రతుకు లోని
చీకట్ల వైపు చూసి,
నీ ఓరచూపు మాత్రం
ఎప్పుడూ నావైపు చూపు !!!

# ఆరాధన

ఓ మనోహరి!
శృంగార రసఝరి!
నా గుండెల కొండల లోయలలో
పరుగులెత్తే.... స్మృతుల జలపాతం
నీవు!
నా బ్రతుకనెడు ప్రశ్నకు
సమాధానం
నీవు!
నీ సౌందర్య మనెడు
సూర్యుడి ముందు
నే నొక ప్రొద్దుతిరుగుడు పూవు
నౌతాను!
నీ నయనా లనెడు
పౌర్ణమి చంద్రుల గని
నే నొక-కడలనై ఉప్పొంగుతాను!!!

శ్రీ రఘువర్మ

---

# అనుభూతి నేను బతకడానికి పీల్చే ఊపిరి

"శాంతి"

పిచ్చిగా పెరిగిన పచ్చగడ్డి మీద నుండి
పిల్లగాలి కెరటాలుగా కదలినపుడు –
నువ్వు గుర్తొస్తావు

చంద్రకాంతిలేని నిశ్శబ్ద నిశీథంలో
నక్షత్రాల తళుకు కాంతులలో
నా మదిలో ఉయ్యాల లూగుతావు.

రేడియోలో రఫీ గొంతు విన్నపుడు
జానకి నవ్వినపుడు – మాట్లాడతావు – ఇంకా

ఉదయాన్నే సూర్యుని బంగారు కిరణాలు
పూరేకుల మీద మృదువుగా వాలినపుడు

తూనీగలు ఝుమ్మని శబ్దం చేస్తూ
తలల మీదుగా ఎగిరినపుడూ....ఇలా....

తెల్లారిన నుండి – మళ్లీ తెల్లారే దాకా
ఏ అందాన్ని చూసినా
ఏ అనుభూతి పొందినా

జ్ఞాపకాల అడుగుల్లో అజ్ఞాతంగా మిగిలిన నువ్వు
చటుక్కున పైకొచ్చి – ఎలాగున్నావ్ ? అన్నట్టుంటావు

నువ్వు – నిశ్శబ్దంగా నవ్వుతూ
నీ నవ్వుతో ఎదుటి వారిని చిత్తు చేస్తూ
కళ్లతో అల్లరి పెడ్తూ – అవునా – ! – ?

కృష్ణ సర్పం లాంటి నీ జుత్తు
సముద్రపు అఖాతాల్లా నీ కళ్లు –
వెన్నెల కిరణాల్లో తడిసినపుడూ
చిరు జల్లుల్లో మునిగినపుడు
చటుక్కున కన్పించి – చరాలున వెళ్లిపోతావు
నల్లని మబ్బుల మధ్య తళుక్కుమనే మెరుపులా !

వానలో తడిసిన మట్టివాసనా
ఎండు గడ్డి మేటల్లో దొరికే సువాసనా
కలబోసినట్లుంటావ్ – ఎవర్నువ్వు

దారంట తలొంచుకు పోతుంటే
హఠాత్తుగా దర్శన మిచ్చి
అంతులేని ఆనందాన్ని ప్రసాదిస్తావు
ఎంత కరుణ నీ కళ్ళలో
ఎంత జాలి ఆ పేదవులపై – నాపైనే !
ఇంతకీ ఎవర్నువ్వు – ఎవరివి నువ్వు.



రియల్

# థాంక్యూ మిస్టర్ గ్లాడ్

మరాఠీమూలం: అనిల్ బర్వే ## తెలుగు అనువాదం: కె. సుజనాదేవి

(గత సంచిక తరువాయి)

**13**

ఎండ తగ్గుముఖం పట్టింది. బందీ ఖైదీ అవుతోంది. అరుగంటల్లోగా దంటే గ్లాడ్‌సాబ్ ఉరికంబం పూర్వ తయారీకోసం బయల్దేరాలి. సురక్షితత కొరకు అన్ని విధాలా కళ్లలో వత్తులు వేసుకుని శ్రద్ధ తీసుకోవాలి. ఆర్డర్లీ సాబ్ దుస్తులుతెచ్చి ముందరపెట్టాడు. బూట్లు పాలిష్ చేయసాగాడు.

గ్లాడ్‌సాబ్ లేచాడు. అతనింతవరకూ తనకుతనే ధైర్యం చెప్పుకున్నాడు. మనఃక్షోభ మరుగున పడేశాడు. మళ్ళీ ఎప్పటి గ్లాడ్ సాబ్ లాగానే ఇంకో వ్యక్తిని ఉరి తీసేందుకు రెడీ అయ్యాడు. డ్రాయర్లోంచి విస్కీ బాటిల్‌తీసి నోటికందించాడు. గడగడా నాలు గుక్కలు తాగాడో లేదో ఫోను మ్రోగింది.

మ్రోగే ఫోన్‌కేసి అలాగే చూస్తుండి పోయాడు గ్లాడ్‌సాబ్. బహుశా ఇదన్నా ఉరిశిక్ష రద్దుచేసే ఫోనేమో! తన హయాంలో ఓ పెద్ద లీడర్ తొమ్మిదిమంది గిరిజనుల్ని నిలువునా నిప్పంటించి కాల్చి నందుకతనికి నాలుగుసార్లు ఉరిశిక్ష విధించారు. కాని అతడు పెద్ద లీడరు కాబట్టి ఇలాగే ఉరికి ముందు రోజు రాత్రి అతని శిక్ష రద్దు చేయబడింది. అంతేకాదు; రెండేళ్ల తరువాత అతడు విడుదల చేయ బడ్డాడు. ఆ సంగతి గుర్తు రాగానే గ్లాడ్‌సాబ్‌కనిపించింది; ఓ నరరూప రాక్షసుడి ఉరిశిక్ష రద్దైనప్పుడు ఓ బుద్ధిమంతుడైన, క్రాంతివీరుడైన యువకుని ఉరిశిక్ష రద్దెందుక్కాకూడదు?

ఫోను ఆగకుండా మ్రోగుతూనే ఉంది. గ్లాడ్‌సాబ్ రిసీవ రెత్తాడు. సీనియర్ జైలర్ మాట్లాడుతున్నాడు. "సర్, ఖైదీ నంబర్ 738..."

"ఎవరు?" అడిగాడు గ్లాడ్‌సాబ్.

"సర్, ఆ ఫాసీగేట్‌లోని పిచ్చి ఖైదీ ఇవ్వాళ మధ్యాహ్నం పడుకున్నవాడు లేవనేలేదు. నిద్రలోనే చచ్చుంటాడు సర్."

"అవునా? అలాగే ఉంచండి. నేనొస్తున్నా" అంటూ ఆర్డర్ జారీచేసి వెనుదిరిగేలోగా ఆర్డర్లీ సాబ్‌కు బూట్లు తొడిగేందుకు సిద్ధంగా నుంచున్నాడు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆకాశం అంతా నారింజరంగు పులుముకుంది. జైలంతా మృత్యువు నీడపరచుకొంది. రాతిగోడలు చీకటి రూపాన్ని తాలుస్తున్నాయి.

పక్షుల కిలకిలారావం ఆగిపోయింది. రోడ్డు నిర్మానుష్యమై పోయింది. నల్లని తారురోడ్డుమీద బూట్లశబ్దం వినిపించింది. గార్డు డ్యూటీ హవల్దారు అటెన్షన్‌లో నిలబడ్డాడు. గ్లాడ్‌సాబ్ జైల్లో అడుగు పెట్టాడు. ఫాసీగేట్ కేసి నడిచాడు. ఎదురుగా ఉన్న సెల్ లన్నీ బోసిగా, ప్రాణంలేని కట్టెలాగా, అచేతనంగా ఉన్నాయి. ఒక్క నక్స్‌లైట్ మాత్రం మిణుకు మిణుకు మంటున్న దీపం వెలుగులో ఏదో వ్రాస్తున్నాడు పక్క సెల్‌లో పిచ్చిఖైదీ శవం సాబ్ కని పించింది. "రేపు రాత్రికల్లా ఫాసీగేట్ మొత్తం చీకటిమయమై పోతుంది. మళ్ళీ ఈ ఫాసీగేట్ కెప్పుడూ ఎవరూ ఉరిశిక్షతోరావద్దు. మలిగేందుకు ఇక్కడ దీపాలు వెలగొద్దు" అని.

గ్లాడ్‌సాబ్ వచ్చిందిచూసి ఫాసీగేట్ పెహరి జమాదార్, జైలర్, సీనియర్ జైలర్ అంతా ముందుకొచ్చి సలాంకొట్టారు. పెహరి జమా దార్ చెప్పసాగాడు. "సాబ్, ఉదయం భోంచేయగానే పిచ్చి ఖైదీ నిద్రపోయాడు. మళ్ళీ లేవనేలేదు. అనుమానంవేసి ఇందాక లోపలికెళ్లి చూద్దునుగదా చచ్చి..."

"ఆర్. ఎమ్. ఓ. పరీక్షించాడా?" గ్లాడ్‌సాబ్ అడిగాడు.

"నో సర్; ఇవ్వాళ్ళ ప్రొద్దున్నే తమ్ముడు జబ్బుగా ఉన్నట్టు టెలిగ్రాం వచ్చిందనిచెప్పి లీవ్ అప్లికేషన్‌పడేసి ఆయన ఊరెళ్లారు." అన్నాడు సీనియర్ జైలర్.



"పిరికివెధవ! అతనికి ఎప్పుడూ ఇదే అలవాటు. ఉరిశిక్ష రోజే సరిగ్గా ఏదో నెపంతో సెలవు పెడతాడు" కోపంగా అన్నాడు గ్లాడ్‌సాబ్.

"సర్, డాక్టరుగారు ఖైదీల నురితీసేప్పుడు చూసి సహించలేరేమో" సందేహం వ్యక్తపరిచాడు సీనియర్.

"మరి జైలుడాక్టరెందుకయ్యాట్ట? సాలా, ఉత్త వెధవలు. ఆపరేషన్ టేబుల్‌మీద మనుషుల్ని అడ్డదిడ్డంగా నరికి పోగులు పెడతారే. అప్పుడు లేనిభయం ఉరితీసేప్పుడెందుకుట? నాన్‌సెన్స్. జైలుడాక్టరెందుకయ్యాడో పిరికిపంద" ఉద్వేగంగానూ తిరస్కారంగానూ కోప్పడుతున్నాడు గ్లాడ్‌సాబ్.

కాసేపంతా నిశ్శబ్దంగా గడిచింది. ఎప్పటిలాగే ముందున్న ప్రసంగంనుంచి దారితీస్తూ గ్లాడ్‌సాబ్ "ఓ పనిచేయండి. రేపెలాగూ ఉదయం సివిల్‌సర్జన్ వస్తారుగా, అప్పుడు సక్సలైట్‌తోబాటు పిచ్చివాణ్ణి పోస్టుమార్టం చేయించండి. రిపోర్ట్ తయారు చేయండి" అన్నాడు.

అందరూ తలూపారు. మళ్ళీ కాసేపు నిశ్శబ్దం రాజ్యంచేసింది. సాబ్ బయల్దేరుతూ యధాలాపంగా వెర్రి జమాదార్ నడిగాడు" జమాదార్, చచ్చేముందుకూడా పిచ్చిఖైదీ 'నేను హత్య చేయలేదు, హత్యచేయలే'దంటూ అరిచాడా?"

"లేదుసాబ్, ఇవ్వాళ్లొక్కసారికూడా అలా అరవలేదు పొద్దుట్నించీ అతడివ్వాళ పాడుతూ ఉన్నాడు" జమాదార్ జవాబిచ్చాడు.

జమాదార్ మాటలకు గ్లాడ్‌సాబ్ కాశ్చర్యం వేసింది. "ఏం పాడాడేమిటి?" కుతూహలంగా అడిగాడు.

జమాదార్ వెంటనే అందుకున్నాడు "ఓ ప్రియతమా నీకోసం..." అంటూ పాడాడండీ.

సాబ్ కాళ్లు నేలకంటుకుపోయాయి. క్షణకాలం తను బాహ్యస్మృతిని కోల్పోయినట్టుగా భావించాడతను. కాసేపటి కెలాగోలా సర్దుకుని బరువుగా కాళ్ళీడ్చుకుంటూ ఫాసీగేటు బయటపడ్డాడు.

బయట కీచురాళ్ళ రొద మొదలయింది.

**14**

"ఎత్తైన గోపురంగల చర్చిలోకి ప్రవేశిస్తున్నట్టు తోస్తుంది." ఫ్లైట్ మాటలు గింగురుమన్నాయి గ్లాడ్‌సాబ్ చెవుల్లో. క్షణం సేపాగి చుట్టూ పరికించాడు. ఫాసీకోఠీముందున్న మైదానంలోని గడ్డి పీకేసి శుభ్రంచేశారు. చిన్న గడ్డిపరకకూడాలేని ఆ స్థలం చూస్తుంటే జీవితపు అవశేషాలేవీ అక్కడ మిగిలి ఉండొద్దని సూచిస్తున్నట్టుంది.

గ్లాడ్‌సాబ్ నాలుగడుగులుముందుకేశాడు. బూట్లతో నెమ్మదిగా తలుపులు తోశాడు. కోఠీ తలుపులు మామూలుకన్నా ఎక్కువ కిర్రుమన్నాయి. తలుపుల సందులు తుప్పుపట్టాయి.

"కొత్త గొళ్ళాలు పెట్టించండి. తలుపుసందులు శుభ్రంచేసి పాలిష్ చేయండి" అంటూ సాబ్ ఫర్మాయించగానే ఫాసీగేట్ జైలర్ నోట్‌బుక్‌లో నోట్ చేసుకున్నాడు.

సాబ్ కోఠీలో కడుగుపెట్టాడు. రూం మొత్తం ఫినైల్‌తో శుభ్రంగా కడగబడింది. గోడలుకూడా కొత్త నోట్‌బుక్‌లోని పేజీలా మెరుస్తున్నాయి. సాబ్ నెమ్మదిగా స్లోప్‌మీదుగా వాసంకింది గోతిలోకి దిగాడు. తలపైనున్న చెక్క పలకకూ, కాళ్ళక్రింది రాతి పలకకూ సరిగా ఎనిమిదడుగులదూరం ఉందో లేదో మళ్ళీ పరీక్షించాడు. పైకి వచ్చి స్లోప్ మీదుగా వాసం పైకెక్కాడు. ఉరిత్రాటి దగ్గరి పలకల్ని మూడు నాలుగుసార్లు గట్టిగా తన్నిచూశాడు. గట్టిగానే ఉన్నాయి. తర్వాత నెమ్మదిగా ఎగిరి పైబార్ పట్టుకుని ఓ ప్లస్‌చేసి చూశాడు. బార్ గట్టిగానే ఉంది కాని కొంచెం వంకరగా ఉంది. గోడలో కమర్చబడ్డ బార్‌స్క్రూలను గట్టిగా బిగించమని ఆర్డరు వేశాడు.

ఫాసీగేట్ జైలర్ త్వరగా పత్రంగిశాల వార్డర్ని పిలిపించాడు. గ్లాడ్‌సాబ్ మళ్ళీ పొరపాట్లు రావద్దని పలకల్ని మళ్ళీ మళ్ళీ పరీక్షించాడు. నూనె రాయడంవల్ల మెరుస్తున్న ఆ పలకలు మానవ రక్తం కోసం ఉవ్విళ్ళూరుతూ నాలుకలు తెరుస్తున్న రాక్షసుల్లాగా కనిపించాయి.

ఆఖర్న గ్లాడ్‌సాబ్ ఉరితాడు పరీక్షించాడు. వెన్నలో ముంచి మూడు రోజుల్నుంచీ నానబెట్టిన త్రాడు చేతిలో నిలవడంలేదు. సర్రున జారిపోతూంది. సాబ్ త్రాటి ఇత్తడి హుక్‌ను పరిశీలించాడు. ఎప్పటిలాగే చల్లగా, బరువుగా ఉంది. ఖైదీ చెవులక్రింద సర్రున గుచ్చుకుని అతని నరాల్ని తెంపగల సామర్థ్యం కలిగి ఉంది. అన్నీ సరిగ్గా ఉన్నట్టు చూచుకుని ప్రసన్నంగా తలూపి ట్రయల్ చేయమని ఆదేశమిచ్చాడు.

ఇద్దరు సిపాయిలు ఇసుకబస్తాల నీడ్చుకుంటూ తీసుకొచ్చారు. సాబ్ బస్తాలను తూకం వేయించాడు. సరిగ్గా నూటనలభై పౌండ్లు. రిజిస్టర్‌లోకిచూస్తూ నక్సలైట్ బరువూ అంతేనని తేల్చుకున్నాడు.

సిపాయీలు బస్తాలను ఈడుస్తూతెచ్చి ఫలకంమీద ఉంచారు. ఫాసీగేట్ జైలర్ ఉరిత్రాటిని బస్తాలచుట్టూ సరిగ్గా చుట్టాడు. హుక్‌లు ఇసకలో దిగబడ్డాయి. బస్తాలు బిగుసుకున్నాయి. ఫాసీగేట్ జైలర్ క్రిందికి దిగాడు. సీనియర్ పక్కన నుంచున్నాడు.

గ్లాడ్‌సాబ్ స్విచ్ నొక్కాడు. ఖడాడ్ ఖాడ్ అంటూ పలకలు పడిపోయాయి. వాటి చప్పుడు ఆ మూసివున్న రాతిగోడల మధ్య భయంకరంగా ప్రతిధ్వనించింది. గ్లాడ్‌సాబ్ గుండె బేజారెత్తింది. కాళ్లూ చేతులూ వణకసాగాయి.

ఉరిబస్తా చిరిగి ఇసకంతా వేగంగా క్రింది గొయ్యిలో పడుతుంటే ఇసకలాగే గ్లాడ్‌సాబ్ ధైర్యంకూడా తగ్గిపోసాగింది.

"అంతా సరిగానే ఉంది. అంతా సరిగానే ఉంది" అంటూ యార్డుల్లో రాత్రి డ్యూటీ హవల్దారులు అరుస్తున్నారు.

ఫాసీగేట్ తలుపులు తెరువబడ్డాయి. గ్లాడ్‌సాబ్ బయటపడ్డాడు. ఇంతలో వెర్రి జమాదారు గబగబా ముందుకొచ్చి సాబ్ తల మీదకి గొడుగుపట్టాడు.

బయట కుండపోతగా వర్షం కురుస్తోంది. ఉరుములూ, మెరుపుల్తో కాళరాత్రిలా తోస్తుంది.

రేపటి ఉరికోసం కావల్సినవన్నీ సిద్ధమయ్యాయి. మేన్‌గేట్ మీద గస్తీ హెచ్చింది. కాంపౌండువాల్ బయటి ఆర్మ్డ్ హవల్దారులు ఒక్కొక్కరే లోనికి రాసాగారు. ప్రతియార్డ్‌లోనూ పహారా పెరిగింది. మధ్యరాత్రి మళ్ళి ఓ సారందర్నీ లెక్కించారు.

నిజానికి ఇంత కఠినంగా బందోబస్తు చేయాల్సిన అవసరమేమీ లేదు. తోడేళ్ళకు విరుద్ధంగా గొఱ్ఱెపిల్లలెప్పుడూ క్రాంతి చేయలేవు. కానీ, పద్ధతంటే పద్ధతే. అంతా పద్ధతిప్రకారం జరగాల్సిందే.

గ్లాడ్‌సాబ్ తన ఆఫీసులోకొచ్చి కూర్చున్నాడు. నక్సలైట్ కేస్ పేపర్లు, రిజిస్టరూ అతని ముందున్నాయి. అతడు మళ్ళీ మళ్ళీ పరిశీలించి అంతా సరిగాఉన్నట్టు కన్ఫర్మ్ చేసుకున్నాడు. "సబ్ ఠీక్ హై, సబ్ ఠీక్ హై" యార్డుల్లో రాత్రి డ్యూటీ హవల్దారులు అరుస్తున్నారు.

సాబ్ జేబులోంచి విస్కీ బాటిల్ తీసి నోట్లో ఒంపుకున్నాడు. ఇంతసేపూ కరుగబోతున్న గుండె మళ్ళీ బండగా మారింది. కాళ్లూ

చేతులూ మళ్ళీ బిగుసుకున్నాయి. సాబ్ మళ్ళీ ఎప్పటి సాబ్‌లా మారాడు. ఉరిత్రాడు ఇంకా నిష్ప్రాణమైంది.

"సర్, టెలిఫోన్ లైన్ ఈస్ ఔట్ అఫ్ ఆర్డర్" సీనియర్ జైలర్ సాబ్‌కు చెప్పాడు.

"వాట్ ?" గ్లాడ్‌సాబ్ విసుగ్గా అంటూ రిసీవర్ ఎత్తి చెవి కానించి చూసాడు. నాలుగుసార్లు డయల్ తిప్పి చూశాడు. లైన్ డెడ్ అయిందని తెలీగానే రిసీవర్ గిరాటేశాడు. "ఐ హాంగ్డ్ వన్ హండ్రెడ్ అండ్ ఎలెవన్ క్రిమినల్స్. కాని ఈ నక్సలైటంత మన స్తాపం నాకెప్పుడూ కలిగించలేదు. నౌ వాట్ ది హెల్ డూ ఐ డూ?" చిరాగ్గా గొణుక్కున్నాడు. గ్లాడ్‌సాబ్ ముందు పెద్ద సమస్య ఉంది. రివాజు ప్రకారం మధ్యరాత్రే సివిల్ సర్జన్ను జైలుకు తీసుకు రావాలి. ఉదయం ఆరు గంటల కల్లా ఉరి. కాని ఇంతవరకూ సర్జను అయిపులేడు. నది ఉప్పొంగి ప్రవహిస్తున్నది. జైలుకు, టౌనుతోగల సంబంధం తెగిపోయింది. ఇవన్నీ చాలవన్నట్లు ఇప్పుడే టెలిఫోన్ అవుటాఫ్ ఆర్డర్.

"సర్ రైడర్‌ను వైజాగ్ రోడ్ పంపుదాం." తన సబార్డినేట్ సీనియర్ జైలర్ తనకు ఉపాయాన్ని సూచించడం ఇంకోసారైతే గ్లాడ్‌సాబ్‌కు కోపం తెప్పించేదే... కాని ఇప్పుడు గత్యంతరం లేదు. వైజాగ్‌రోడ్ సరిగాలేదు. పైగా దూరంకూడా. మోటర్‌సైకిల్‌మీద మెసెంజర్‌వెళ్ళి, డి. ఎస్. పి. నుంచి పోలీసుజీపు తీసుకుని సివిల్ సర్జన్నీ, డిస్ట్రిక్టు మేజస్ట్రేట్‌నూ తీసుకురావాలన్న నిర్ణయంజరిగింది. ఏలాగూ నదినీళ్లు అట్టే సేపుపొంగవు. తెల్లవారుఝాముపరకు సర్జన్ రాగలిగినా చాలు.

సీనియర్ జైలర్, డి. ఎస్. పి. కోసం లెటర్ డిక్టేట్‌చేస్తుంటే టైపిస్టు గబగబా టైపు చేశాడు. గ్లాడ్‌సాబోసారి పరిశీలించి సైన్ చేశాడు. మేన్‌గేట్ జైలర్ మెసేజ్ గబగబా కవర్లో పెట్టి సీలువేశాడు. తడిసిన రెయిన్ కోటును సవరించుకుంటూ రైడర్ మోటార్‌సైకిల్ మీద బయల్దేరాడు.

సీనియర్ జైలర్ టోపీతీసి చెమటలు తుడుచుకున్నాడు. గ్లాడ్‌సాబ్ విస్కీసీసా నోట్లో ఒంపుకున్నాడు.

రైడర్‌వెళ్ళి గంట గడిచినా వర్షం జోరుమాత్రం తగ్గలేదు. ఆకాశం చిల్లులు పడిందాన్నంత కుండపోతగా వర్షం కురుస్తూనే ఉంది. రోడ్డుమీద మోకాలిలోతు నీళ్లు ప్రవహిస్తున్నాయి. మేన్‌గేట్‌లోకూడా మడమల్లోతుదాకా నీళ్లు నిలిచాయి. ఫాసీగేట్ కోఠీలోకి నీళ్లు పోతాయేమోనన్న భయం ఫాసీగేట్ జైలర్‌కు పట్టుకుంది. సీనియర్ ధగ్గర ఫార్మల్‌గా పర్మిషన్ తీసుకుని నలుగురు వార్డర్లనీ, నలుగురు వాచ్‌మన్లనీలేపి తీసుకొచ్చాడు. వాళ్లచేత వంటశాల్లోంచి ఇసుక బస్తాలు తెప్పించి ఫాసీ కోఠీద్వారంముందు వేయించసాగాడు.

మామూలుగా ఉరికి ముందు రాత్రి అశుభంగానూ, భయకరంగానూ ఉంటుంది. కాని ఈ రాత్రిలో మామూలు అశుభమేకాక కొంచెం వైచిత్రికూడా ఉంది. స్టాఫ్‌లో ఎవ్వరికీ కన్ను మూర్లవడడంలేదు, తోచడంలేదు. పహారాలోవున్న హవల్దార్, జమాదాత నుంచీ సీనియర్ జైలర్‌దాకా అందరూ ఆరుగంటలెప్పుడౌతుందాని ఎదురుచూస్తున్నారు. ఆరుగంటలవ్వాలి, బడాసాబ్ స్విచ్ ఆన్ చేయాలి, అన్ని యార్డుల్లో "సబ్ ఠీక్ హై" అన్న మాట వినిపించాలి, అప్పుడు అందరూ 'హమ్మయ్య', గుండెలనిండా గాలి పీల్చుకోవాలి.

పహారాలో ఉన్న నైట్ డ్యూటీ హవల్దార్‌లకుమాత్రం చాలా ఇబ్బందిగావుంది. సాయంత్రం రోల్‌కాల్ అయిన వెంటనే వాళ్లకు డ్యూటీలు పంచేసి యార్డుల్లోకి పంపించారు. భోజనంచేసే టైంకూడా వాళ్లకు దొరకలేదు. ఆదీగాక ఇవ్వాళ ఉరిరోజు కాబట్టి ఒక్క యార్డులోనూ, ఒక్క బరాక్‌లోనూ ఎక్కడా హండీ వెలగలేదు. సంఘంలో అత్యంత నీచులూ రాటుతేలినవారూ అని పేరొందిన ఖైదీల లోకంలో కూడా ఉరిశిక్షరోజు హండీ వెలిగింపడం, గంజాయి; చిలుం పీల్చడం, జూదం ఆడటం ఇలాంటి పనులన్నీ అసభ్యకరమైనవీ, అసహ్యకరమైనవిగా తలచబడతాయి. కాళ్లు ముడుచుకుని వాసాల్లెక్క పెడుతూ అంతా ఆరు గంటలకోసం ఎదురుచూస్తూ ఊరికే పడుంటారు. అవును మరి! వాళ్లలో ఒకడు ఇవాళ ఉరి తీయయబడతాడుకదా!

—బయట ఇంత చికాగ్గావున్నా ఫాసీగేట్‌లోని నక్సలైట్ మాత్రం తన సెల్‌లో మైకోవస్కీ పోయెమ్స్ చదువుతూ చదువుతూనే హాయిగా నిద్రపోయాడు.

కుండపోత వర్షంలో గొడుగున్నడ్డు పెట్టుకుని బడాసాబ్ సెంట్రీ జైలుకు రావడంచూచి మేన్‌గేట్ జమాదార్ గేట్ తెరిచాడు. సెంట్రీ వణకుతూ లోపలికొచ్చి "సాబ్ ఉన్నారా?" అని అడిగాడు.

"ఆఁ ఉన్నారు." జమాదార్ జవాబు చెప్పాడు. "బడేసాబ్!" సెంట్రీ గ్లాడ్‌సాబ్ ముందుకెళ్ళి సలాం కొడుతూ పిలిచాడు.

"ఏమిటి?" అసలే చిరాగ్గావున్న గ్లాడ్‌సాబ్ బొమ్మలు ముడిపెట్టి కొంచెం గట్టిగానే అడిగాడు.

"సాబ్ బేబీమేమ్‌సాబ్‌కు చాలా కష్టంగా ఉంది. మిమ్మల్ని పిలుస్తున్నారు..." సెంట్రీకి సరిగా చెప్పరావడంలేదు. వాడి మొహం చూస్తే బాగా బెదిరిపోతున్నట్లు కనిపించాడు. పరిస్థితి వాడి మొహం

మీద స్పష్టమవడంతో గ్లాడ్‌సాబ్ అర్థంచేసుకుని వెంటనే లేచాడు. సీనియర్‌కూడా తలపై హాట్ పెట్టుకునిలేస్తూ "సర్, ఫ్రమ్ ది యెస్టర్‌డే నర్స్ ఈజ్ అటెండింగ్ అన్ హర్" అంటూ సాబ్‌కు చెప్పాడు. హాస్పిటల్ నర్స్ బేబీమేమ్‌సాబ్‌కోసం నిన్నటిన్నించీ వాళ్ళింట్లోనే ఉంటున్నది. పైగా టౌన్‌లోని వుమెన్స్ స్పెషలిస్ట్ రెండు వారాల తరువాతి డేట్ ఇచ్చింది. మామూలుగా నాలుగైదు రోజులు ముందు వెనుకవుతూనే ఉంటుంది. అయినా "భయపడే పనేంలే"దని సీనియర్ తన పాతపాట మొదలెట్టాడు. కాని ఆ అమ్మాయి గ్లాడ్‌సాబ్ కూతురు.

"ఓ సారి స్వయంగా చూసొస్తే మంచిదికదా!" అనుకుంటూ గ్లాడ్‌సాబ్ వర్షంలో బయల్దేరాడు. అతనివెనుక సీనియర్‌గూడా బయల్దేరాడు. స్వయంగా తడుస్తూ సాబ్ తలకుగొడుగు పట్టేందుకు సెంట్రీ ముందుకొచ్చేవరకు సాబ్ సగం తడిసిపోయాడు.

గ్లాడ్‌సాబ్ బంగళాగేట్ దగ్గిరకొచ్చేటప్పటికి; బాధ భరించలేక అరిచే జీన్ అరుపు వినిపించి అలాగే గేటుకానుకు పోయాడు. అతని అడుగు ముందుకు పడలేదు. జీన్ అరుపుల్తో అతని గుండె నీరైంది. కాళ్లు వొణికిపోయాయి. సీనియర్ పరిస్థితినర్థం చేసుకుని సాబ్‌కు ధైర్యంచెబుతూ బంగళాకేసి నడిపించాడు...

సీనియర్ సాబ్‌కన్నా తక్కువ రాంక్‌వాడైనా ఈవిషయంలో మాత్రం సాబ్‌కన్నా సీనియర్ అతను. నలుగురు పిల్లల తండ్రి, ఇద్దరు మనవలకి తాతయ్యతను. గ్లాడ్‌సాబ్ తన హోదా, తన యూనిఫాం అంతా మరచిపోయి సీనియర్ సలహాకోసం ఆశగా అతని కేసి చూశాడు.

"యూ డోంట్ వర్రీ సర్, దేర్ ఈజ్ నథింగ్ సీరియస్." సీనియర్ గ్లాడ్‌సాబ్‌కు ధైర్యం చెప్పాడేకాని బంగళాలోకడుగుపెట్టాక అక్కడి వాతావరణంచూసి భయపడ్డాడు.

క్రింద హాల్లో నలుగురైదుగురు ఆడాళ్లు నోట్లో చీరచెంగు కుక్కుకుని కూర్చున్నారు. గంభీరంగా ఉన్నాయి వాళ్ల ముఖాలు. తమలో తామే ఏవేవో గుసగుసలు పోతున్న ఆ ఆడాళ్లలోంచి ఓ నడి వయస్కురాలు సీనియర్ జైలర్‌ని చూస్తూనే అతని దగ్గరకొచ్చి అతని చెవిలో నెమ్మదిగా తెలుగులో ఏదో చెప్పింది. సీనియర్ ముఖం ఇంకా గంభీరంగా మారింది. గ్లాడ్‌సాబ్‌కేమీ అర్థం కాలేదు. "హౌ ఈజ్ షీ? వాటీజ్ షీ సే" అడిగాడు.

గ్లాడ్‌సాబ్ కరుణస్వరంతో మళ్ళీ మళ్ళీ అడుగుతున్నా విని పించుకోకుండా ఒక్క మాటకూడా అతన్తో మాట్లాడకుండా మెట్లెక్కసాగాడు సీనియర్. అతన్తోబాటే మెట్లెక్కిన గ్లాడ్‌సాబ్ జీన్ అరుపు విని కుర్చీలో కూలబడ్డాడు. సీనియర్ జీన్ రూం తలుపు తట్టాడు.

ముఖంమీద చెమటలు తుడుచుకుంటూ నర్సు మెల్లిగా తొంగిచూసి "కేస్ చాలా సీరియస్, వెంటనే సిజేరియన్ చేయకపోతే పేంషెంట్ బ్రతకదు" అంది.

సీనియర్ మాటలేక అలాగే నుంచుండిపోయాడు. గ్లాడ్‌సాబ్ గబుక్కున ముందుకొచ్చి నర్సు భుజాలు పట్టుకుని కుదుపుతూ ఏమయిందని అడిగాడు. నర్స్ మళ్ళీ చెప్పింది. గ్లాడ్‌సాబ్ గాభరా పడ్డాడు. ఏం చెయ్యాలో తోచక పిచ్చిగా అరిచాడు. "అంబులెన్స్, అంబులెన్స్" అంటూ.

గ్లాడ్‌సాబ్ గాభరాతో, భయంతో పరిసరాలుమరచినా సీనియర్ మాత్రం పూర్తిగా స్పృహలో ఉన్నాడు. అంబులెన్స్ తెప్పించి ఏం లాభంలేదు. ఈ స్థితిలోవున్న పేషంట్‌ను అంబులెన్స్‌లో తీసుకెళ్లడం కష్టం. పైగా వర్షంవల్ల టౌన్‌తో సంబంధం తెగిపోయింది.

"ఏ సర్జన్ అవేలబల్ లేడా!" గ్లాడ్‌సాబ్ పిచ్చిగా మళ్ళీమళ్ళీ అడుగుతున్నాడు. కాని ఆర్. ఎమ్. ఓ. లీవు పెట్టాడు. సివిల్ సర్జన్ తెల్లవారుఝామున వస్తాడు. టౌను కెళ్ళగలగడం అసంభవం. ఎలాగోలా గుండె దిటవు చేసుకుని సీనియర్ అన్నాడు. "సర్ వుయ్ హేవ్ టు వెయిట్ అన్‌టిల్ ది మార్నింగ్."

కాని అంతవరకాగడం కూడా అసంభవమే. ఇంతలో నర్స్ హటాత్తుగా అడిగింది. "సర్ ఆ నక్సలైట్ మంచి సర్జన్ కదూ?"

సీనియర్ నర్స్‌కేసి గుడ్లురిమి చూశాడు. కాని నర్స్ అతని కేసి చూడనైనా చూడకుండా నేరుగా గ్లాడ్‌సాబ్‌నే అడిగింది. "సర్, ఆ నక్సలైట్‌ను పిలిపించండి. నాతో ఓసారి ఆర్. ఎమ్. ఓ. అన్నారు. "హీ ఈజె వెరీ గుడ్ సర్జన్" అని. ఇక్విప్‌మెంట్ అంతా మనవద్ద ఉంది."

నర్స్ సలహా విని గ్లాడ్‌సాబ్ స్తబ్ధుయ్యాడు. ఉరిశిక్ష పడ్డ ఖైదీని జైల్లో కూడా ఫాసిగేట్ బయటకు తీసుకురావడానికి రూల్సొప్పుకోవు. అలాంటిది ఇంకో నాలుగ్గంటల్లో ఉరి తీయవలసిన వాణ్ణి జైలు బయటకు తీసుకు రావడమా? అసంభవం, కేవలం అసంభవం.

కాని జీన్ మూల్గులూ, అరుపులూ గ్లాడ్‌సాబ్‌ను హతబలుణ్ణి చేశాయి. కూతురి ప్రాణం దక్కించుకోవాలంటే చట్టాన్ని తీసి చూరుకు చెక్కడం కంటే గత్యంతరం లేదు. మరి, చట్టాన్ని అధిగమించడం గ్లాడ్‌సాబ్ ఇంటావంటా లేదు.

జీన్ చేసిన ఆర్తనాదంతో సీనియర్ ఉలిక్కిపడ్డాడు. గ్లాడ్ సాబ్‌కు ఏడుపొచ్చినంత పనైంది. నర్స్ పట్టరానికోపంతో గ్లాడ్

సాబ్‌తో అనేసింది. "మిస్టర్ గ్లాడ్, యూ టేక్ యువర్ ఓన్ డెసిషన్ ఇమీడియట్లీ. ఒకవేళ ఏదన్నా జరక్కూడనిది జరిగితే నన్ను బ్లేమ్ చెయ్యొద్దు."

గ్లాడ్‌సాబ్ ఏదో నిర్ణయం తీసుకున్న వాడిలా నిశ్చలంగా నిలబడ్డాడు. విస్కీ బాటిల్ నోట్లో ఒంపుకున్నాడు. నర్స్‌తో "ఇక్విప్‌మెంట్ రెడీ చెయ్. సర్జన్ను నేను తీసుకొస్తా"మని ఆర్డరు వేశాడు.

బడా సాబ్ ఆర్డర్ జారీ చేయడంతో "ఉరిశిక్ష ఎక్కడైనా పోతే పీడాపోయె సాబ్ ఆర్డర్ అతి ముఖ్యం" సెంట్రీ పరిస్థితి నర్థం చేసుకుని ఫాసీగేట్ జైలర్‌కు ముందుగా ఇన్‌ఫాం చేయడానికి పరుగెత్తాడు. సీనియర్ సాబ్‌కు సెల్యూట్ కొట్టి, సాబ్ చట్టవిరుద్ధమైన హుకుంను అమలుపరిచేందుకు జైలుకేసి నడిచాడు.

## 15

సీనియర్ జైలర్ గబగబా నడుస్తున్నాడు. గార్డు డ్యూటీ జమాదార్లు రైఫిళ్ల సవరించుకుంటూ అతని వెనకాల పరుగులు పెడుతున్నారు. ఫాసీగేట్ జైలర్ సీనియర్ సాబ్‌కోసం ఎదురు చూస్తూనే ఉన్నాడు. సీనియర్ జైలర్ రావడం, ఆజ్ఞ ఇవ్వడం, ఫాసీగేట్ తలుపులు కిర్రుమంటూ తెరుచుకోవడం అంతా క్షణాలమీద జరిగింది. తన రక్షక దళంతో సీనియర్ సాబ్ నక్సలైట్ సెల్ ముందాగాడు.

ఉరి శాలలో ఉరి త్రాడు వ్రేలాడుతుంది. బయట పర్షం తుఫాను అకాండ తాండవం చేస్తున్నాయి. గడియారం ముళ్లు క్షణ క్షణానికి ఆరు గంటలకేసి జరుగుతున్నాయి.

కాని, నక్సలైట్ మాత్రం తన సెల్‌లో శాంతంగా నిశ్చింతగా నిద్రపోతున్నాడు. మైకోవస్కీ పోయెమ్స్ అతని గుండె చప్పుడు వింటూ అతని ఛాతిపై పడున్నాయి.

అది చూసిన సీనియర్ జైలర్‌కు క్షణంసేపు మతిపోయినంత పనైంది. ఇంకాసేపట్లో హాంగ్ అవబోయే వ్యక్తి పుస్తకాలు చదవడమే ఆశ్చర్యం, హాయిగా నిద్రపోవడం మహదాశ్చర్యం. నిజానికి అయిదున్నరకి తను ఉరికంబం ఎక్కించడానికి నక్సలైట్‌ను లేపాల్సింది. అలాంటిది గ్లాడ్‌సాబ్ కూతురి ప్రాణభిక్ష ఎలా అడగాలో తోచడం లేదు. తన చేతిలోని లాఠీ ఊరికే జైలు కటకటాల మీద తిప్పాడు. 'టక్, టక్, టక్, టక్' శబ్దంతో నక్సలైట్ మేలుకున్నాడు.

"డాక్టర్, డాక్టర్" సీనియర్ సాబ్ తడబడే కంఠంతో పిలిచాడు.

నక్సలైట్ కళ్లు తెరిచి ఓసారి రూఫ్‌కేసి చూశాడు. మెల్లిగా లేస్తూ సీనియర్ సాబ్ నడిగాడు "వెళ్లాల్సిన టైం అయిందా?"

సీనియర్ లేదన్నట్టు తలాడించాడు.

"దెన్ వై డూ యూ డిస్టర్బ్ మీ?" కొంచెం చిరాగ్గా అడిగాడు నక్సలైట్.

ఒక్క క్షణం మాట్లాడలేకపోయాడు సీనియర్. తరువాత నెమ్మదిగా తలొంచుకుని "గ్లాడ్‌సాబ్ మీకోసం ఎదురుచూస్తున్నారు. జీన్ ప్రసవవేదన పడుతూంది" ఒక్క గుక్కలో అలా అప్పజెప్పినట్టుగా అనేశాడు.

అతని మాటల్తో నక్సలైట్ స్తంభితుడయ్యాడు. "డాక్టరెవరూ అవేలబుల్ లేరా?" అడిగాడు.

"బై గాడ్, ఓన్లీ యూ ఆర్ దేర్." సీనియర్ జవాబిచ్చాడు.

"మరి ఇక్విప్‌మెంట్?"

"నర్స్ బంగళాలో సిద్ధంగా ఉంచింది." వివరించాడు సీనియర్.

కాసేపేదో తనలో తనే ఆలోచించుకుని నక్సలైట్ సీనియర్ దగ్గరికొచ్చి కొంటెగా కన్ను గీటుతూ "పదండి, చచ్చేముందు అకాస్త పుణ్యమన్నా మూట కట్టుకోవచ్చు." అన్నాడు.

వెర్రి జమాదారు సెకండ్‌కూడా వేస్ట్ చేయకుండా తలుపు తెరిచాడు. ఫాసీగేట్ జైలర్ నక్సలైట్ చేతులకు బేడీలువేసి ఓ బేడీ తన చేతికి తగిలించుకుని పదమన్నట్టు చూశాడు. నక్సలైట్ బయల్దేరాడు. గార్డ్ డ్యూటీలోని శస్త్రధారులైన సైనికులు ముందూ వెనకా నడుస్తున్నారు.

ఈ విధంగా ఖైదీ నంబర్ 842, డాక్టర్ వీరభూషణ్ పట్నాయక్‌గారు బయల్దేరారు.

జీప్ మేన్‌గేట్ కానించి రెడీగా ఉంచాడు డ్రైవర్. నక్సలైట్ తన అంగరక్షకులతో బాటు జీపులో కెక్కాడు. జీపు వేగంగా బయల్దేరి బంగళా మేన్‌గేట్ ముందాగింది. నక్సలైట్ నేలమీద కాలుమోపుతూ నైట్‌క్వీన్ సువాసనలతో గుబాళిస్తున్న చల్లనిగాలిని గట్టిగా గుండెల నిండా పీల్చుకున్నాడు. సీనియర్ జైలర్ ముందు నడవగా అంతా మెట్లెక్కారు.

వరండాలో గ్లాడ్‌సాబ్ వాళ్లకోసమే ఎదురు చూస్తున్నాడు. పల అతని గారాల కూతురు అవస్థపడుతూంది.

"హల్లో మిస్టర్ గ్లాడ్ హౌ ఆర్ యూ" నక్సలైట్ ఎప్పటి గే చిరునవ్వుతో అడిగాడు.

గ్లాడ్‌సాబ్ దీనంగా నక్సలైట్ కెదురొచ్చాడు. ఎవరిపై ం మొదట్నుంచీ కత్తిగట్టాడో, అతన్ని ఉరికంబమెక్కే ముందు ; కూతురికి ప్రాణభిక్ష పెట్టమని ఎలా అడగాలో సాబ్ కర్థం పడం లేదు. "అతడు తన కూతురు ప్రాణాలు తీయడు కదా!" న్న భయం కూడా అతన్నోపక్క పట్టి పీడిస్తోంది.

కాని జీన్ మూల్గులు వింటుంటే అతని గుండె చెర్లయిపోయింది. ఆట్టే ఆలోచించకుండా తన క్యాప్‌తీసి నక్సలైట్ కాళ్ల ందుంచాడు. నడుముకు చెక్కిన రివాల్వర్ తీసి నక్సలైట్ చేతి స్తూ అన్నాడు " యూ కెన్ షూట్ మి మై బాయ్ బట్ సేవ్ మై టర్ ఫర్ ద సేక్ ఆఫ్ గాడ్, సేవ్ మై డాటర్".

"మిస్టర్ గ్లాడ్ ప్రపంచంలో ఇంతవరకూ ఏ సర్జనూ కాళ్లకూ తులకూ బేడీలుండగా నైఫ్ పట్టుకోలేదు..." నిర్వికారంగా అన్న క్సలైట్ మాటల్తో స్పృహలోకొచ్చి సిగ్గుతో గొణిగాడు గ్లాడ్‌సాబ్. అయాం వెరీ సారీ మై బాయ్, వెరీ సారీ" వెంటనే రివాల్వర్‌లోని ండు గుళ్లతో నక్సలైట్‌ను బంధ విముక్తుణ్ని గావించాడు. కాళ్లూ తులూ ఏ మాత్రం గిరుకు పోకపోవడం చూచి నక్సలైట్ శ్చర్యంగా అన్నాడు "రివాల్వరంటే మీకాట వస్తువు మిస్టర్ గ్లాడ్".

నక్సలైట్ కాంప్లిమెంట్స్‌తో కొంచెం సంతృప్తి కలిగింది బ్‌కు.

సాబ్‌తో కలిసి నక్సలైట్ బెడ్‌రూం చేరుకున్నాడు. వేదనతో ల్లడిల్లే జీన్ నుదుటిమీద ప్రేమగా చేయుంచి ఆమె చెవిలో మెల్లిగా న్నాడు. "జీన్, గొడ్డువికాని నొప్పులకు దుఃఖించేపనిలేదు." అతని సిచూసి సంతృప్తిగా జీన్ దుఃఖాన్ని దిగమ్రింగుతూ తలాడించింది.

"అదీ...చాలా ధైర్యస్తురాలివికదూ జీన్ నువ్వు" ఆమె ంగ్గలు తడ్తూ ఆమెను బుజ్జగిస్తూనే నక్సలైట్ నర్స్‌కేదో సైగచేశాడు ది గమనించిన నర్స్ టేబుల్‌మీద ఇక్విప్‌మెంట్ అమర్చడంలో మగ్నురాలయింది. నక్సలైట్ ఫర్మాయించాడు. "మిస్టర్ గ్లాడ్, ోబడీ కెన్ స్టే హియర్."

"యా—"అంటూ గొణుగుతూ అందర్నీ తీసుకుని బయట ె ళ్తున్నాడు గ్లాడ్‌సాబ్. ఇంతలో సీనియర్ జైలర్ కొంచెం ముందు కొచ్చి అన్నాడు. మిస్టర్ పట్నాయక్, రూఫ్‌మీద; ప్రతికిటికీ క్రింద గార్డ్స్ ఉన్నారు. వాళ్లచేతుల్లో లోడెడ్ గన్స్ ఉన్నాయి..."

నక్సలైటోసారి నవ్వాడు. తలాడిస్తూ అన్నాడు "నాకు తెలుసు. వాళ్ళకు కేవలం మనిషినిచంపడం మాత్రమేవచ్చు కాపాడ్డం రాదు."

సీనియర్ నిరుత్తరుడయ్యాడు గ్లాడ్‌సాబ్ గర్జించాడు "యూ రాస్కెల్, అందర్నీ జైలుకు తిప్పి పంపించెయ్" అంటూ తన చేతిలోన్ని, సీనియర్ చేతిలోని రివాల్వర్‌లు నక్సలైట్‌ముందు పడేస్తూ అన్నాడు. "ఐ ట్రస్ట్ యూ మై బాయ్, యూ ఆర్ ఎ బార్న్ రెవెల్యూషనరీ అండ్ నాట్ ఎ ట్రేటర్." తలుపులు దగ్గరిగావేసి బయటి కెళ్ళాడు.

కాని మూసిన బెడ్‌రూం తలుపులు జీన్ కేకల్ని ఆపలేక పోయాయి. బెదిరిపోతూ గ్లాడ్‌సాబ్ గబగబా మెట్లుదిగి వార్డ్లోకొచ్చి నైట్‌క్వీన్‌ముందు కూలబడ్డాడు.

ముందు గదిలోని ఆడాళ్లు ఏవో గుసగుసలు పోతున్నారు. గ్లాడ్‌సాబ్ వాళ్ల మాటలు వినసాగాడు. ఉరిశిక్ష విధింపబడ్డ ఖైదీకే తికి కన్నకూతుర్నప్పగించిన గ్లాడ్‌సాబ్ అజ్ఞానాన్ని వాళ్లు నిందిస్తున్నారు. వాళ్ల మాటలు వినగానే జ్ఞానోదయం కలిగినట్టు గబుక్కున గ్లాడ్‌సాబ్ లేచాడు. చేతిలో కత్తులూ, కటార్లూ ఉన్న నక్సలైట్ తన కూతుర్ని తప్పకుండా చంపేస్తాడనుకున్నాడు. క్షణకాలం తన నిస్సహాయ స్థితిపై చిరాకెత్తి నుదురంతా కొట్టుకున్నాడు. గబగబా అడుగులేస్తూ మెట్లెక్కసాగాడు.

ఎక్కణ్ణించి చూసిందోకాని "చంప్" కుయ్యి కుయ్యి మంటూ కాళ్ల కడ్డంగా తిరుగుతూ సాబ్ మెట్లెక్కనియ్యకుండా చేసింది. దాంతో చిరాకెత్తిన సాబ్ కోపంతో చంప్‌ను బూటుకాళ్ళతో నాలుగు తన్ని కాలితోనే దూరంగా గిరాటేసి వరండాలో కొచ్చాడు.

ఇంతలో బెడ్‌రూం తలుపులు తెరుచుకున్నాయి. నర్స్ గబగబా బయటకొచ్చింది. సాబ్ చిన్న కుర్రాడిలా ఆమెకేసి పరుగెత్తాడు. కాని నర్స్ అతన్ని చేత్తో పక్కకునెడుతూ విసుగ్గా "ప్లీజ్, డోంట్ డిస్టర్బ్ అస్" అంటూ తనక్కావలసిందేదో తీసుకుని మళ్ళీ లోపలి కెళ్ళింది. బెడ్‌రూం తలుపులు మళ్ళీ మూసుకున్నాయి.

జీన్‌కు తోడు నర్సయితేనేంగాని ఎవరో ఒకరున్నారనుకోగానే కాస్త ధైర్యంకలిగింది గ్లాడ్‌సాబ్‌కు. ఇక దైవంమీద భారం వేసి ఓ స్టూల్ కిటికీ దగ్గరగా జరుపుకుని చేతులు మడిచి కిటికీలో పెట్టు కుని చేతులపైవంగి తన నైట్ క్వీన్‌కేసి చూస్తూ కూర్చున్నాడు.

ఇలాంటి రాత్రే... వర్షం... ఉరుములూ, మెరుపులూను. దడ దడమంటూ ఎవరో తలుపులు బాదారు. ప్రాణాలరచేతిలో బిగబట్టుకొని, నైట్ క్యాడెస్ బెల్ట్ బిగిస్తూ మెల్లిగా కిటికీ పరదా తొలగించి గ్లాడ్ బయటికి తొంగిచూశాడు. నలుగురు గెస్టాపోలు బయట నుంచున్నారు. వెంటనే లోపలికొచ్చి చిట్టి జీన్‌ని ఓ వెదురుబుట్టలో ఉంచి పాతమాసిన గుడ్డలన్నీ పైనుంచి కప్పేశాడు. ఓ బీరువాలో మారాను దాచేసి తలుపులు తెరిచాడు. తోడేళ్ళలాంటి నలుగురు గెస్టాపోలు లోపలదూరి "ఏరి నీ పెళ్ళాం పిల్లలు. అలాంటి నీచమైన, అస్వచ్ఛమైన యూదుల రక్తం మా జర్మన్ దేశానికొద్దు" అంటూనే మంచంమీద సామానులన్నీ చిందర వందర చేశారు. అందులో ఒకడు బాస్కెట్‌దగ్గరికెళ్ళి, ఒక్కొక్కటిగా గుడ్డలు బయటకు తీస్తుండటం బీరువా సందుల్లోంచి చూసిన మారా గబుక్కున బయటకొచ్చేసింది. ఎజి దొరికిందన్న సంతోషంతో నలుగురూ ఆమెమీద పడ్డారు. ఆమె నిష్ఠంవచ్చినట్లు తంతూ "నీ కూతురేదీ?" అంటూ అడగసాగారు. మారా "నా కూతురు చచ్చిపోయిం"దంటూ జవాబిచ్చింది.

"ఎప్పుడు?" వాళ్ళు గర్జించారు.

"పదిహేను రోజులైంది." గ్లాడ్ అనాలోచితంగా అనేశాడు. జర్మన్ రక్తాన్ని నిర్మలంగా ఉంచేందుకు వాళ్ళు మారాను జుట్టుపట్టి ఈడ్చుకెళ్ళసాగారు. గ్లాడ్‌సాబ్ వాళ్ళను ప్రార్థిస్తూ కాళ్ళావేళ్ళా పడుతూ చౌక్‌దాకా వెళ్ళాడు. గెస్టాపోలు మారాను వేన్‌లో కెక్కించగానే గ్లాడ్ వాళ్ళ కాళ్ళమీద ఏడుస్తూ పడ్డాడు. వెంటనే మారా "గ్లాడ్‌కు ఒక్క చెంపదెబ్బ పెట్టి "మగాడివైయుండి, నపుంసకుడిలా గూండాల కాళ్ళు పట్టుకుంటావా?" అంది.

...గ్లాడ్‌సాబ్ కలవరంగా తలెత్తాడు. బెడ్‌రూం ఇంకా మూల్గుతూనేవుంది. దీపాలు వెలుగుతూనే వున్నాయి. సీనియర్ జైలర్ కుర్చీలో అస్వస్థతగా కూర్చున్నాడు. గ్లాడ్‌సాబ్ మళ్ళీ చేతులుకట్టుకుని తలొంచుకుని తనలోకంలో కెళ్ళాడు...

...మారాను తీసుకుని గెస్టాపోలు వెళ్ళాక సర్వస్వం కోల్పోయిన గ్లాడ్ కాళ్ళీడ్చుకుంటూ ఇంటికొచ్చాడు. జీన్ "మమ్మా, మామ్మా" అంటూ ఏడుస్తూంది. జీన్‌ను చూడగానే గ్లాడ్ కనిపించింది తను సర్వస్వం కోల్పోలేదనీ, మారా ప్రతిరూపం తనదగ్గరుందనీను, వెంటనే తన మొరటు చేతుల్తో బిగ్గరగా ఏడ్చే జీన్ నోరు అదిమిపెట్టి, లైట్లార్పేసి బిడ్డను బ్లాంకెట్లో చుట్టుకుని పరుగెత్తసాగాడు. బెర్లిన్ నుంచి లండనెలాచేరుకున్నాడో అతనికే తెలీదు.

యుద్ధం అయిపోయింది. నాజీ నశించారు. పిచ్చివాడిలా గ్లాడ్ దగ్ధభూమి జర్మనీలో అడుగు పెట్టాడు, జర్మనీదేశం పునర్నిర్మాణ కార్యక్రమాలు జోరుగా సాగుతున్నాయి. మరుభూమిలో మల్లెల పూయించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. గ్లాడ్‌కు తన ఇల్లు ఆ బూడిద కుప్పల్లో ఎంత వెతికినా కనపడలేదు. చివరికి ప్రతి వీధి గాలిస్తుంటే మారా టీచర్‌గా పనిచేసిన స్కూల్ కనిపించింది. ఆ స్కూలుచుట్టూ తిరిగాడు. ఆ స్కూల్లోనూ, ముందు గేటులోను ఏమీ తేడా కనిపించలేదు. అది నాలుగేళ్ళ పూర్వంలాగే ఇప్పుడు ఉంది.

మారా చచ్చిపోయాక సరిగ్గా నాలుగేళ్ళ అనంతరం ఆ స్కూల్ గేటుకు తల బాదుకుని వెక్కివెక్కి ఏడ్చాడు గ్లాడ్. పిచ్చివాడిలా జీన్‌ని అదే స్కూల్లో చేర్పాడు. తన చేతకానితనంవల్ల కూతురికి తల్లి దూరమైనా, ఈ స్కూల్లో దానికి తల్లిప్రేమ లభిస్తుందని అతనిపిచ్చి ఊహ. జీన్‌ని స్కూల్లో చేర్పినేరుగా ఇండియాకొచ్చాడు. అప్పట్నించీ అతని దినచర్య మొదలైంది...

...రోజూ ఎవరిపీపుమీదన్నా రూళ్ళకర్ర విరగందే టిఫిన్ తినకపోవడం, చేతికందిన ఖైదీని క్రూరంగా శిక్షించి మానవజాతిపై అతనికిగల పగ తీర్చుకోవడం, ఇష్టంవచ్చినట్లు తాగేయడం, ఆ తరువాత తన చిన్నారి జీన్‌కి పెద్ద పెద్ద లెటర్లలో స్వర్గం, దేవతల కథలు, ఇండియాలోని పాములూ, సింహాలూ, పులుల కథలు వ్రాయడం ఇలా ఇలా...

అప్పుడు కూతురు చచ్చిందని అబద్ధమాడి ఆమె ప్రాణం కాపాడాడు. కాని ఇప్పుడామాట తలచుకుంటేనే ప్రాణం తల్లడిల్లుతూంది...

...కేర్ కేర్ మంటూ పసిగందు అరుపు గ్లాడ్‌సాబ్ చెవుల్లో ప్రతిధ్వనిస్తూంది. సాబ్ గబగబా లోనికెళ్ళిచూశాడు. ఎఱ్ఱని బ్లాంకెట్ కప్పుకుని నీరసంగా పడుకున్న మారా పక్కన ఎఱ్ఱని కసుగందు కాళ్ళూ చేతులాడిస్తూంది. జీన్‌నిచూసి గ్లాడ్‌సాబ్ ఆనందంతో మారానూ జీన్‌ని ముద్దుల్లో ముంచెత్తాడు. ఆ రాత్రి మిత్రులతో షాంపేన్ బాటిల్స్ ఖాళీ చేశాడు.

## 16

జీన్ జన్మోత్సవం జ్ఞాపకంతో కేర్ కేర్ మన్న ఏడుపు గ్లాడ్‌సాబ్ చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటే అతని గుండె బరువెక్కింది అతడు వెక్కుతూ వస్తున్న దుఃఖాన్ని ఆపుకునేందుకు విఫ

ప్రయత్నం చేస్తున్నారు. అతని చెవుల్లో కేర్ కేర్ మనే చిట్టి జీన్ ఏడుపే ప్రతిధ్వనిస్తూంది....

"సర్... సర్" సీనియర్ జైలర్ గ్లాడ్‌సాబ్‌ను కుదుపుతూ లేపుతున్నాడు. గ్లాడ్‌సాబ్ తలెత్తాడు. అతని కళ్లు నీళ్లతో నిండి ఉన్నాయి.

"హార్టీ కంగ్రాచ్యులేషన్స్ సర్, యూ ఆర్ ఎ గ్రాండ్ ఫాదర్ నౌ. మీకు మనవడు పుట్టాడు" అంటూ సీనియర్ చెబుతుంటే అయోమయంగా గ్లాడ్‌సాబ్ చుట్టూ చూశాడు.

బెడ్‌రూంలోంచి చంటిపాప ఏడుపు వినపస్తుంది. దీపం వెలుగుతూంది. ఆలసిపోయిన గ్లాడ్‌సాబ్ లేచి నుంచుంటూ అడిగాడు. "జీన్ ఎలావుంది? నా జీన్ ఎలా ఉంది?"

నర్స్ ముందుకొస్తూ చెప్పింది "షీ ఈస్ క్వైట్ ఓ. కే. సర్. చాలా డిఫికల్ట్ కేస్. కాని మంచి సర్జన్ దొరకబట్టి మీ అమ్మాయి మృత్యుముఖం నుంచి బయట పడింది."

గ్లాడ్‌సాబ్ ఒక్కొక్క అడుగేవేసుకుంటూ బెడ్‌రూం గుమ్మంలో కెళ్లాడు. అతన్ని చూస్తూనే వాడిపోయిన జీన్ ప్రసన్నంగా క్షీణ స్వరంతో "పప్పా, పప్పా" అంటూ పిలిచింది.

ఆవేశంగా ముందుకురికి గ్లాడ్‌సాబ్ జీన్ చేయి గట్టిగా పట్టుకుని మాట్లాడే ప్రయత్నం చేశాడు. కాని చాలా సేపటి వరకూ అతని కంఠం పెకలలేదు. చివరికి గద్గద స్వరంతో "చాలా కష్టం కలిగిందా?" అన్నాడు.

"లేదు పప్పా, గొడ్డువికాని నొప్పులకు దుఃఖించే పనిలేదు" అంది జీన్.

గ్లాడ్‌సాబ్ ఆమె చేతిని తన వెచ్చని నుదుటి కానించుకున్నాడు. అతని ముఖం మీద సంతృప్తి, మందహాసం వెల్లి విరిసాయి. ఇంతలో అతనికి నక్సలైట్ జ్ఞాపకం వచ్చాడు. అతనికేసి చూశాడు. కాని నక్సలైట్ తన పనిలో తానున్నాడు. ఏదో ఇంజెక్షన్ జీన్ కిస్తున్నాడు. అతన్నెలా పిల్లవాలో ఎలా తన కృతజ్ఞతలు తెలుపు కోవాలో గ్లాడ్‌సాబ్ కర్థంకాలేదు. లేచి అతని కెదురుగా నుంచుని అతని భుజాలు పట్టికుదుపుతూ "యూసీ, యూసీ" అన్నాడు.

నక్సలైట్ ఒక్కసారి అతనికేసి చూస్తూ అతని జేబులోంచి పెన్, డైరీ లాక్కొని దానిమీద ఏవేవో నాలుగైదు మందుల ప్రిస్క్రిప్షన్ వ్రాసి, అవి తెప్పించమని నర్స్‌కు చెప్పాడు. తరువాత ఓ సారి కళ్ళుమూసుకుని ఇంతవరకూ చేసిన పని అంతా గుర్తుచేసుకుని, ఇక చేసేదేమీలేదని కన్‌ఫర్మ్ చేసుకున్నాక గట్టిగా ఆవులిస్తూ ఒళ్లు విరుచుకుని గ్లాడ్‌సాబ్‌తో అన్నాడు.

"ఇట్ ఈస్ ఆల్ రైట్ మిస్టర్ గ్లాడ్, నౌ కెన్ యూ అరేంజి ఎ కప్ ఆఫ్ టీ ఫర్ మీ?"

"వైనాట్, వైనాట్?" అంటూ గ్లాడ్‌సాబ్ వంటవాడికి టీ చేయమని ఆర్డరిచ్చి, నక్సలైట్ నడిగాడు. "వాస్ ఇట్ ఎ వెరీ డిఫికల్ట్ కేస్?"

"ఓహ్..... నో... " కొంచెం నిర్లక్ష్యంగా అన్నాడు నక్సలైట్ "అలా చూస్తే కేస్ మైనరే ననుకోండి. కాని కొంచెం సేపు నాకే ఆత్మవిశ్వాసం కలుగలేదు. ఇన్నాళ్ల తరువాత కేస్ చేతి లోకి తీసుకుంటున్నానా సరిగా అవుతుందా లేదాని. లేకపోతే పేషెంట్ తన చావు తను చచ్చినా, డాక్టర్ మాత్రం బ్లేమ్ అవుతాడు. ఏమంటారు?"

"రియల్లీ యూ ఆర్ ఎ గ్రేట్ డాక్టర్." నక్సలైట్ భుజం తడుతూ గ్లాడ్‌సాబ్ అన్నాడు. "ఉరిత్రాడు కళ్లముందు కదలాడు తున్నా శాంతంగా ఆపరేషన్ చేయగలిగావు."

"ఉరి?" నక్సలైట్ ఓ సారి గొణిగాడు. ఇంతలో అతనికి పరిస్థితులూ, పరిసరాలూ గుర్తుకు రావడంతో గొల్లున నవ్వాడు. గ్లాడ్‌సాబ్‌తో అన్నాడు." చూశారా మిస్టర్ గ్లాడ్, ఏ మత్తుమందుల కన్నా మనిషి ప్రాణాలు కాపాడడమన్న మత్తు చాలా చెడ్డదీ సుమండీ, కేవలం ఇల్లూ, ఒళ్లేకాక తన మృత్యువును కూడా మరిపింప జేసేది ఇంతకన్నా ఏముంటుందంటారు? ఆఁ టైమెంతయింది? ఆరింటికి మీరు నన్నురి తీయాలి కదూ! అన్నాడు.

అందుకే ఎదురు చూస్తున్నట్టున్న సీనియర్ జైలర్ వెంటనే ముందుకొచ్చి గడియారం చూపిస్తూ గ్లాడ్‌సాబ్‌తో అన్నాడు. "సర్ వుయ్ కాంట్ వేస్ట్ ఎ సింగిల్ మినిట్. కేవలం పది నిమిషాలే టైం ఉంది."

అతనిలా అంటూండగానే జీపు వేగంగావచ్చి గేట్‌ముందాగింది. నలుగురు ఆర్మ్డ్ సిపాయిలను తీసుకుని ఫాసీగేట్ జైలర్ గబగబావచ్చి సాబ్ నొక్కమాటైనా అడక్కుండా నక్సలైట్ చేతులకు బేడీలు తగిలించాడు. సీనియర్ నక్సలైట్‌ను నడవమన్నట్టు సైగచేశాడు. నక్సలైట్ వెనుదిరిగి నడవసాగాడు. ఇంతలో గ్లాడ్‌సాబ్ గబుక్కున ముందుకురికి నక్సలైట్ బేడీల చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని, ముద్దెట్టుకుంటూ అడిగాడు. "బాబూ నీవు నా

కూతుర్ని కాపాడావు. నీకేంకావాలోచెప్పు. నువ్వేదడిగితే అదిస్తాను" ఉపకారం భారం క్రింద అణిగిపోయిన గ్లాడ్‌సాబ్ కేసి ఓ సారితువ్చంగా అన్నాడు నక్సలైట్.

"యూ లిటిల్ పూర్ బెగ్గర్. నువ్వు నాకేం ఇవ్వగలవు? నువ్వు నన్ను కేవలం ఉరితీయగలవంతే."

అతని నోటిని తనచేత్తో మూస్తూ, కాదన్నట్టు తలాడిస్తూ "అలా మాట్లాడకు బాబూ, నేనేం అంత గతిమాలిన బిచ్చగాణ్ణికాదు, నేనివ్వగలను...ఏదడిగినా ఇస్తాను" అన్నాడు గ్లాడ్‌సాబ్.

"ఏం ఇవ్వగలరు మీరు నాకు? ఏదన్నా ఇచ్చినా నాకు దాని ఉపయోగమేమిటి? దాని విలువేమిటి?" నక్సలైట్ అడిగాడు.

క్షణంసేపు గ్లాడ్‌సాబ్ దిఙ్మూఢుడయ్యాడు. తరువాత ఏదో నిర్ణయానికొచ్చినట్టు దృఢంగా పలికాడు.

"యూ బ్రేవ్ యంగ్ చాప్. స్టిల్ యూ డోంట్ నో మీ. నీకు చాలా ఇవ్వగలన్నేను. ఎంత ఇవ్వగలనంటే ఏడు జన్మలవరకూ నా ఉపకారాన్ని నువ్వు మరువలేవు."

గ్లాడ్‌సాబ్ మాటలకు నక్సలైటు నవ్వాడు. "సరే. మీరేం ఇవ్వదలచుకున్నారో అది ఉరికంబంమీద ఇవ్వండి" అంటూ, సీనియర్ సైగచేస్తుంటే నడిచాడు.

సీనియర్ జైలర్ గ్లాడ్‌సాబ్ కోసం కొంచెం తచ్చాడాడు. కాని గ్లాడ్‌సాబ్ అర్డరిచ్చాడు. "యూ గో అహేడ్, ఈలోగా నేనొస్తా" నంటూ.

సీనియర్ నక్సలైట్‌తోబాటు మెట్లు దిగాడు వరండా మెట్ల కానుకుని వాకిట్లోవున్న, వాడిపోబోతున్న, నైట్‌క్వీన్ దగ్గరకిరాగానే నక్సలైట్ ఒక్క క్షణం ఆగి ఓసారి గట్టిగా గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు. తరువాత నలుగురు సిపాయిలు అతని వెనకా, ముందూ నడుస్తూంటే ముక్కుసూటిగాచూస్తూ తిన్నగా నడవసాగాడు గేటుదగ్గరి జీపులోకి ఒకరిద్దరు సిపాయిలు ఎక్కారు. నక్సలైట్ కూడా ఎక్కేందుకు కాలులేపాడు. ఇంతలో బిగ్గరగా పిలుపు వినిపించింది. "కామ్రేడ్, కామ్రేడ్."

చాలా రోజులకు వింటున్న ఆ ఆదరణీయమైన పిలుపుతో నక్సలైట్ గుండె ఉప్పొంగింది. అతడు వెనుదిరిగి శబ్దంవచ్చిన దెసగా చూశాడు. పైన వరండాలో నుంచుని గ్లాడ్‌సాబ్ చేయూపుతూ పిలుస్తున్నాడు "కామ్రేడ్, కామ్రేడం"టూ.

సర్వకాల సర్వావస్థల్లోనూ ఖైదీ నంబర్‌తో పిలుస్తూ వెక్కిరించే గ్లాడ్‌సాబ్ నోట ఈ పిలుపువిని తృప్తిగా నవ్వాడు నక్సలైట్. చేయూపుతూ సాబ్‌కు వీడ్కోలు చెప్పసాగాడు. హఠాత్తుగా గ్లాడ్‌సాబ్ రివాల్వర్‌తీసి ఏం జరుగుతుందో ఎవరికీ అర్థంకాకముందే ఫైర్‌చేశాడు.

"ఢడాఢ్, ఢాప్, ఢాఢ్, ఢాప్"

అనుకోకుండా అయిన దిక్కులు పిక్కటిల్లే ఆ శబ్దంతో జీన్ భయంగా మంచంమీద లేచి కూర్చుంది. తన డాడీ వరండాలో నుంచున్నాడు. అతని చేతిలో రివాల్వర్. అపరాధిలా తల వంచుకుని జీన్ నడుగుతున్నాడు. "ఆమ్ ఐ రాంగ్ జీన్? ఆమ్ ఐ రాంగ్?"

"నో పప్పా" వెక్కి వెక్కి ఏడుస్తూ అంది జీన్. "నో పప్పా. హి వాస్ రియల్లీ ఎ బ్రేవ్ సోల్జర్." దిండులో ముఖం దాచుకుని వెక్కసాగింది.

గ్లాడ్‌సాబ్ ఆమె మాటలకు తృప్తిగా తలూపి క్రిందకు చూశాడు. బేడీ ఉన్న చేత్తో గుండెను గట్టిగా అదిమి పట్టి, ఇంకో చేతి పిడికిలి బిగించి పైకెత్తాడు నక్సలైట్. గ్లాడ్‌సాబ్ చేసిన ఈ విశ్వాసఘాతుక కృత్యం వల్ల అతడు కోపంతో ఊగిపోయాడు. కోపాగ్ని పేరుకున్నట్టున్న ఎఱ్ఱని కళ్లతో గ్లాడ్‌సాబ్‌కేసి చూశాడు...

...కాని గ్లాడ్‌సాబ్ కళ్లల్లో కరుణ ఉంది, యాచన ఉంది. అతడు పైనుంచి అరుస్తున్నాడు "కామ్రేడ్, నేను నీ గుండెపై గుండు వేశాను. వీపుమీద కాదు. గుండెపై గురి చేశాను..."

సాబ్ ఇచ్చిన సంజాయిషీతో నక్సలైట్ కళ్లు శాంతించాయి. ఓసారి తృప్తిగా నవ్వి బిగించిన పిడికిలిని సళ్లిస్తూ సాబ్‌తో "బై బై" అన్నాడు. తర్వాత శక్తినంతటినీ కూడగట్టుకుని గట్టిగా "థాంక్యూ, థాంక్యూ మిస్టర్ గ్లాడ్."

రక్తపు మడుగులో ఖైదీ నంబర్ 842 నిరభూషణ్ పట్నాయక్ వీరమరణం పొందాడు. నిష్ప్రాణమైన అతని దేహం క్రింద పడింది.

జైలు గోడగడియారం ఆరుగంటలు కొట్టింది. "సబ్ ఠీక్ హై, సబ్ ఠీక్ హై" అంటూ యార్డుల్లో హవల్దారులు అరుస్తున్నారు.

గ్లాడ్‌సాబ్ మోకాళ్లపై తలొంచుకుని కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

తెల్లగా తెల్లారింది. ఆకాశం నిర్వికారంగా, నిస్తేజంగా ఉంది. సూర్య కిరణాలు సిగ్గుతో కనిపించడంలేదు. రాజమండ్రి సెంట్రల్ జైల్

సూపరింటెండెంట్ బంగళా పోలీసుల్తో నిండిపోయింది. పోస్టుమార్టం అయింది. డి. ఎస్. పి.; గ్లాడ్‌సాబ్ బెల్టూ, టోపీ తీసేశాడు. వీర భూషణ్ పట్నాయక్ హత్యానేరంమీద గ్లాడ్‌సాబ్ చేతికి సంకెళ్లు తగిలించాడు. కాని సాబ్ ముఖం నిర్వికారంగావుంది. అతని ముఖం మీద విరాగుల్లోవుండే శాంతం నక్సలైట్ ముఖంమీదవుండే శాంతం ఉంది.

డి. ఎస్. పి. సైగతో గ్లాడ్‌సాబ్ నడవసాగాడు.

నల్లని తార్రోడ్డుమీద అడుగులు పడుతున్నాయి. రోడ్డు నిర్మానుష్యమైంది. కాని చుట్టుపక్కల చెట్లమీది పక్షుల కలకలారావం మాత్రం ఆగిపోలేదు. అవి కలవరంచేస్తూ "థాంక్యూ మిస్టర్ గ్లాడ్... థాంక్యూ" అంటున్నాయి.

సాబ్ మేన్‌గేట్ దగ్గరికొచ్చి అలవాటుగా చూశాడు. కానీ గార్డ్ డ్యూటీ సిపాయీలు అతనికి సలాం కొట్టలేదు. మేన్‌గేట్ తెరువ లేదు. సాబ్ అదిరిపడ్డాడు, క్షణంసేపు అవమానంగా ఫీలయ్యాడు.

ఇంతలో రాజమండ్రి సెంట్రల్‌జైలు గోడలు కొద్దిగా వంగి అన్నాయి. "థాంక్యూ...థాంక్యూ మిస్టర్ గ్లాడ్."

ఆ రాతి గోడల మానవందనం కొంచెం తలొంచి స్వీకరిం చాడు గ్లాడ్‌సాబ్. తర్వాత ముక్కుసూటిగా తిన్నగా లయబద్ధంగా అడుగులువేస్తూ తన బొంగురు గొంతుతో పాటందుకున్నాడు' "ప్రియతమా...నీకోసం."

[సమాప్తం]



# రాలిపోయిన పువ్వా!

శ్రీ ఆర్వీయస్. సుందరం

నా ఎదలో పరిమళాన్ని మాత్రం వదిలి
పద్దెనిమిదేళ్ళకే రాలిపోయిన ఓ పువ్వా!
జీవితంలో మధురిమలేవీ చవిచూడక ముందే
నిన్ను కాటేసిన కాలసర్పం
చావంటే నాలో భయం లేకుండా చేసింది
పుట్టటం బతకటం కన్నా చావే సత్యమని
ఋజువు చేసింది
మట్టిని వాటేసుకుని నువ్వు నిద్దరోతుంటే
మెత్తటి పరుపులు గుచ్చుకుంటున్నాయ్
జ్ఞాపకాల నదుల్లో నేను ఈదులాడుతుంటే
అలనాటి ముచ్చట్లు సుళ్ళు లాగేసుకుంటున్నాయ్
నీవెక్కిన బస్సు నేనందుకోలేక పోయా
నేనెక్కాల్సిన బస్సు రిపేర్లో వుంది
అందుకే ఈ అలస్యం అని
నీ కెలాగా చెప్పటం- ఓ పువ్వా, నా పువ్వా!



డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# నన్నయ్యగారి మాండలికం

ప్రథమాంధ్ర కవిత్రయంలో మొదటివాడు నన్నయభట్టు. ఆయన రాజమహేంద్రవరంలో (ఆనాటి వేంగి-నాడు) వుండి మహాభారతాన్ని అనువదించాడు. ఆయన చేసిన 'వాగను శాసనం' అటు తెలుగులో 'పద్యవిద్య'ను, ఇటు 'కావ్య భాష'ను ఒకేసారి ఆవిష్కరించింది.[1] ఈ వ్యాసంలో నన్నయగారు నిజజీవితంలో మాట్లాడుతూ వుండిన మాండలికం (డయలెక్ట్) ఎలాంటిదో కనుక్కోవడానికి ప్రయత్నం జరుగుతుంది.

ఒక సమాజంలోవున్న వ్యక్తుల వ్యవహారాలన్నిటికీ అంతర్గతంగావున్న నిర్మాణ వ్యవస్థను 'భాష' అంటాము. నిజవ్యవహారాన్ని 'మాండలికం' అంటాం. మనకు తెలిసిన ఆయన సామాజికమైన వివరాలు ఇవి : ఆయన బ్రాహ్మణుడు (వైదికి)-నిరంతర సంహితాభ్యాసుడు. సత్ప్రతిభాభియోగ్యురు - ఇది ఆయన వైయక్తికమైన విద్యాసంపద. ఒక వ్యక్తి మాండలికాన్ని ఈ మూడు అంశాల్ని అధారంగా నిర్ధరించవచ్చు. కులం-చదువు - ప్రతిభ - ఈ మూడూ వ్యక్తి భాషావ్యవహారాన్ని నిర్ధరించే ప్రమాణాలు. ఇక నన్నయగారి మాండలికాన్ని గురించి.

## కావ్య భాష :

భారతంలో వాడుకోబడ్డది కావ్యభాష. అంటే అది ఒక భాషాశైలి (స్టయిలయిస్డ్‌ఫారమ్) - తప్ప వ్యవహార భాష కాదు. నన్నయ్యగారి కాలానికి (11వ శతాబ్ది క్రీ. శ.) 5, 6 శతాబ్దుల ముందే కావ్యశైలిగా స్థిరపడిపోయిన ఒకానొక శిష్టవర్గ మాండలికం-అయివుండాలి నన్నయగారు భారతంలో వాడిన తెలుగు.[2] అంటే నన్నయగారు వాడింది తన కాలంలోని భాషను కాదన్నమాట. కాని భారతంలోని భాష నన్నయ సృజించింది-కల్పించికాదు. సమకాలీన శాసనాలు చూసినా గద్య పద్యాత్మకాలైన కావ్యశైలిలోని శాసనాలూ, వ్యావహారికంలోని శాసనాలూ రెండూ ఉన్నాయి. అంచేత పండితులు కొంతమంది భావించినట్టు (ఇప్పటికీ కొందరు అలా భావిస్తారు) నన్నయ సమకాలీన భాషను సంస్కరించి కావ్యశైలికి అనుగుణంగా 'మార్చి' రాశాడనుకోవడం (ప్రమాణీకరించడం అంటే ఇదే) తప్పు. (చూ. భద్రిరాజు కృష్ణమూర్తి. 1979)[3]

నన్నయ భారతంలో కనిపించే భాష - అప్పటికి పాతబడిపోయిన మాండలికం అనటానికి కృష్ణమూర్తిగారు (పై వ్యాసం) చూపిన నిరూపణలు ఇవి :

1. సమకాలీన శాసన భాషతో పోల్చిచూస్తేకూడా ఈ అంశం తెలుస్తుంది. భారత భాషలో ఱ / ర భేదం పాటించబడింది. కాని శాసనాల్లో శకటరేఫ సాధురేఫతో కలిసిపోయింది; హల్పూర్వకమైన అనునాసికం భారతభాషలో పరిరక్షింపబడింది. పదాదిలో రేఫతో కూడిన సంయుక్త హల్లుల వాడుక భారతంలో కనిపిస్తుంది. కాని శాసనాల్లో వ్రాఁడు, ప్రోగు మొదలైన రూపాలు వాడు, మోగుగా కనిపిస్తాయి.

2. ప్రాచీన కావ్యాల్లోని రూపాలనుంచీ ఏర్పడ్డాయని చెప్పటానికి వీల్లేని తెచ్చుతారు (అధు, తెస్తారు), కొంటూ, పోయితే వంటి రూపాలున్నాయి. కేతన ఆంధ్రభాషాభూషణంలో (12వ శ. శ.) వీటిని గ్రామ్య రూపాలని నిరసించాడుకూడా, తెత్తురు, కొనుచువంటి కావ్య రూపాలనుంచీ వీటిని నిష్పన్నం చెయ్యడం కుదరదు. అంచేత తెత్తురు, కొనుచు వంటి 'కావ్యరూపాలు' స్వతంత్రంగా అప్పటికే స్థిరపడిపోయిన ఒకప్పటి (ప్రాచీన) శిష్టవర్గ మాండలికం అయి వుండాలి. ఆ మాండలికయే నన్నయనాటికి రచనకు యోగ్యమైన శైలిగా స్థిరపడి వుండాలి.

3. నన్నయ వాడిన భాషలోనే వైవిధ్యంవుంది. ఆ భాష అంతకు ముందో ఎన్నో శతాబ్దుల కిందే స్థిరపడి వుండకపోతే - ఆ కాలానుక్రమ వైవిధ్యంరాదు. ఉదాహరణకు అమహద్వాచకప్రత్యయాలు మూడున్నాయి : ంబు→మ్ము→ము. వీటిలో ఒకదానినుంచి ఏర్పడ్డ రూపం మరొకటి. నన్నయ మూటినీ వాడుతాడు. (ఇలాగే తద్ధర్మ ప్రత్యయ రూపాలు ఎడు ~ ఎడి ~ ఎద ~ దు; అగు ~ అవు - సంఖ్యాసూచిక ప్రత్యయం;)

4. శాసనభాష నాధారంగా ఈనాటి మన వ్యావహారికభాషకు 'గొలుసుకట్టు సంబంధా'న్ని చారిత్రకంగా నిరూపించుకుంటూ రావచ్చుకాని; సాహిత్యభాషనుంచీ కాదు.

కాబట్టి నన్నయ్య వాడింది సమకాలీన భాషను కాదు. భారతంలో ఆయన వాడిన భాషా : సమకాలీన శాసన భాషా ఒకటి కావు అప్పటికే కావ్య-వ్యావహారిక భాషలు వేరుపడి పోయాయి (చూ. పై వ్యాసం పు. 3)

## కావ్యవాక్కు - భాషా వ్యవహారం :

అసలు ఏ యుగంలోనూ వ్యవహారభాష, కావ్యవాక్కు ఒకటిగావుండవు. కావ్య'వాక్కు' సమకాలీన వ్యవహారంకన్నా ఎప్పుడూ విస్తృతపరిధిని కల్గివుంటుంది. కావ్యభాష-వ్యవహారంలోంచి పుడుతుందన్నంతవరకు నిజమేకాని వ్యావహారిక భాషాపరిణామాన్ని ఎప్పుడూ కావ్యవాక్కు నాధారంగా ఊహించడానికి సాధ్యం కాదు. నన్నయగారి భారతభాష విషయమూ అంతే. ఆయన మాట్లాడు తుండిన 'మాండలికం' (సమకాలీన భాషావ్యవహారం) ఒకటివుంది. అది అనాటి శాసనాల్లోనూ సమగ్రంగా ప్రతిఫలించక పోవచ్చు. కారణం అదిగూడా 'లిఖిత'భాష కావడంవల్ల అసలు ఆనాటి శాసనాల్లో కొన్ని పద్య శాసనాలు, వాటి మధ్యన వచనంచూస్తే, భారత భాషకు చాలా సన్నిహితంగా కనిపిస్తాయి.[4] సరిగా ఈకారణంవల్లనే కీ. శే. గిడుగు రామమూర్తిపంతులుగారు ఆనాటి శాసన - భారత భాషల మధ్యనవున్న సామీప్యంకూడా తరువాతి కాలాల్లోని సాహిత్య భాషకీ, వ్యావహారికభాషకీ నడుమలేదని అభిప్రాయ పడ్డారుకూడా.[5] కీ. శే. నాగభూషణరావు (1964)గారు కూడా తమ భారత భాషా విశ్లేషణలోకూడా ఇలాంటి అభిప్రాయమే చెబుతూ, అయినా శాసనాల్లోని కొన్ని వ్యావహారిక లక్షణాలు భారత భాషలో కనిపించడం లేదన్నారు.[6] వెరసి నన్నయ భారతంలో వాడిన భాషమీద 3 రకాల అభిప్రాయాలు కనిపిస్తున్నాయి.

1. నందంపూడి శాసనభాష - భారతభాష సమీపంగా వున్నాయి. (గిడుగు)
2. శాసనాల్లోని కొన్ని వ్యావహారికాంశాలు భారత భాషలో లేవు. (నాగభూషణరావు)
3. భారతంలోని భాష ఆనాటి 'వ్యవహారభాష' కాదు, అది అప్పటికే స్థిరపడిపోయిన ఒకానొక రచనా శైలి. (కృష్ణమూర్తి)

పై మూడు అభిప్రాయాలూ మూడు రకాల దృష్టులనుంచీ భారత భాషను పరిశీలిస్తున్నాయి. గిడుగువారుగమనించింది లిఖితశైలులను మాత్రమే. నాగభూషణరావుగారు శాసనాల్లో భారతంలోలేని కొన్ని వ్యవహారికాంశాలున్నాయని; భారతభాష 'వ్యాకరణా'లకు లొంగి వుందన్న దృష్టితో అంటున్నారు. కృష్ణమూర్తిగారు భారత భాషలో వాడబడ్డది ఒక కావ్య 'శైలీరూప' మంటున్నారు. ఈ మూటిలో మూడవదే శాస్త్రీయంగా సమంజసంగావుంది. ఈవ్యాసంలో ఈ మూడో అంశంమీదే చర్చించటం జరుగుతుంది.

కావ్యంలో - ఏనాడైనా భాష ఉండదు. వాక్కు ఉంటుంది. ఈ విషయకంగా బ్రహ్మానంద రాసిన 'వాక్కు - భాష' (1984) 'అలంకారికుల వాక్ తత్త్వదర్శనం' (1981); 'భాషావ్యవహార వివేచన' (1982) 'కార్‌చెవ్‌స్కీ సంకేతదృష్టి' (1983); 'భాషా విజ్ఞానం కావ్యశాస్త్రం' (1984) వ్యాసాల్ని చూడవచ్చు.[7] వాక్కు - అంటే రచయిత (వ్యవహర్తకూడా కావచ్చు) అభిప్రాయాన్ని వ్యక్తీకరించే సాధనాల్లో అత్యుత్తమమైన మార్గమని అర్థం. దాన్నే ఉక్తి (ఎక్స్‌ప్రెస్) అంటాం. రచనలోని 'ఉక్తి', రచనకున్న రూప (ఫారమ్) వస్తు (కంటెంట్) సమన్వయ రూపంగా వుంటుంది. ఆ రెంటిచేతా 'ఉక్తి' స్వభావ స్వరూపాలు నిర్ధరించబడుతాయని అర్థం. కాబట్టి దాదాపు 50 సంవత్సరాలుగా భయపడుతున్న 'కావ్యభాషా విశ్లేషణ'ను మనం ఒకసారి పునరాలోచించుకోవాల్సి వస్తోంది.[8] కావ్యాలలో కనిపించే 'శైలీరూపాలు' మూడు రకాలుగా సిద్ధిస్తాయి.

1. చారిత్రకంగా ముందున్న కావ్యాలలోని రూపాలను నిరంతర మననంవల్ల అలాగే వాడుకోవటంవల్ల.
2. కొత్త భావాన్ని సృజించటానికి అప్పటికే భాషలోవున్న పద జాలాన్ని కొత్త అర్థ పరిధుల్లో వాడటంవల్ల.
3. ప్రామాణికమైన మరో భాషా సాహిత్యంలోని రూపాలకు, భావాలకు అనుగుణంగా నూత్న రూపాలను ఎరువు తెచ్చుకోపటంవల్ల సృష్టించటంవ్ల.

ఈ మూడు పద్ధతుల్లోనే ఈ నాటికీ రచయిత తన రచనలో ఒక అసహజ, కృత్రిమ, ఆలంకారిక, రస - భాషను 'సృష్టించ' గలుగుతున్నాడు. ఆఅర్థంలోనే రచయితను 'మేకర్ ఆఫ్ లాంగ్వేజస్' అని అంటాం. అదీ నన్నయ్యగారిని 'వాగను శాసనుడు' అనటానికి కారణం. అంతేతప్ప 'వ్యవహారం'లో లేని కొత్తభాష నొకదాన్ని సృష్టించాడన్న అర్థంలోనూకాదు. ఆ 'సృష్టి'ని ఏమార్పూ లేకుండా ఇతర రచయితలందరూ 'గుడ్డిగా' అనుకరిస్తారన్న అర్థంలోనూకాదు.

## నన్నయ్యగారి 'భారత' భాష :

నన్నయ్యగారు భారతంలో వాడిన 'భాష'లో పైన చెప్పిన మూడు కారణాలవల్లా సంస్కృతభారతంలోని వస్తువు, రూపం—

ఈ రెంటినీ తెలుగులోకి తీసుకురావడానికి యోగ్యమైన 'కావ్యశైలీ రూపం' సిద్ధించింది.

## నన్నయ వాడిన పూర్వ 'కావ్య' రూపాలు :

నన్నయగారికి ముందే కావ్యాలు పుట్టాయి. వేములవాడ భీమకవి, పావులూరి మల్లన, అధర్వణుడు, బేతనభట్టు - నారాయణభట్టు- అప్పటికే కవులుగా పేర్కొంబడ్డారు.[9] వారి రచనలు మనకిదొరకడం లేదు. కాని శాసనాలలోనే కనిపించే 'పద్యశైలి' నాధారంగా సుదీర్ఘ సంస్కృత సమాసఘటన, కర్మణివాక్యం, యత్తదర్థక ప్రయోగం: క్రియాజన్య విశేషణంతో కూడిన సమస్త రూపాన్ని (చేసినవాడు) ఆఖ్యాతంగా వాడటం; ఇలాంటివన్నీ ముందున్న పద్ధతులే. నన్నయ్య కూడా వాడుకున్నాడు. వాక్కు-వాకు; జగము; గరుడఁడు: కుంతీ మహాదేవులు; ఉల్లి; గుఱిచి మొదలైన రూపాలూ నన్నయ్య కల్పించినవికావు. 'ట' కారతోడి రూపాలు డ > ద లుగా మారటం: సంయుక్త హల్లులోని రేఫ - పదాదిలో పోవటం - నన్నయగారి కాలానికి ముందే జరిగిపోయిన పరిణామమే. శకట సాధు రేఫల సాంకర్య విషయమూ అంతే. ఈ పరిణామాలు భాషా వ్యవహర్తగా నన్నయకి తెలియనివికావు. కాని కావ్య ప్రయోగాన్ని నిర్ధరించే ఆయన ప్రమాణాలు మూడున్నాయి.[10]

1. అక్షర రమ్యత.
2. ప్రసన్న కథా కలితార్థ యుక్తి.
3. సూక్తి నిధిత్వం.

ఈ మూటిచేతా నియమితకు భాషను - వాక్కుగా రచయిత పరివర్తనం చేయిస్తాడు. ఈ 'పరివర్తన'లో వ్యాకరణ సూత్రాలకు రూపం లొంగుతోందా లేదా అన్న విషయం కవి ఎప్పుడూ ఆలోచించడు. నన్నయగారూ ఆలోచించ లేదు. అందువల్లే నన్నయగారి ప్రయోగాల్ని - వ్యాకరణ నియమాల్ని భారతంలోని 'శైలీరూపాల్ని' ఆధారంగా గుర్తించాలి తప్ప - కడకి 'శబ్ద చింతామణి' కూడా ఈ విషయంలో ప్రమాణం కాదు. ఈ విషయాన్ని అప్పకవి చక్కగా గుర్తించాడు కూడా.[11]

అక్షర రమ్యత రూపాన్ని నియమించిన సందర్భం ఒకటి చూద్దాం.

అబిఘోటుడు కుఱుచ చేతులు
నొటువ శరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడ౦
గొఱ గాకుండియు మన్మధు
నొఱపులఁబడియెడు నితండు యువతీ ప్రియుడై
(3-2-135)

బాహుకుడుగా మారిన నలుని 'వికార' స్వరూపాన్ని కంపిత స్వభావమున్న శకటరేఫ ద్వారా సూచించకపోతే మరో మార్గం లేదు. అంచేత రేఫ శకటరేఫల మధ్యన 'సాంకర్యం' ఈ పద్యంలో ప్రసక్తం కాదు.[12]

అర్థయుక్తి నియమించిన భాషా రూపం :

విగతజీవుఁడై పడియున్న వేదమూర్తి
యతని చేత సంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
సభిహితంబగు మంత్రంబు నట్లపోలె (1-8-127)

వెలిఁగె అనవచ్చు. అది నన్నయగారికి తెలుసు. కాని సంజీవితుడై అన్న రూపంలోని బిందువుచేత వెలుంగు లోని బిందువు ఆకర్షితమై ప్రవరిస్తోంది. ఇదీ ఆ మంత్ర ప్రభావానికి సంబంధించిన **'effect'** ని శ్రోతకు అందించడంలో - ఇదే అర్థయుక్తి - స్పర్థ - వల్ల కలిగే రూప పరివర్తనం.

సూక్తి నిధిత్వం నియమించిన భాషా రూపం :

'ఘోరః కాలో భవిష్యతి'

అన్నమూలాన్ని 'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్' (1-5-150) అనినన్నయ పరివర్తనం చేశాడు. 'భవిష్యతి' - అగును. (భవిష్యదర్థంలోనూ; తద్ధర్మంలోనూ తెలుగులోకి తీసుకు రావచ్చు-) సూక్తిగా మార్చేటప్పటికి భూధాతులోపం; 'వచ్చుకాలము' అన్న సమస్తరూపం- ఏర్పడ్డాయి.

ఇలా 'కావ్యభాష'ను నియమించే సూత్రాలు వ్యాకరణ నియమాలుకావు. రచయిత భావన - అవగాహన. ఒక రూపాన్ని గురించి రచయితకు ఒక నిర్దిష్టమైన అవగాహన వుంటుంది. 'భావనాపిలయం' వుంటుంది. సరిగ్గా ఇక్కడే రచయిత తన మాండలికాన్ని కొత్త అర్థాలతో వాడటానికి అవకాశం వుంటుంది. ఇది అర్థ పరిణామం కాదు. అర - ఆధానం.

## 2. పాతపదాలు-కొత్త అర్థ కల్పనలు

కాఁపులు = నివసించువారు
ఇందుల కాఁపుల నందఱ గ్రమింగుచు నున్నన్ (1-6-264)

గాడ్పు = వాయువు (దేవత)
గాడ్పు చలింపగ నోడున్ (1-4-38)

దొర = రాజకుమారుడు
దొరయగుదేని నీ కెదిరి దోర్బల శక్తి నితండు సూపెడిన్ (1-6-45)

మూఁగు = ఒక్కుమ్మడిగా చేరు
స్వయంవరంబునకు మూఁగిన రాజలోకం బెల్ల (1-4-198)

వెలిగించు = వ్యాప్తముచేయు
దిక్కులఁ దన యాజ్ఞ వెలిగించుచు (1-1-7)

వేడు = ఆలోచించు
ఇంద్రాగ్నులు వాని మహాగుణంబు లెరుంగ వేఁడి (3-3-227)

ఏర్పడు = స్థిరపడు
పార్థివత్వ మేర్పడియెఁ బృథాగ్రపుత్రునకు (2-2-96)

ఓడక = భయపడక
శకటంబుపై నుండి యోడక కుడుచుచున్న భీమున్ (1-6-295)

ఒప్పుగొను = స్వీకరించు
అనఘమూర్తి నొప్పుగొనుము వీని నుర్వీశ (1-4-169)

కాన్పు = దృష్టి
జూదమాడగఁగాన్ప నాకు ధరణీశ్వర యజ్ఞము (2-2-138)

పై రూపాలలో ధాత్వర్థంలో రూపాన్ని ప్రయోగించటం కనిపిస్తుంది. ఆధాత్వర్థం మూలంలో ఎలావుందో ప్రయోగంతో వున్న సందర్భోచితమైన అర్థంద్వారా తెలుసుకోవచ్చు. దీన్ని మరో రకంగా చెబితే నన్నయగారి మాండలికంలో వాటికి ఆ అర్థవ్యాప్తి ఉండేదని వూహించవచ్చు - లేకపోతే శ్రోతలకు అర్థంకాదు కాబట్టి.

ఈ నాడు తెలుగులో రాయలసీమ మాండలికంలోనూ; కన్నడ సరిహద్దుల్లోనూ; కన్నడంలోనూ ప్రచురంగా వుండే చాలా పదాలను నన్నయ వాడాడు. అలాంటివి కొన్ని:

ఏను ౧ వెదు

నగు, అగు, (>నవ్, అవ్) నగరె (3-2-137)

లెస్స (3-2-136)

అది (స్త్రీవాచకంగా-)

అవ్వ! (స్త్రీ సంబోధన)

అయ్య (తండ్రిని సూచించడానికి-)

తండ్రులు
కాశ్యపులు } (గౌరవంబగువచనంగా)

కెలసము ౧ కెలసంబు

ముదుక - ని

క్షణంబు - (ఒక నిముషమనే అర్థంలో)

బుద్ధి = సలహా (2-2-150)

మతము = అభిప్రాయము (2-3-150)

కంపు ౧ (కమ్మ) = సుగంధం (3-2-197)

నన్నయ్యగారు వచ్చుచున్న వాఁడు/వారు/అది/అవి అన్న రూపాలు వాడారు. వచ్చితిని, వచ్చితిమి, -వంటి రూపాలూ వాడాడు. -చున్- శాసనాల్లోనూ కనిపిస్తున్నా ఇస్తిమి, చేస్తిమి, పోతున్న వస్తున్న - వంటి రూపాల్లోని -తున్- కన్నా భిన్నమైన ఈ-చున్- ఎక్కడిదని ఒక ప్రశ్న మిగిలివుంది తమిళ, కన్నడ రూపాలలో పోల్చి చూసినా దీనికి ఆకరం దొరకటం లేదు.

ఈ నాడు మైసూరు ప్రాంతంలోని తెలుగు బ్రాహ్మణుల వ్యవహారంలో ఈ వ్యాసకర్త గమనించిన రూపాలు ఇవి :

వస్తూ వున్నాడు.

వస్తూ ఉంఛాడు.

తింఛూ ఉంఛాడు.

గురజాడవారు 'కన్యాశుల్కం'లో కూడా ఈ పదాల్ని రికార్డు చేశారు.

ఏమంఛున్నాడు !

పై రూపాల్లోని ఛూ ౧ సూ తప్పకుండా -చున్- రూపాంతరాలే. ఉంటాడు అన్న రూపం కన్నా ప్రాచీనమైందే కావాలి.

ఉంచాడు. నన్నయగారు ఈ 'చున్' ప్రత్యయాన్ని వాడాడు. బ్రాహ్మణుల మాండలికంలోని కృత్రిమ ప్రామాణిక లక్షణం వల్ల ఉచ్చారణలో 'ఛున్' లో మహాప్రాణం వచ్చి వుండాలి. నన్నయ వంశీయులు పూర్వం ఎప్పుడో కొంతకాలం కర్ణాటక ప్రాంతంలో వుండి వుండాలి. ఆ వుచ్చారణ శిథిలాలే ఈనాడు అక్కడి తెలుగు బ్రాహ్మల ఉచ్చారణలో మిగిలి వున్నవి. అంచేత - తున్‌తో కూడిన రూపాలు కన్నడంలోని -తా- (బర్తాయిద్దానె ~ రాయలసీమ, వస్తావున్నాడు.) వల్ల ఏర్పడి చున్ ~ తున్ గా వ్యత్యయాన్ని, సామ్యజన్య రూపాన్ని పొందివుండాలి. భూతంలోని -తి- వర్ణం కూడా -తా- తో సంబంధం కల్గిందే.

మరి నన్నయ్యగారు ఏమను చున్నాడు, వచ్చు చున్నాడు వంటి రూపాలు వాడకుండా - చున్నవాడు వంటి సమస్త రూపాన్ని ఎందుకు వాడాడు ?

### 3. సంస్కృత రూపాలు : నన్నయ పునఃసృష్టి :

57

సంస్కృత భారతాన్ని తెలుగు చేస్తున్నందువల్లా ఆయనకున్న నిరంతర సంహితాది సంస్కృత వాఙ్మయాధ్యయనం వల్లా మూడు పద్ధతుల్లో ఆయన తెలుగులో రూపకల్పన చేశాడు.

ఎ) సంస్కృతరూపాన్ని ధాత్వర్థంలో అలాగే వాడటం.

అసహ్యము = సహించడానికి వీలులేనిది (1.8.230)

ఉపదేశించు = సలహా ఇచ్చు, చూపించు.
నాకాహారం బుపదేశింపుము (1.2.58)

తర్పణము = తృప్తి
భూదేవ కులాళి తర్పణ మహీయః ప్రీతి (1.1.12)

బ్రాహ్మణార్థము = విప్రుని ఆజ్ఞ
కడఁగెనప్పుడు బ్రాహ్మణార్థము సేయఁగన్ (1.6.291)

వ్యవసాయము = పని/ఉద్యోగము
పాప వ్యవసాయుల చెయ్వులనర్థవంతములగునె (1.5.176)

సమర్పించు = త్యాగపూర్వకంగా దానమివ్వటం.
సునంద యనుదాని సమర్పించిన (3.2 121)
ధర్మజుని రాజ్యంబునందు సమర్పించిన

రాజ్య భారంబంతయు భరతుంబూన్చి [తెలుగు ధాతువుని సంస్కృతార్థంలో వాడుకోవడం]

మే

ఇలాంటి ప్రయోగాలే వైదిక కర్మ వాసన ఉన్న క్షణియించు, విహరించు వేదము, వేది అన్న రూపాలు కూడా.

బి) సంస్కృత ధాత్వర్థానికి తెలుగులోని భావాన్ని వ్యాపింప చెయ్యటం.

ఉత్తరించు = దాటు (1-7-157)

కటాక్షించు = కంటి కొనలతో చూచు (1-4-78)

చింతించు = ఆలోచించు (1-2-184)

దాహము = వేడి (1-7-195)

బలవంతము = పరాక్రమం (1-6-193)

విచారించు = ఆలోచించు (2-2-124) (ఈ అర్థంలో ఈ నాటికీ రాయలసీమలో వాడుతారు)

సి) సంస్కృత భావాని కనుగుణంగా తెలుగు రూపాల్ని కల్పించడం.

పైన చూపిన 'పూంచు' అన్న ధాతువుకి 'భారం మోసడం' అన్న అర్థం వుంది. మీద/అందు వంటి సప్తమీ ప్రత్యయం రావాలి. కాని భరతున్ – అని ద్వితీయ వాడబడింది. కాని నన్నయలో 'పూను' ధాతువు సకర్మకంగా వాడబడింది. అంచేత 'భరత' శబ్దం ద్వితీయాంతమైంది. అది సంస్కృత భావాన్ని తెలుగులోకి తీసుకు వచ్చిన పద్ధతుల్లో ఒకటి.

దుష్కార్యమెత్తు (1-3-12) [ఎత్తు (కొను) = ఆరంభించు అనే అర్థంలో రాయలసీమలో పని ఎత్తుకొను - వంటి ప్రయోగాలున్నాయి] నన్నయ ప్రయోగంలో కార్యమెత్తు (ఎత్తు = వహించు) - కార్యమున్నదు కాపటం అన్న అర్థంవుంది.

పక్షంబుపలుకు (1-2-188), ప్రకంబు పలుకు (3-3-239) వంటి ప్రమాణాలూ ఇలాంటివే.

కవి ప్రయోగం విపక్షకు సంబంధించిందని నిరూపించే సందర్భాలు కొన్ని చూద్దాం.

1) ఏలా వచ్చు వారగుదురు ?

నమ్మనేరనయ్యాద,

'కథం ఆగంతారోఽ వేయుః' — అన్న సంస్కృత క్రియకు అనువాదం 'వచ్చు వారగుదురు' అన్నది. దీన్ని పూర్వపరిశోధకులు గుర్తించారుకూడా (నాగభూషణరావు 1964 : 152)

2) నాకుఁదొల్లి పరియింపఁబడిన భార్య (1.1.130)

మూలం : మదర్థం కన్యాం వృణీధ్వం (చూ. కోరాడ రామకృష్ణయ్య 1948)

3) యయాతి కలిగి ('మీద' బదులు 'కు' వాడటం)

మూలం : క్రోధద్రుహేర్ష్యా సూయార్థానాం యం ప్రతికోపః- అన్న పాణిని సూత్రం (చూ. నాగభూషణరావు 1964 : 67)

పై ప్రయోగాలు నిరూపిస్తున్న అంశం - రచయిత భాషలోని మూల సామగ్రిని - కొత్త అర్థాన్ని చెప్పడానికి వాడుకోవటంలో స్వాతంత్ర్యాన్ని ప్రదర్శిస్తాడని.

'సః ఆగతః' అన్న క్రియావాక్యం తెలుగులో 'వాడు వచ్చినాడు' అని అవుతుంది. కాని ఆగతః సః అన్న సంస్కృత వాక్యానికి దీటుగా రచించాలంటే వచ్చినవాడు వాడు - అనక తప్పదు. వచ్చిన వాఁడు ఫల్గునుడు అని తిక్కనగారూ ప్రయోగించారు. వాడు వచ్చినవాఁడు అన్నచోట తిక్కనగారు వచ్చినాడు అని మార్చాడు కూడా. అంచేత నన్నయగారు వాడిన వచ్చినవాడు వ్యవహారంలోని రూపంకాదు. అది 'శైలీరూపం' ఇలాగే తిక్కన రూపాలు కూడా :

నన్నయ చేసిన 'సీ తదర్థంబులై నిఖిల వేదంబులు వర్తిల్లు', 'కార్య సంప్రయోగము పొంటెన్, -అన్న ప్రయోగాల్లోని తదర్థం, పొంటె 'కొఱకు' అన్న అర్థాన్ని కలిగినవి. వీటిలోనూ ధాత్వర్థ సమన్వయం వుంది.

అందువల్ల నన్నయగారి మాండలికం - ఆయన ప్రయోగాల లోని ఆలంకారికత పోగా మిగిలిన మూల సామగ్రికి చెందింది. అది ఆనాటి బ్రాహ్మణ మాండలికం - ఈనాటి గోదావరి మాండలికానికి అతి ప్రాచీన రూపం. కాని ఆయన దేశాటన చేసినవాడు. కన్నడ పదాలు అలావచ్చాయి. లేక కర్ణాటకలో పుట్టి-పెరిగి వేగి నాటికి వచ్చి స్థిరబడ్డ వాడైనా కావచ్చు.[13] కాని 'భారతభాష' లో ఉన్నది ఆయన మాండలికం మాత్రమే కాదు. అది అయన -సృష్టి. కావ్య శైలికి శ్రీకారం. అది ఆయన చేసిన 'వాగనుశాసనం'.

ఈ నాటికీ ఆయాభావాల్ని పలికించడానికి నన్నయగారి లాగే ప్రయోగించాల్సిందే. ఇలా కవి తన మాండలికాన్ని దాటి రచించాడు కాబట్టి ఆంధ్రదేశానికంతా ప్రమాణమైన రూపం కాగల్గింది.

**జ్ఞాపికలు :**

1. నన్నయ్యగారు తెలుగు సాహిత్యానికి పెట్టిన ఒరవడిగా 'వాగను శాసనాన్ని' గుర్తిస్తూ ఈ వ్యాసకర్త ఒక గ్రంథం రచించాడు. వివరాలు ఆ గ్రంథంలో ఉన్నాయి. 'తెలుగు సాహితికి నన్నయ ఒరవడి' (అము. 1984)

2. చూ. భద్రిరాజు కృష్ణమూర్తి 'ఎ కాంట్రావర్సీ ఆఫ్ స్టైల్స్ ఇన్ ఎడ్యుకేషన్ ఇన్ తెలుగు'; 'లాంగ్వేజ్ మూవ్‌మెంట్స్ ఇన్ ఇండియా' అన్న గ్రంథంలో సి. ఐ. ఐల్. ప్రచురణ మైసూరు (1979)

3. పై వ్యాసం; మరియు చూ. భద్రిరాజు కృష్ణమూర్తి (సం) 'తెలుగు భాషా చరిత్ర', ఆ. ప్ర. సా. అ. ప్రచురణ (1974)

4. చూ. కోరాడ మహాదేవశాస్త్రి 'కావ్యభాషా పరిణామం', భ. కృష్ణమూర్తి (సం. 1974) లో.

5. చూ. అక్కిరాజు రమాపతి రావు. 'వ్యావహారిక భాషా చరిత్ర', ఎమెస్కో ప్రచురణ (1972)

6. చూ. కల్లూరి నాగభూషణరావు 'ఎడిస్క్రిప్టివ్ ఎనాలిసిస్ ఆఫ్ నన్నయాస్ యూసేజ్, (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి పిహెచ్. డి. పొందిన గ్రంథం. అము. 1964)

7. హెచ్. ఎస్. బ్రహ్మానంద 'వాక్కు-భాష', ఆ.ప.ఉ సం (1980)
   ,, 'ఆలంకారికులవాక్ తత్త్వదర్శనం' ,, (1981)
   ,, 'భాషావ్యావహారవివేచన', స్రవంతి (1982)
   ,, 'కార్చెవ్‌స్కి సంకేతదృష్టి' భారతి (1983)
   ,, 'భాషావిజ్ఞానం కావ్యశాస్త్రం' భారతిముద్రణలో

8. సమగ్రమైన తెలుగు భాషా చారిత్రక వ్యాకరణ నిర్మాణం చెయ్యడం కోసం విడివిడిగా ప్రాచీన కవుల కావ్యాల్లోని భాషను వర్ణనాత్మకంగా విశ్లేషించే ప్రయత్నం చిలుకూరి నారాయణరావు (1929) గారితో మొదలైందని గుర్తించవచ్చు. ఆయన 'నన్నయభాష' మీద పరిశోధించారు. ఈ మార్గంలోనే నన్నయ, తిక్కన, పాల్కురికి, ఎర్రన, నన్నెచోడుడు, శ్రీనాథుడు, శ్రీకృష్ణ దేవరాయలు మొదలైన కవుల కావ్య భాషను విశ్లేషించారు. ఈ పరిశోధనల ఫలితాల్ని పోల్చి చూచుకోవటంలో ఈ వ్యాసంలోని ప్రణాళిక సహాయపడగలదని ఈ వ్యాసకర్త నమ్మకం.

9. చూ. జి. నాగయ్య 'తెలుగు సాహిత్య సమీక్ష' (1983)

10. సారమతింగవీంద్రులు - అన్న అవతారికలోని పద్యం ఈ లక్షణాలను చెప్పింది. సాహిత్యపరంగా ఈ లక్షణాల్ని చాలా మంది వ్యాఖ్యానించారు.

11. అప్పకవి పద్యం ఇది :

"ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁ బడిమెనెందును దానినెకాని స్వాత సం
పాదనలేమిచేఁ దెనుఁగు పల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రాదని ద్రాక్షవాటికవి రాక్షసుఁడీ నియమంబు చేసినన్."

(అప్పకవీయము 1ఆ. 48)

12. నన్నయగారి ప్రయాణాల్లో కింది రూపాల్లో రేఫ శకటరేఫ వ్యత్యయం వుందని పరిశోధకులు అంటున్నారు.

అరుదు, ఊరార్పు, కురంగలి, చీరు, చెదరు, రూరు, దరికా నెరయు, పరఁగు, పెరుఁగు, ముందర, రాయి, వేరువేర. (చూ. నాభూషణరావు 1964 : 10) - వీటన్నిటికి శకటరేఫతో కూడి రూపాంతరాలున్నాయి.

13. హోసూరు కె. ఎస్. కోదండరామయ్యగారు 'నన్నయభట్టు ప్రాంతమువాడు?' అన్న పేరిట ఒక కరపత్రవ్యాసం ప్రకటించారు (1983). అందులో ఈ ప్రతిపాదన చేయబడ్డది.

[కృతస్మృతి :- నన్నయ భాషమీద అత్యుత్తమ సిద్ధాంత గ్రంథం రాసి నాలో ఆసక్తిని పెంచిన కీ. శే. కల్లూరి నాగభూషణరావు దివ్యస్మృతికి ఈ వ్యాసం అంకితం —బ్రహ్మానంద].



# ఆవిష్కరణం

## శ్రీ పణతుల రామచంద్రయ్య

51

ఉదారంగా నీవు చల్లిన ఉపశ్రుతుల్లో నన్ను చూచి
ఒక చిత్కళా వైఖరీ రూపం సిద్ధించిందన్నారట.
అవిచ్ఛిన్న విష్ణుత్వంలాంటి రసౌత్సుక్యాలకై నన్ను
అతి మెలకువగా రచించా వనుకున్నారట....

అయినా—
ఆనాటి ప్రత్యక్షాల్ని సవరించబోతే
అంగుళులకు ఆవేశం అందటంలేదు.
అభి మంత్రించిన పౌరుషాలు వేదికపై కెక్కుతోంటే
అక్షరాలు మేలిముసుగు విప్పటం లేదు.

విశాలమైన వేదం లాంటి వేదనాభ్యంతరంలో
వేడుకగా నీవు నటిస్తావని, ప్రభువా, నాకు తెలుసు.
చిట్టచివరి మెరుపుల్ని చిదిమి చిదిమి దాచే నీ
చిరునామా కాస్త తెలుసు.

చిరునామా లోని మౌనాలు రంగరించి
చిక్కని అద్వైతం దిద్దుకున్నాను.
లోలోపలి తొట్రుబాట్ల మీద
తోతైన ఔచిత్యాలు కప్పుకున్నాను.
పురాతన మందహాసాల్లో స్ఫురించే వైశాల్యాల మీదుగ నిన్ను
పోల్చుకున్నాను.

నీ ప్రాకారాల్లోని నిలువెత్తు బొమ్మలపై
నిషాద చర్చ చేస్తానని భయం నీకు—
నిరంతర నిరుపమాన విచికిత్సా ముద్ర
నిర్ణయించావు నాకు.

అడ్డు తొలగని యీ ముద్రలోని జీవనాన్ని
అక్షయ కలశంలోకి ఒంపుకుంటూ
ఏ అగ్నిని అనుసంధించ మంటావు ?
ఏ ఆత్మను అనువదించ మంటావు ?



# అల, కల, వలలే!

గ్రోణం కట్టే వయసులో —
పసితనంలో
అక్షరాభ్యాసం కోసం
పలకమీద దిద్దుకునేవి

ఎదిగిన తరువాత
పరిపూర్ణ ప్రాయంలో
బ్రతుకు తెరువు కోసం
వెళ్ళితే
ప్రపంచంలో ఎదురయ్యేవి
అల, కల, వలలే !!

# ఈ లోకంలో...

ప్రతి ఒక్కణ్ణీ
చెవులు పట్టి ఆడించేది
తల ఊపించేది
కర్కశులయిన
ప్రభువులా ?

కాదు.... కాదు.... కాదు
లలితములయిన
సంగీత సాహిత్యాలే !!


శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు




# కలగూరగంప

## రాజశిల్పి - శృంగార రస పోషణం

'రాజశిల్పి' నవలను కీర్తిశేషులు శ్రీ పాటిబండ మాధవశర్మ రచించారు. మానవజీవితం శృంగార, వీర, కరుణాది నవరసాలతో కూడింది. రసజ్ఞులైన కవిపండితులు ఈ నవరసాలను భావించి వ్యక్తీకరించి పఠితలకు ఆనందాన్ని ప్రదర్శించటానికి యత్నిస్తారు. 'రాజశిల్పి' రచయిత శ్రీ పాటిబండ మాధవశర్మ రసవిజ్ఞాన వివేకి. వీరు కథాకాలంనాటి చారిత్రకవ్యక్తుల స్థితిగతుల్ని సక్రమంగా అవగతం చేసుకొని వారి జీవితవిధానాలను సముచితంగా భావించి రసోచితంగా తీర్చిదిద్దారు. సత్యానికి కథాకాలంనాడు కొండవీటి స్వామ్యాట్టులై పాలించిన కుమరగిరిరెడ్డి మహనీయుని కాలంలో వ్యవహరించిన పాత్రలందరు దరిదాపుగా రచయిత భావించిన వ్యక్తుల వంటివారు. నాటి ప్రజలు సహితం వీరు భావించినట్లే ఉన్నారనిపించేటట్లుగా రచించారు. చారిత్రక సత్యాలతో ఈ రీతిగా తాదాత్మ్యం పొంది సత్యసమీచీనంగా భావించటం చాలా అవసరం.

### శృంగార రస పోషణం

శృంగార రస పరిచయంలో మొదట 'రాజశిల్పి' కథాకాలంలో కొండవీటి చక్రవర్తి అయిన కుమరగిరిని మహానాయకులను ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంతులని తెల్పిన అలంకారికుల దృక్పథంలోని ధీరోదాత్తుడని అనవచ్చు. ఇతనిలో ధీరోదాత్తుని ధైర్యం, కరుణ, సత్యం, మనోదేహబలం అనే గుణాలు స్పష్టంగా గోచరిస్తాయి. శాంత బుద్ధి కలిగి ప్రసన్నుడైనవాడు ధీరశాంతుడు. కుమరగిరిరెడ్డి తుది జీవితంలో ధీరశాంత లక్షణాలు వహించాయి. కుమరగిరి దేవేరి ఒక్కటే కనిపిస్తున్నది. ఇతడు బహ్వంగనా సక్తుడైనట్లు వ్యక్తీకరింపబడింది. తన కుమారుడైన కుమారాన్నపోతారెడ్డి పుట్టిన ఐదు సంవత్సరాలకు దేవేరి మరణించినా కుమరగిరి మళ్ళీ వివాహమాడలేదు. కాని భావుకశ్రేష్ఠుడైన ఇతని దృక్పథంలో కళాకుశల అయిన మహారాజ్ఞి కుమరగిరికి నిత్యం శోభించి కనిపించేది. ఇతనికి విభావసామగ్రిగా వ్యవహరిస్తుండగా ఇతడు రసజ్ఞుడై అమె అందపు కదలికలను శిల్పరూపంలో సృజించాడు.

ఇతడు బహ్వంగనాసక్తుడైనటు వ్యక్తీకరింపబడింది. అంటే కుమరగిరి తాను ప్రేమించిన స్త్రీలందరిపట్ల సమానం, సహజం అయిన ప్రీతి కలిగి సమర్థతను, దక్షత్వాన్ని వహించిన దక్షిణ నాయకుడు ఇతని అనురాగాన్ని వహించిన అధికసంఖ్యాకులైన స్త్రీలు 'సామాన్య'లు అలంకారికులు ఈ సామాన్యల్ని జాతి సామాన్య, ఆగంతుక సామాన్య గూఢ సామాన్య అని విభజించారు. • అందువల్ల కుమరగిరి వేశ్యోప భోగాల మూలంగా పొందిన గౌరవం కలవాడు, విలాస సహితుడు అయిన వైశికనాయకుడు అనిపించుకొంటాడు.

కుమారాన్నపోతారెడ్డి కళ్ళలో కుమరగిరి మహారాజ్ఞి ప్రాణాలు కదలాడుచున్నట్లు కనిపించేవి. ఆ కళ్ళు చూచినపుడెల్ల ఇతనికి మరణిస్తున్న మహారాజ్ఞి కళ్ళు గుర్తు వచ్చేవి. మహారాజ్ఞి ప్రాణాలు ఆ కళ్ళలోనుండి తనను చూస్తున్నట్లు ఉండేవి. సుఖమో, దుఃఖమో వివరింపరాని ఒకభావం ఇతడ్ని ఆవేశించి ఇతడు ఉద్విగ్నుడయ్యేవాడు. మరణించిన దేవేరిలో పైన చెప్పినట్టి అనుభూతివల్ల కుమరగిరి అధికంగా విప్రలంభాన్ని, ఒకప్పుడు కరుణాన్ని అనుభవిస్తుండేవాడు. ఆమె కళ్ళు తన కళ్ళను కలుసుకొన్నపుడు పతి అయిన ఇతడు స్వీయానుభవమూలంగా సంయోగస్థితిని సహితం భావుకలోకా నుభవంలో అనుభవించాడని చెప్పవచ్చు.

కుమరగిరిరెడ్డి చెల్లెలు మల్లాంబిక, అమె భర్త కాటయవేమారెడ్డి పేర్కొనదగిన నాయికా, నాయకులు. అలంకార శాస్త్ర ప్రకారం స్వామి అందే అనురాగం గల 'స్వీయ' జాతి ప్రసిద్ధనాయిక మల్లాంబిక. ఈ స్వీయ ముగ్ధ, మధ్య, ప్రౌఢ అనే మూడు ప్రధాన విభేదాలతో ఉంటుంది. ముగ్ధ అకుంఠిత యౌవన, మధ్య సమాన లజ్జామదన, ప్రౌఢ [ప్రగల్భ] సకల కేళీ కలాప, కోవిద లజ్జను జయించిన కామేచ్ఛకలది. ఈ ముగ్గురిలో ముగ్ధ అజ్ఞాత యౌవన, జ్ఞాత యౌవన, నవోఢ, విస్రబ్ధ నవోఢ అని నాలుగు విధాలుగా ఉంటుంది. మల్లాంబిక ముగ్ధ నాయిక. కథారంభవేళ ఈమె అజ్ఞాత యౌవనగా ఉండి తరువాత క్రమంగా జ్ఞాత యౌవన అవుతూ వృద్ధిపొందిన సమయంలో తనకొక్కదానికే భర్తగా ఉండవలసిన కాటయవేమారెడ్డి పరస్త్రీలోలుడవుతున్నాడనే అనుమానంలో వ్యథా కలిత అయింది. చివరకు ఇతర ముగ్ధ స్త్రీ నాయికత్వం [మధ్య, ప్రగల్భ] లక్షణాలను వహించి హీరాంబికను తనతోపాటు మరొక కులస్త్రీ అయిన దేవేరిగ తన భర్త వివాహ మాడటానికి అంగీకరించింది.

సౌందర్యంతో తాను చక్రవర్తి సోదరిగా జన్మించి భర్తను తగిన ఉన్నతస్థితిని కల్పించానని ఆమెకు అభిజాత్యగర్వం. పురుషుని

ు పూర్తిగా స్వీకరించటంచేత మొదట పూర్తిగా ఆనందిస్తుండేది. లకుమను ప్రేమించాడనే భావం కలిగినపుడు అతని ప్రేమ పూర్తిగా సంతోషపెట్టనట్లు ప్రవర్తించింది. అలంకార స్త్రాలు ఇట్టి గర్వస్థితిని, సంతోషస్థితిని పరిశీలించి నాయికా ణం చేశారు. పురుషరతిచేత పూర్తిగా తృప్తిని పొందే క 'తృప్త', తృప్తి పొందని నాయిక 'అతృప్త'. కొంత , కొంత అతృప్త అయినపుడు ఆమె 'తృప్తాతృప్త'. కాటయ రెడ్డి తనమీద తప్ప మరి ఏ స్త్రీమీద ఎట్టి ప్రేమభావం ుడని గాఢంగా నమ్మినపుడు మల్లాంబిక తృప్తఅని, లకుమాదేవి భర్తకు ప్రేమ ఉన్నట్లు గమనించి తనమీద చూపే ప్రేమకు ఁ అనురాగం వహించి ఆనందిస్తున్న వ్యతిరేకతను ప్రకటిస్తూ ్యావేదనను అనుభవిస్తున్నపుడు తృప్తాతృప్త అని అలంకారిక ాష నన్వయింపవచ్చు.

అలంకారశాస్త్రం గర్వంగల నాయికను 'గర్విత' అన్నది. నాయికను 'సౌందర్యగర్విత', ప్రేమగర్విత, విద్యాగర్విత, 'వనగర్విత, కులగర్విత' అని విభేదించింది. ఈ అయిదు భేదాల ణాలలో ఒకే నాయికయందు ఒక్కొక్కపుడు కొన్ని లక్షణాలు ు ఉండవచ్చు. ఆ నాయిక వాటిని జనానీకానికి ప్రదర్శిస్తూ కవచ్చు. సౌందర్యవతిగా పుట్టిన మల్లాంబిక సౌందర్య గర్విత ణాలను, మొదట ఈమె తన భర్త సర్వప్రేమను తనమీదనే వాడని గర్వం వహించటంవల్ల ప్రేమగర్విత లక్షణాలను. సంగీతాది ్యార్జన గర్వం వహించటంవల్ల విద్యాగర్విత లక్షణాలను, 'రాజశిల్పి' ంకాలంలో అధికభాగం యౌవనవతివలె గర్వంతో గడపటంవల్ల ౌవనగర్విత లక్షణాలను తన కులమంటే విశేషాభిమానం వహించి ్వరేఖలను ప్రదర్శించటంవల్ల గర్విత లక్షణాలను వహించిందని ్యానవచ్చు.

తన ప్రియుడు అంటే నాయకుడు మరొకస్త్రీని ప్రేమించి స్తున్నట్లు ఎరిగి దుఃఖాన్ని పొందుతున్న స్త్రీని అలంకారజ్ఞులు ంభోగదుఃఖిత' అంటారు, మల్లాంబిక తనభర్త కాటయవేమారెడ్డి ుమాదేవిని ప్రేమించి శృంగారానుభూతిని పొందుతున్నట్లు వారి ్యావర్తనను చూచినపుడు దుఃఖాన్ని అనుభవించింది కనుక ంభోగదుఃఖిత' అయిందని అనవచ్చు. ఈమె 'ఉత్తమ', 'పద్మిని' మెభర్త లకుమాదేవిని ప్రేమించాడని భ్రాంతి వహించిన సమయంలో ుడు ఉత్సవ దర్శనార్థం అహోబలానికి వెళ్తూ తనను కూడ ్మంటే ఆమెనే [లకుమ] తీసికొనిపొమ్మన్నది. అతడు ఒంటరిగా ్ళేటట్లు చేసి ఎడబాటును కొంతకాలమనుభవించి మళ్ళీ నిజం ుసుకొన్న అనంతరం భర్తతో ఈమె భరతుడు నామకరణం ున 'సంపన్న' మనే సంభోగశృంగారాన్ని అనుభవించింది.

అష్టవిధ శృంగారనాయికా లక్షణాలలో మల్లాంబిక నాయకుని చేత ఎప్పుడూ సంతోషపెట్టబడేది కనుక 'స్వాధీనపతిక' లక్షణాలు, ప్రియుడు వచ్చేటప్పటికి తాను అలంకరించుకొని కేళీగృహాన్ని అలంకరించి సిద్ధంగా ఉండేది కావున 'వాసకసజ్జిక' నాయికలక్షణాలు నాయకుడు దేశాంతరం చేరి ఉన్నపుడు ఖేదపడేది కావున 'ప్రోషిత భర్తృకా' లక్షణాలు కలదిగా సందర్భాలనుబట్టి కనిపిస్తుంది. కాటయ వేమారెడ్డి ఈమెను విడిచి ఒంటరిగా అహోబిలం వెళ్ళినపుడు ఈమె అనుభవించిన వియోగాన్ని అలంకార శాస్త్రజ్ఞులు గుర్తించిన 'ప్రవాస విప్రలంభమని' ఉచితజ్ఞులు వ్యవహరిస్తారు.

హిరాంబిక కాటయవేమారెడ్డి రెండవ దేవేరి. విజయనగర చక్రవర్తి అయిన హరిహరరాయల పుత్రిక. ఉన్నత రాజకన్య, ఉత్తమ విద్యాప్రియ, రసోజ్జీవితాసక్త అయిన ఈమె గుణాలను తగిన రీతిగా ఆదరించి పోషించే స్వామ్యానికి మహామంత్రి, వ్యూహాధిపతి, మహాయోధుడు, సాహితీ సంపన్నుడైన విద్యావేత్త, మహారాజ సోదరి భర్త అయిన కాటయవేమారెడ్డి మరొక మహాచక్రవర్తి పుత్రికను వివాహమాడి ఆమెకు తన ఉత్తమ భర్తృత్వాది గుణాల మూలంగా మహానందమయ జీవితాన్ని కలిగిస్తూ ఆమె తలిదండ్రుల బలాన్ని అవసరమైనపుడు ఉపయోగించుకోటానికి సంసిద్ధుడు కాకపోతే తననే నమ్మిన రెడ్డిసామ్రాజ్యం బహుకాలం జీవించలేదు, ఈ స్థితులను రెండిటిని అవగతం చేసుకొన్నవాడు, రెండిటిపట్ల తుల్యమైన అభిమానం గలవాడయిన వామనభట్టు హిరాంబికా, కాటయవేముల వివాహమనే మహత్తర శృంగారనాటకానికి సూత్రధారుడైనాడు. ఇతడు తాను నిర్వహించదలచిన నాటకాన్ని రమ్యలేఖనహస్త అయిన హిరాంబికచేత తన శృంగారభూషణ భాణానికి ప్రతి వ్రాయించి కాటయవేమారెడ్డి కిచ్చి అతనిచేత "ముత్యాలకోవవలె ముద్దుగొలుపు చున్నది" అని అనిపించటంతో ప్రారంభం చేశాడు. అనాటినుంచీనే హిరాంబిక, కాటయవేమారెడ్లు శృంగార రసాలంబనాలయినారు. అహో బిలంలో వీరిద్దరు ఒకరినొకరిని చూడకపూర్వమే ప్రేమించుకున్నారు అహోబిలంలో వీరిద్దరు ఒకరినొకరు చూశారు. ఆ సమయంలోనే హిరాంబికకు ప్రేమభావాలు ఉత్పన్నం కావటం, ప్రణయ విభావాను భవాలను వెల్లడించటం జరిగింది. వామనభట్టువల్ల కాటయవేముని శాస్త్రాది శక్తులను గురించి విన్న గంగాదేవి హిరాంబిక శృంగార జీవితారంభానికి చక్కని సహాయికగా ప్రవర్తించింది. అహోబిలానికి లకుమాదేవికూడ వచ్చినపుడు గంగాదేవి ఆమెను హిరాంబికవంటి రాజకుమారిగా భావించి స్నేహం చేసింది. ఆసమయంలో హిరాంబిక కాటయవేమారెడ్డిని వివాహమాడి తానెట్టివారితో శృంగారజీవితాన్ని గడపగలుగుతుందో భావించి ఆనందించకలిగి ఉంటుంది. పెదకోమటి వేమారెడ్డి లకుమాదేవిని అహోబిలంలో బందీ చేయించినపుడు అతనితో

కాటయవేమారెడ్డికి ప్రబలమైన యుద్ధం వస్తుందని ఊహించి హీరాంబిక కొంత దుస్థితిని భావించి విరహసమయాలను గడిపి ఉంటుంది. ఆమె కిస్వీ అయినా అంటే వివాహంకాకపోయినా వియోగాన్ని అనుభవించింది. ఇట్టి విరహాన్ని అలంకారికులు 'పూర్వరాగ విప్రలంభమని' వ్యవహరించారు. కొండవీటిలో రెండు విషయాలు వ్యాపించాయి. ప్రియుని మొదటి దేవేరి అయిన మల్లాంబిక మొదట ఈమెను అల్పంగా కలిగిన అభిమాన వ్యతిరేకతను వీడి ఈమెను అతి ప్రేమతో ఆదరించి రాజమహేంద్రవరంలో పట్టాభిషిక్తురాలవుతున్నపుడు ప్రేమతో తీసికొనివెళ్ళి రెండవ దేవేరిగా సభను అలంకరించటానికి అంగీకరించింది.

పరమ వైష్ణవియై లోకం విష్ణుమయంగా వ్యవహరించే లకుమాదేవికి తన నాట్యాన్ని యోగంగా భావించి తన పంచేంద్రియాలను నాట్యభంగిమలనే యోగాభ్యాసాల మూలంగా లకుమ వశం చేసుకొన్నపుడు ఈ కాటయవేమారెడ్డిని ఆమె ప్రత్యక్ష విష్ణువుగా భావించి రసానుభూతిని పొందేది. ఆమె తనను ఇట్టి భావంతో ఊహిస్తున్నదని ఎరిగినా ఆమె నాట్యాభినయ భంగిమాదుల మూలంగా కాటయవేమారెడ్డి ఎట్టి రసానుభూతిని పొందే సమయంలోనూ ఆమెకు తన నాయికగా పరిగ్రహించటం లేదుగదా అని అణుమాత్రం మనోభావాన్ని వహించటమైనా చేసేవాడుకాడు.

కాటయవేమారెడ్డి నాట్యకళా నిష్ణాతుడు, రసజ్ఞుడు, కామినీవిజ్ఞుడు. ఇట్టివారిని రసికురాండ్రయిన పరకీయ, సామాన్య లిద్దరు లభించటం, వీరు శృంగార రసానుగుణంగా వారిని ఆదరించటం సామాన్య లక్షణమై ఉంటుంది. రాజ్యపాలకులు, సామ్రాట్టులు శక్తిమంతులై దేశంలోని నిగూఢ విశేషాలను సాధించడానికి, ఆప్తమిత్రులను సంపాదించటానికి, ప్రబల శత్రువులను విషకన్యాది ప్రయోగాల మూలంగా విచ్ఛిన్నం చేయటానికి, రసిక జీవనానుభూతితో నూతనానందాన్ని పొందటానికి, ఉత్తేజ సరచి సంఘజీవనాన్ని చైతన్యం చేయించటానికి మొదలైన పనులకోసం పరకీయా, సామాన్యలను వరించి వ్యవహరించటం భారతజాతి లక్షణంగా సాహిత్య శాస్త్ర గ్రంథాలవల్ల స్పష్టంగా తెలుస్తున్నది. ఉత్తమ రాజన్యులు, చక్రవర్తులు తామే నూటిగా పరకీయలను స్వీకరించక వారి సంసారాలను పటిష్ఠం చేయటానికి యత్నం చేసేవారు. కొందరు రాజులు సామాన్యులద్వారా ప్రభుదర్శనం చేసి ప్రీతిని కలిగించ కలిగినపుడుగాని, ఆ విధంగా చేసేటట్లు చేయించిగాని పరకీయలను ప్రయోజన సంపాదనార్థం స్వీకరిస్తుండేవారు. ఈ పద్ధతిని కొండవీటి రెడ్డిరాజులు సహితం ఆదరించినట్లు తగిన నిదర్శనాలు కనిపిస్తున్నవి. ఇట్టి స్థితిలో వేత్తలయిన శ్రీ పాటిబండ మాధవశర్మ కొండవీటి సామ్రాజ్య మహామంత్రి, యోధాగ్రేసరుడు, సర్వసేనాధ్యక్షుడు రాజమహేంద్రవరపాలకుడయిన కాటయవేమారెడ్డికి పరకీయా, సామాన్యలలో ఒక్కరితోనైన పరిచయ ప్రణయాలు కలిగిఉన్నట్లు కల్పింపకపోవటం సముచితంగా కనిపించటంలేదు. ఇంత పటిష్ఠుడైన కాటయవేమారెడ్డి శృంగార విషయికంగా కేవలం మల్లాంబిక, వీరాంబికలనే ఇద్దరు దేవేరుల్ని మాత్రమే కలిగి ఉన్నట్లు వర్తింపచేయటం అంత ఉచితంగా కనిపించదు. ఇతడు పరకీయలద్వారా ప్రబల శత్రువులైన వీరశైవుల గృహాది రహస్యాలను తెలుసుకోటం, సామాన్యలద్వారా శత్రువినాశకరణ శృంగార సైన్య నాయికా సంపాదన చేయటం వంటి ప్రయోజనాలను పొంది ఉన్నట్లయితే ఎక్కువ పటిష్ఠంగాను, రమణీయంగాను ఉండేవి.

రస విషయికమయిన దృష్టితో పరిశీలిస్తే 'రాజశిల్పి' లోని లకుమాదేవి విచిత్ర శృంగార రస విషయిక నాయిక. దీన్ని ఆధ్యాత్మిక శృంగారం అనవచ్చు. ఈమె కథాకాలంనాటి చక్రవర్తి అయిన కుమారగిరిరెడ్డికి తండ్రి అయిన అనవోతారెడ్డికి వేశ్యలయిన పంప, పొన్న, రన్న అనే ముగ్గురిలో పంపకు జన్మించింది. పుట్టుకవల్ల ఈమె శాస్త్రీయంగా 'సామాన్య' అయినప్పటికి ఉదాత్తుడు, ధీరోదాత్తుడయిన కుమరగిరి క్షత్రరక్త విశేషంతో వర్తిల్లుతున్న ఈమెను సోదరీతుల్యంగా అభివ్యక్తం చేస్తుండటంవల్ల ఈమె ఉత్తమ శృంగార విలసితగా వర్తించింది. ఈమె మహాసాధకురాలు. నాట్యయోగాసన కళాకేళిలోల. లోకాన్ని విష్ణుమయంగా భావించే పరమ వైష్ణవి ఈమె. నాట్యకళాకోవిద అయిన ఈమె తన నాట్యాభినయ భక్తివిశేషంతో తన విష్ణుపత్ని విభవాన్ని వ్యక్తంచేస్తుంది. ఇలా నాట్యం మూలంగా తన విష్ణుభక్తినీ వెల్లడిస్తూ భక్తురాలయిన ఈమె పరమానందాన్ని పొందేటపుడు కాటయవేమారెడ్డిని ప్రియుడైన విష్ణుదేవునిగా స్వీకరించేది. ఇట్టి ప్రియభర్తృస్వీకరణ సమయాలలో లకుమాదేవి కాటయవేముని వల్ల తాను కల్పించుకొన్న మానసిక సంభోగాన్ని పొందేదేగాని శరీర సంయోగాన్ని అణుమాత్రమయినా ఆశించలేదు. దీన్ని ఈమె అభినయించే రసాన్ని భక్తిరసమని అనవచ్చు. కాని నవరస పరిగణన చేసేవారు భక్తిని ప్రత్యేక రసంగా అంగీకరించాక శృంగారరసంలో అంతర్భాగంగా అంగీకరించారు. వైష్ణవభక్త శ్రేష్ఠుడైన రూపగోస్వామి అభిమతం ప్రకారం లకుమాదేవి ప్రదర్శించిన విష్ణుప్రియాత్వంగల భక్తిని 'మధురభక్తి' అనవచ్చు. దీన్ని మధురరసమని కూడా అంటారు.

'రాజశిల్పి' లోని దుర్గ, శ్రీనాథుల విషయంలో కూడ శృంగారవృత్తి కొంతగా కనిపిస్తుంది. కథాకాలంనాడు కొండవీటిలో అన్నయమంత్రి అనే ఒక మంత్రివర్యునితో పరిచయంగల బ్రాహ్మణ శ్రేష్ఠుడైన దగ్గుపల్లి తిప్పయ్యగారు అవివాహిత అయిన కుమార్తె దుర్గ. చక్రవర్తివల్ల ఉన్నత ప్రభువర్గీయులవల్ల ఉత్తమ సహకారాన్ని,

ప్రేమ పూర్వక పరిపోషణను అభిలషిస్తూ మేనమామ అయిన దగ్గుపల్లి తిప్పయ్య ఇంటికి విచ్చేసిన అవివాహితుడైన యువకుడు శ్రీనాథుడు. ఇంట్లోచేరిన అనతికాలంలోనే కన్య అయిన దుర్గ తాను పతిగా వరించటానికి సర్వవిధాల యోగ్యుడైన బావను ప్రేమించింది. అందువల్ల దుర్గ, శ్రీనాథుల శృంగారం ఆలంకారికులు వర్గీకరించిన 'నాయికారబ్ధశృంగార' మవుతుంది. పరస్పరానుకూల్యం, విలాసం కలవారై నాయికా నాయకులైన దుర్గ;, శ్రీనాథులిద్దరు దర్శనస్పర్శనాదులను పొందటంవల్ల వారిది సంభోగశృంగారమయిన స్తంభాది సర్వసాత్త్విక భావాలు. ప్రసన్నమైన ముఖకాంతి మొదలైనవి అనుభవాలయినవి. వీరు యౌవనవంతులు కావటంవల్ల స్త్రీ పురుషులైన వీరి సాత్వికోదయం సిగ్గు మొదలైన వాటిచేత, సంక్షిప్తాలైన ఉపచారాలు పొంది 'సంక్షిప్త' అనే శృంగారమయింది. అయితే శ్రీనాథుడు తాను అనువదిస్తున్న శాలివాహన సప్తశతిలోని శ్లోకాన్ని వైశ్యోత్తముడు, ప్రభుపర్గీయుడైన అవచితిప్పయశెట్టికి వినిపించి సత్కారాన్ని పొందాడు. స్వల్పకాలంలోనే రాజకీయ పరిజ్ఞాన రహితుడై చక్రవర్తి కుమరగిరిరెడ్డి, మహామంత్రి కాటయ వేమారెడ్ల పరిపాలనపట్ల శత్రుభావం వహించి, దాన్ని నశింపచేయటానికి ప్రబల ప్రతిచర్యలకు పూనుకొని నిర్వహిస్తున్న మామిడి సింగన మంత్రి ఆప్తకార్య నిర్వాహకులలో ఒకడై శ్రీనాథుడు గూఢలేఖలో కొండపల్లి దుర్గాన్ని పాలిస్తున్న పెదకోమటి వేమారెడ్డిని చేరుకొని లేఖనిచ్చి అక్కడే ఉండిపోయాడు. ఈ సమయంలో 'కన్య' అయిన దుర్గ 'ప్రవాస విప్రలంభాన్ని' అనుభవించింది. చిక్కుకున్న రాజకీయాల కారణంగా తన ప్రేమను గురించి వియోగవేళ ప్రవృద్ధి భావాలను పొందే అవకాశం శ్రీనాథునికి లేకపోయింది.

'రాజశిల్పి' కథాకాలం తరువాత కొద్దికాలానికే శ్రీహర్ష మహాకవి విరచితమైన నైషధమహాకావ్యాన్ని శృంగారరస ప్రధానంగా అనువదించి 'శృంగారనైషధమ'నే పేరుతో ప్రసిద్ధికెక్కిన శ్రీనాథుడు యౌవనారంభ సమయంలోనే శృంగార రస ప్రియుడైన రచన మారంభించినట్లు తెలియచేయటం కోసమే రచయిత శ్రీ పాటిబండ మాధవశర్మ ఈ కథాకాలంలో శాలివాహనసప్తశతిని అనువదిస్తున్నట్లు తెలియచేశారు. శ్రీనాథునిచేత అందులోని "వారణసేయ దావ గౌనవా..." అనే శ్లోకానువాదాన్ని అవచి తిప్పయశెట్టికి వినిపించి సత్కారాన్ని పొందినట్లు చేయించారు. ఇది యువకవి శ్రీనాథుని శృంగార ప్రియత్వానికీ, 'రాజశిల్పి' కథలోని శృంగారరసవిశిష్టతకు చక్కని నిదర్శనం. ఈ విధంగా శృంగారరస పోషణం 'రాజశిల్పి' నవలలో సారస్వత రసజ్ఞులయిన శ్రీ పాటిబండ మాధవశర్మగారిచే విశిష్టంగా తీర్చిదిద్దబడింది.

# ఆంధ్రావళిలోని ఉద్యమస్వరూపం

డా॥ మన్నేరు వసుంధర

ఆధునిక కవిత్వంలో గొప్ప ఉద్యమములుగా నిలిచినవి రెండు. అవి భావ కవిత్వము, అభ్యుదయ కవిత్వము. భావ కవిత్వంలో ప్రణయ కవిత్వం తర్వాత ప్రసిద్ధిగాంచినది దేశభక్తి కవిత్వమే. బసవరాజు, దువ్వూరి మొదలయినవారు జాతీయాభిమానమును, రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల మొదలయినవారు ఆంధ్రాభిమానమును తమ కవితలలో చూపినారు.

దేశభక్తిని వివరించుచు తొలుత ఒక సమగ్ర కావ్యముగా వెలువడినది 'ఆంధ్రావళి'యే. మన దేశములో 1910 నుండి 1920 వరకు స్వాతంత్ర్యోద్యమము మందకొడిగా సాగినది. ఈ కాలములోనే ప్రజలలోని నిర్వీర్యతను తొలగించి ఉద్యమోన్ముఖులుగా చేయవలయు ననెడిభావనలో 'ఆంధ్రావళిని రచించిరి రాయప్రోలుగారు. దేశోద్ధరణకై కంకణధారణమును చేయమని 'ఉగాది వందనము'లో ప్రోత్సహించి 'పత్తాక జయంతి'లో జండాను ఎగరేయుటద్వారా కావ్యమునకు ఒక సమగ్రతను కూర్చినాడు. ఇందు కవికిగల ఆంధ్రాభిమానము స్పష్టముగా గోచరించును. రాయప్రోలుగారు "నాదు జాతి నాదేశము నాదు భాష అను నహంకార దర్శన మందు మాంధ్ర" అని పేర్కొన్నాడు. ఈ మూడుపాయలలోనే ఆంధ్రాభిమానము యొక్క సర్వతోముఖ స్ఫూర్తి ఇమిడి యున్నది. ఈ మూడింటి కొరకే ఇందు గత వైభవ స్మరణము చేసి, వర్తమాన పరిస్థితికి చింతించి, భవిష్యత్తు కర్తవ్యమునకై ప్రబోధము చేసినాడు.

గత వైభవ స్మరణములో ప్రాచీన సంస్కృతిని, ఆంధ్ర రాజనము నేలిన వీరులను, ఆనాటి సిరిసంపదలను మున్నగువానిని వివరించినాడు.

అమరావతీ పట్టణమున బౌద్ధుల విశ్వ
    విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున రాజ వీర లాంఛనముగా
    పలు శస్త్ర శాలలు నిలుపునాడు
... ... ... ... ...
ఆ మహావేశ మర్థించి యాంధ్రులారా
చల్లు డాంధ్ర లోకమున నక్షతలు నేడు.

అనేకమంది రాజులు ఈ నేలను పరిపాలించిరి. ఒక్కొక్కరి కాలమున ఒక్కొక్క విధమైన సంస్కృతీ వైభవము వెల్లివిరిసినది. వాటిని ఈ పద్యములో స్మరించినాడు. కనిష్క సామ్రాజ్య రాజధాని యైన అమరావతి విద్యలకు నిలయమైన సంగతిని, తురుష్కుల కెదురు

నిలిచిన ఓరుగంటి నేలిన కాకతీయులను, కవితా పెండ్లిండ్లు జరిగిన విజయనగర సామ్రాజ్యమును గుర్తుచేసి, తిరిగి అటువంటి మహావేశమును పొంది ఉద్యమ స్ఫూర్తులు కండి అని తెలుపుచున్నాడు. 'అక్షతలు' అని అనుటవలన మీరు మొదలిడిన కార్యము నిర్విఘ్నముగా శుభాంతమగును అనే విశిష్ట భావనను వెల్లడి చేసినాడు. శుభాంతమగుటకే మన సంప్రదాయములో అక్షతలు చల్లుట గమనింపవచ్చును.

నాద ధేనువు పిండి నవనీతమందించె
త్యాగరాజ స్వామి తన్మయుండు
లీలా తరంగిణి కూల తీర్థా నందు
అయ్యె నారాయణు డమృతమూర్తి.

అను పద్యములో ప్రజల నాలుకలపై పరవళ్లు త్రొక్కుతున్న త్యాగరాజస్వామిని, అమృతమూర్తియైన నారాయణున్ని, పదముల క్షేత్రయ్యను పేర్కొని వీరంతా తెలుగువారేనని సంతోషము చెందినాడు. సంగీత సాహిత్య కలలను ఉగ్గుపాలతోనే త్రాగి ఉమిసినారు కాని ఈనాటి ప్రజలు వాటిని నేర్చుకొనుటకు ఉత్తర దక్షిణ ముఖాలు పెడుతున్నారనుట వల్ల ఆనాడున్నట్లు వీరిలో ధైర్య స్థైర్యములు లేవని తెలుపుచున్నాడు. 'తెలుగు మాన్యము' అను ఖండికలో 'మా తెనుగు తల్లి మెడకిదె మల్లెదండ' అని కవితామతల్లికి ప్రణమిల్లి తెలుగు సాహితీ లోకంలో సుప్రసిద్ధులైన కవిత్రయము, పోతన మున్నగు పరిణతవాక్కులస్మదీన పద్య కలా కవితా పితామహులు ఈ తెనుగు తీయని మాన్యము నిచ్చినారు. ఇందు క్రొత్త అంట్లు నాటి పాడుతానంటాడు. ఒక్కొక్క కవిని ఒక్కొక్క పద్యములో రచించి సాహిత్యమున ఒక నూతన భావన చేసినాడు. ప్రాచీన కవులందరికిని నమస్సులను తెలిపి వారి యందలి గౌరవ భావమును వెల్లడించినాడు.

పాకాల చెఱువు చెంపల పండు ధాన్యముల్
అన్య దేశాధిపులడుగునాడు
అద్దెంకి కోడెల నాబోతులకున యి
దూరాగతులు కొన్ని త్రోలనాడు

ఏ ఐశ్వర్యముతో నైతే ఈ భూమి నిండియుండెనో ఆ ఐశ్వరమును పోనీయకుండా ఉంచాలంటాడు అందుకే 'తమ్ముడా ! మాయ నిత్తువే తల్లివన్నె, చెల్లెలా చిన్నబుత్తువే తల్లి చిన్నె' అని దీనంగా అడుగుతాడు.

ప్రాచీనాంధ్ర రాజులయొక్క శౌర్యప్రశస్తిని ఎంతో ఉత్సాహముతో పలికినాడు. మనుమసిద్ధి సామ్రాజ్యములోనున్న ఖడ్గతిక్కన కత్తి కడిగినటువంటి కదనభూమిని తలచుకొనగానే కవి హృదయము ఎంతో విచారించినది. ఓరుగల్లున రాజవీర లాంఛనముగా పలు శస్త్రశాలలు నిలుపునాడు జ్ఞాపకము రాగానే తెలుగు కవిని కదిలించినది. ఈ విధముగానే అద్దంకి కాపులు, కమ్మ సేనాపతులు, వెలమ వీరులు-మున్నగు రాజవంశముల శౌర్యమును తనివితీర వర్ణించినాడు. పై విధముగా ఎందుకు వర్ణించినాననగా? రాయప్రోలు ఏవిధముగా ఆనాటి వైభవమును వివరించినాడో తెలుపటానికే. దీనివల్ల ప్రయోజనమేమిటి? అన్నప్పుడు తమ ప్రాచీనులు కల్గివున్న శిరిసంపదలను ధైర్యమును ఆనాటి ప్రజలు కోల్పోయినారు. తిరిగి వాటిని పొందవలయునను కోరిక కల్గుటయే ప్రయోజనముగా చెప్పవచ్చును. దీనికొరకే అనేక ఉదాహరణములుగా పద్యములు వ్రాయబడినవి. మనిషికి ఒక్కసారి చెప్పినదానికంటే మూడు నాలుగుసార్లు వినిపించినచో ఉత్సుకత పెరిగే అవకాశముండును. ఎపుడును గడచిన చరిత్రలోని సంఘటనలు వర్తమానకాలమున జరుగు పనులకు ఆధారముండును. అందుకే కవి గత వైభవములోని శౌర్యము సిరిసంపదలు సంస్కృతులను స్మరించి వాటిని చూచైనా మీచరిత్రను సరిచేసుకోండి. ఉద్యమోన్ముఖులై విజయమును సాధించి వైభవములోనుండండి అని హెచ్చరించుచున్నాడు. ప్రస్తుత పరిస్థితికి ఇలా బాధపడతాడు.

పెనుజడల్ విరబోసికొని తాండవించాడు
ఈర్ష్యా పిశాచి నట్టింటిలోన
సవతిబిడ్డ విధాన నవయ తల్లి తెనుంగు
విశ్వ విద్యాలయ వీధులందు

ఇది ఆనాటి దుస్థితిని చక్కగా చూపుచున్నది. ఇంకా ఈనాటికిని సమాజములో ఈ పరిస్థితి కనబడుతుంది. సహజముగా కొందరి రచనలు కాలముతోనే కలసిపోగా మరికొందరివి కలకాలము సమన్వయింపబడుచుండును. ఇది రెండవదానికి ఉదాహరణముగా చెప్పవచ్చును. ఇంతటి దుస్థితిలోనైనా కూడ ఆశావాదియైన కవి "చావలేదాంధ్ర జన మహోజ్వల చరిత్ర, హృదయములు పిల్చి చదువుకో సదయులారా!" అంటాడు. తర్వాత భవిష్యత్కర్తవ్య బోధనను ఇలా చెప్తాడు.

జాతిన దేశ గర్వమును చక్కనదిద్ది మహాంధ్ర మండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి సమానరాష్ట్రముల్
కూరిమినాసజేయ తెనుగుం బుడమిన్ కయి సేయరయ్య దీ
ఖారతినాంధ్ర పుత్రులు జగజ్జనధర్మమె దృష్టి నిలుపుచున్

ఈ విధముగా ఒకవైపు ఆంధ్రాభిమానమును వివరించుచునే దేశ సమగ్రత కోరుచు దేశాభిమానమును పొందవలయునని బోధించెను.

ఏ దేశమేగినా ఎందు కాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరము

ఇది దేశభక్తినిగుర్చి వ్రాసిన సాహిత్యములోనే శ్రీరాయ మానమనదగినటువంటి 'జన్మభూమి' అన్న గేయములోనిది. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని ఇంతకుముందు చెప్పినను, వారెవ్వరు అందించని చైతన్యమును ఇందు అందించినాడు. ఇంత స్పష్టముగా సరళముగా మాతృభూమిపైగల మక్కువను అంతకు ముందెవ్వరును గానము చేయలేదు. ఇవి జాతీయమును తెలిపే గేయముగా చెప్పుటకు 'నీ తల్లి భూమి భారతి' 'నీ జాతి' అన్న పదములు ఉదాహరణములగుచున్నవి. ఇక్కడ భాషాపరముగా తెలుగువారందరు ఒకే రాష్ట్ర ప్రజలు కావలయుననియు, తర్వాత వారు దేశములో లీనము కావలయుననియు ఒకానొక ఐక్యతాభావన వెల్లడించినాడు.

ఇంకా 'తమ్ముడా' అను గేయములోకూడ జాతీయాభిమానమును వెల్లడించినాడు. ఇందు ఒక పద్యము చివర 'తమ్ముడా!' అనియు మరొక పద్యము చివర 'చెల్లెలా' అనియు సంబోధించుటవలన స్త్రీ పురుష భేదము లేకుండా అందరును నడుముకట్టి ఉద్యమములో నడువ వలయునని సూచించుచున్నాడు.

ఈ విధముగా 'ఆంధ్రావళి' లోని 'ఉగాదివందనము' 'ప్రబోధము' ప్రతిభాచక్రము, సాధుశోధన, 'గేయగుచ్ఛము' అన్నింటిలోను కవియొక్క దేశాభిమానము పొంగిపొరలినదనియే భావింపవలయును. కొందరు ఇది అనేక గేయపద్యముల సంకలనము 'ప్రబోధము' మాత్రమే ఉద్యమమును పర్తించినది అనుట కలదు. అది సరికాదనటానికి మనము ఉదాహరణములివ్వవచ్చును. 'ఉగాదివందనము'లో 'ధరింపుడీ! వినూతన వస్త్రములతోడ, దేశ సంవర్ధనాధీన దీక్ష' అనియు, 'ప్రతిభా చక్రములో' 'దౌర్భాగ్యభారత తంత్రతంతువులు తెంప, సౌభాగ్య భారత జాతకమ్ము రచింప' వచ్చినావా సర్వజనీమతల్లి అంటాడు. ఇవికూడ ఆనాటి పరిస్థితిని చూచి రాయప్రోలుగారు పలికినవేగాని వేరుకాదు. గేయగుచ్ఛములో చివరికి పతాకమునెగురవేయాలి అంటాడు. ఉద్యమములో విజయము సాధించినపుడేగదా ఎగిరేది జెండా. అందుకే ఇందలి కవితలన్నింటియందునుగల కవియొక్క అభిమానమును చూచి ఆనాటి ప్రజలు అభిమానాతిరేకమును పొందినారని చెప్పవచ్చును.

ఈవిధముగా రాయప్రోలుగారు సమకాలీన సమాజములో జరుగుచున్న స్వాతంత్ర్యోద్యమస్ఫూర్తిచే రచించిన తన రచనలద్వారా ఆంధ్ర ప్రజలకు పౌరుషమును కల్గించి ఉద్యమస్ఫూర్తి కల్గునట్లు సఫలీకృతుడైనాడనియే చెప్పవచ్చును.

యల్లంభట్ల నాగయ్య

# సకల విద్యాసనాథుని హంస

'మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్, కుండలీంద్రుండు తన్మహనీయస్థితి మూలమై నిలువ. శ్రీనాథుండు ప్రోవన్' బహుళాదరణ గాంచిన ఆంధ్ర సాహిత్య సీమలో...

"చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్న యౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్షనైషధ కావ్య మాంధ్ర భాష
ప్రౌఢి నిర్భరవయః పరిపాకమున గొని
యాడితి భీమ నాయకుని మహిమ

ప్రాయమింతకు మిగుల గైవ్రాలకుండ
గాశికా ఖండమను మహా గ్రంథమేను
దెనుగు జేసితి (న) కర్ణాట దేశ కటక
పద్మవనహేళి శ్రీనాథ భట్ట సుకవి"

పసిడి పంటలు పండించారు. అందులో నుత్తమోత్తమమైనదీ, ఆంధ్ర భాషా యోషకు కంఠాభరణము వంటిదీ, కవిబృందారకులకు మార్గ దర్శక మైనదీ శృంగార నైషధము! ప్రతి పద్యము గ్రుళిపేయ్యు నడకతో. సంస్కృత పద భూయిష్ఠమైన సమాసములతో రసనిష్యందమై కొంగ్రొత్త పోకడలతో విరాజిల్లుతుంది. ఈ ప్రబంధ మింత ప్రాశస్త్యాన్ని బొందడానికి కారణము దీనిపై సంస్కృత మూలమైన శ్రీహర్ష నైషధ ప్రభావమే!

ఇందులోని కథ సాధారణమైనదే! 'పువ్విలు కాని తోడ సరి పోలెడు చక్కని వాడైన' నిషధరాజేంద్రుండు ఉద్యాన వన విహారం చేస్తూ, శేష పుచ్ఛచ్ఛాయ చెలువారు బిసములతోను, నిండారవిరిసిన పుండరీక శ్రేణితోను, ప్రతిబింబి తోపాంత బహుల పాదపములతోను, నేకదేశంబున నిందీవరంబులతోను, దాల శైవాల వల్లరీ జాలకంబులతో నిండియున్న ఘన తటాకాన్ని' గాంచి ఆనంద కందళిత హృదయారవిందుడై యా తీర ప్రదేశంబున-

అథావలంబ్య క్షణమేక పాదికాం
తదా నిద్రాదుప పల్వలం ఖగః
స తిర్యగా వర్జిత కంధరః శిరః
పిధాయ పక్షేణ రతి క్లమాలసః

సంభోగ శ్రమతో నలసినదై. క్షణకాల మొంటి కాలిపై నిల్చి, మెడ వంచి, ఱెక్కలతో తలను గప్పుకొని నిద్రించుచున్న రాజహంసను చూస్తాడు. శ్రీనాథుడు–

"విలులిత జంబాల పులిన భాగమున ను
ద్దండ పద్మాత పత్రంబు నీడ
కమల కాండ కఠోర కంటకాంకురపఙ్క్తి
నొయ్యన గంధరం బొరసి కొనుచు
నొంటి కాలనె నిల్చి యూర్మిమారుతముల
జిగురు ఱెక్కల ఱేకు లెగయుచుండ
విరళమై పక్షతి ద్వితయంబు వెడజాఱ
జంచు లోకించు కాకుంచి తముగ" ని హంసను

మన కనులముందు సాక్షాత్కరింప జేస్తాడు. మూలంలోని హంస 'రతిక్లమాలసయై' నిద్రిస్తుంటే, శ్రీనాథుడా పదాలను విడిచి వేయడంలో ఔచిత్యమెంతో వుంది. అదేమంటే మున్ముందు హంస తనను గూర్చి...

మదేకపుత్రా జననీ జరాతురా
నవ ప్రసూతిర్వరటా తపస్వినీ
గతి స్తయోరేష జన స్త మర్దయ
న్నహో! విధే! త్వాం కరుణారుణద్ధినో॥

తల్లికి నేనొక్కడనే పుత్రుడను. ఆమె ముసలిది. ఇల్లాలు నవప్రసూతి. ఇట్టి నన్ను పీడింతువా దైవమా? అని విచారిస్తుంది.

నలుడుచే పట్టిన హంస 'రతి క్లమాలస'యై యున్నది; భార్య బచ్చి బాలెంతరాలు. నవ ప్రసూతితో రతి సలుపుట లోక విరుద్ధము! పక్షులుగదాయని సరిపెట్టుకొందమన్ననూ గ్రుడ్లను పొదిగి పిల్లల సంరక్షణ భారాన్ని నిర్వహిస్తున్న తల్లికి సంభోగేచ్ఛ కలుగదు. అటువంటి వారితో నెవరూ సంభోగ సుఖాన్ని ఆశింపరు. అది జరగని పని! ప్రసూతి మాత్రమే కాదు, పైగా 'నవప్రసూతి'! ఇక నలమహారాజు పట్టిన హంసము పరకాంతతో రతి సల్పియే యుండవలెను. "విరించి వదన కమల వినిర్గత వివిధ శాస్త్ర వాసనా పూర్ణ కర్ణుండనైన యేను సామాన్యుండనే?" యన్నవాడు; "వేద శాస్త్రపురాణాది విద్యల్లెల్ల తరుణి నీయాన ఘంటా పథంబుమాకె"న్నవాడు. కమలా రసనుని రథరథ్యంబులు శ్రమంబునన్ డీలు పడియున్నం జూచి యేను క్షీమాన దండంబు కంఠంబున ధరియించి విరించి చేతం బారి తోషికంబు వడసితి, నేను దివ్య తిర్యగ్జాతి నన్నవాడు; పరస్త్రీ సంగమాన్నాశించడంలో కూడా అర్థంలేదు. పై రెంటికీ మైత్రి పొసగలేదు; పరస్పర విరోధం కన్పిస్తుంది. ఈ సమస్యకు పరిష్కారంగా శ్రీనాథుడు, మొదటి శ్లోకంలోని 'రతిక్లమాలస'ను. రెండవ శ్లోకంలోని 'నవప్రసూతి'ని విడిచి—

తల్లి మదేక పుత్రక పెద్ద కన్నులు
గాన విప్పుడు మూడు కాళ్ళ ముసలి
యిల్లాలు గడు సాధ్వి నేమియు నెఱుగదు
పరమ పాతివ్రత్య భవ్య చరిత అంటాడు.

ఎంతైనా సకల విద్యాసనాథుడు గదా!

నైషధుని చేతిలోని హంస—

తదాత్త మాత్మాన మవేత్య సంభ్రమాత్
పునః పునః ప్రాయసదుత్ప్లవ వాయసః
గతో విరుత్యోడ్డయనే నిరాశ తాం
కరౌ నిరుద్ధుర్దశతి స్మ కేవలమ్॥ ను

"ఇట్లు నిషధరాజు చేతం బట్టువడి బిట్టు మేల్కాంచి యక్కాంచన హంసంబు కంచు గీచిన తెఱంగున నెలుంగించుచు, నెగయ నుంకించుచు జంచు పుటంబునం బాణి పల్లవంబులు గఱచుచు, నెద్దియుం జేయునది లేక చీకాకు పడుట'ను అతి సహజంగా చిత్రిస్తారు.

తరువాత హంస నైషధేంద్రుని నిందిస్తూ–

"ఎఱుగనె నిన్ను ప్రాంతమున నింతట యింత యే
మఱుదునే? నిన్ను విశ్వ జన మాన్యుడ వంచెద విశ్వసించి యు
త్తటి సుఖ నిద్ర బొందితి వృథామతి; నెట్టన యాత్మ నమ్మినన్
జెఱుప దలంతురే ఘనులు చిత్తమునన్ బగవారి నేనియున్?

'ఫల కుసుమ మూల మాత్రంబున శరీరయాత్ర నడపుచు మునులం బోలె సలిలంబుల లోనం దపంబు సేయుచున్నవారము. మా మీద దండ నీతిం బ్రయోగింప నీకుం దగునే?' యని తల్లి, పుత్ర మిత్ర కళత్రములను వేర్వేర తలంచుకొని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేడి కన్నీరు వెడల గ్రోలు గోలున నేడ్చినం, కృపాళుండై యా భూపాలుండు హస్త పల్లవంబుల వదలి 'రాజ హంసంబ పొమ్ము సుఖంబుండు'మని విడిచి పుచ్చిన

'అధి గత్య జగత్య ధీశ్వరాద థ
ముక్తిం పురుషోత్తమాత్తతః

వచసా మపి గో చరో నయః
సతమానంద మవిందత ద్విజః ॥

అట్లు పురుషో_త్త ముం_డైన యతనివలన
ము_క్తి గాంచిన యా ద్విజ ముఖ్యు డెలమి
డెందమునకును వాక్కు_న లందరాని
యధిక తరమైన యానంద మనుభవించె"

మూలంలోని శ్లేషభావమెంతో నైపుణ్యంగా యిమిడి పోయింది.

నలునిచేత బంధింపబడిన హంస ఆతని ననేక ప్రకారముల నిందించి, స్వేచ్ఛబొందినపిదప "దేవా! యవధరింపుము. ధర్మశాస్త్ర మర్మపారగులైన పెద్దలు - స్వకుల జిఘాంసువులైన ఋషంబులను, నిజనీడ ద్రుమపీడాకరంబులైన నీడజంబులను, ననవధ్యతృణహింసా నృశంసంబులగు మృగంబులును, మృగయావినోదంబుల వధించి మహా ధవుండు కిల్బిషంబునంబొందండని చెప్పుదుర'ని రాజనీతిని తిరిగి ప్రభోధిస్తుంది. దీనినిబట్టి చూస్తే...

ఎప్పటికయ్యెది ప్రస్తుత
మప్పటికామాటలాడి యన్యుల మనమున్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక 'తిరుగువాడు ధన్యుడ'న్న సిద్ధాంతానికి సరి పోతుంది హంస నడవడిక! రాజుకు ప్రత్యుపకారము చేయ ంచి దమ యంతీ సౌందర్యాన్ని నఖశిఖపర్యంతమూ హృదయంగమంగా వర్ణిస్తూ, వివరిస్తూ——

సరసీః పరిశీలితుం మయా
గమికర్మీకృతనైక నీవృతా
అతిధి త్వమనాయి సాధ్రుశో
స్పదసత్వంశయ గోచరోదరీ॥

కమలేందీవరషండ మండిత లసత్కాసార సేవారతిన్
గమికర్మీకృతనైక నీవృతుడనై కంటిన్ విధర్భంబునన్
రమణిన్ పల్లవపాణి పద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీనస్తని నస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్

అని లయబద్ధంగా వివరించి తుదకు...

అనయామర కామ్యమాన యా
సహయోగస్సులభస్తు నత్వయా
ఘన సంవృతయాం బుధాగమే
కుముదేనేవ నిశాకర త్విషా॥ ఆధారంగా

సౌరభములేని యట్టి పుష్పంబువోలె
గండుకోయిల వెలియైన కానవోలె
నధిప దమయంతి తోడి సఖ్యంబులేని
నీదుసౌందర్య విభవంబు నిష్ఫలంబ' ని అంటూ విధిస్తుంది వెంటనే రాజు...

శత శశ్వతిమాగతై వసా
త్రిజగన్మోహ మహోషధిర్మమ
అధునా తప శంసి తేన తు
స్వదృశై వాభి తామ వై మితామ్॥

'త్రిజగన్మోహ మహౌషధీ లతిక ధాత్రీపాల కన్యావరో
ధజనో_త్తం సమణి ప్రరోహమగునా తన్వంగి వేమారునుం
ప్రజలెల్లన్ వినుతింప విందు మొదలన్ పక్షీంద్ర ! యూహింపన
క్కజమీవిప్పుడు ప్రస్తుతింపనది సాక్షాత్కారముంబొందెడిన్'

అని తన మనోరథాన్ని విన్నవించి "ధీరంబులేని విరహభార పారా వారంబున మునుగం బాఱుచున్న నాకుందెప్పగా విరించి నిన్ను గల్పించినాడు...పొమ్ము కార్యంబు సాధింపుము, పునస్సమాగమగం బయ్యెడు'నని వీడుకొల్ప' నదియునుం 'ప్రార్ధనాసిద్ధి సూచకంబులగు ననుకూల గంధవాహాది నానావిధ శుభ నిమిత్తంబులను సంధించుచు ప్రయాణమౌతుంది. మూలంలో నీళ్ళతో నిండిన కుండ, చూతఫలము, పర్వతము శుభశకునములుగాగ; శ్రీనాధుని హంసకు అనుకూల గంధ వాహుడే ముఖ్యమైన శుభసూచకమయ్యాడు. పక్షులకు ప్రయాణపు దిక్కుగా గాలి వీచుటే శుభప్రదముగాని, క్రిందనున్నవాటితో నంత ప్రయోజనమేమి?

కుండిన నగరంబు 'గలయం గనుంగొని పతంగపుంగవుండు కన్యాంతఃపుర ప్రదేశమున నొక్క శృంగారవనంబులోన' చెలికత్తెలచే పరివేష్టింపబడియున్న దమయంతిని దిలకించి 'దుందుభి వాద్య నిస్వ నముతో తులతూగెడు పక్షనాదము'తో ప్రవాలుతుంది. తనను పట్ట దలంచిన ప్రగాఢవాంఛ రాకుమారికి గలదని వూహించిన అండజంబా మెను చెలికత్తెలకు దూరంగా గొంపోయి——

వృధాఽర్పయంతీ మపథేపదం త్వాం
మరుల్లల త్పల్లవ పాణికంపైః
ఆలీవ పశ్య ప్రతిషేధ తీయం
కపోత హుంకార గిరా వనాళీః ॥

ఆలియుబోలె నిస్వనదు వనాళియ మార్గమునన్ జరించుని
న్నోీ లలితాంగి కాదనుచున్నది మంద సమీరణంబునన్

గ్రాలు ప్రవాళ మంజరులు గ్రమకరంబుల విభ్రమంబుగా
బాలరసాల పుష్పరసపాయి వనప్రియ కంఠహుంకృతిన్''

అని మందలించి తన ప్రాభవాన్ని—

"నలిన సంభవు సాహిణము వారు వంబులు
కులము సాములు మాకు కువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబులు తూండ్లు
భోజనంబులు మాకు పువ్వుబోడి
సత్యలోకముదాక సకల లోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులె యోగ్యులనుపమాంగి
భారతీదేవి ముంజేతి పలుకు జిలుక
సమద గజయాన స్వబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
తరుణి నీయాన ఘంటాపదంబుమాక'ని చాటుతుంది.

సకల విద్యాసనాధుని యీ హంస పలుకులే ముమ్మందు ఆంధ్ర కవితా పితామహుని ముద్దుబిడ్డ పరూధిని నోట ప్రతిధ్వనించబడతాయి.

నిషధ భూరమణునికడ తనకు గల చనువును చెపుతూ శ్రీహర్షుని హంస—

సువర్ణ శైలాదవతీర్యతూర్ణం
స్వర్వాహినీ వారి కణావకీర్ణైః
తం వీజయామః స్మర కేళికాలే
పక్షైర్నృపంచామరబద్ధ సఖ్యైః॥

నలుడు నవయవ్వనంలో నున్నాడు. బ్రహ్మచారి. స్మరకేళి కాలంలో నతనికి వీచడం సమంజసంగాదు. అంతటి బ్రతిభావంతుడు, 'నిఖిల విద్యానటీ నృత్య రంగస్థలాయతనాయమాన జిహ్వాంచలుండు, విద్యలు పదునాలుగింటికి జతుర్దశ్వమొనరించిన'వాడైన నలునిపై పరస్త్రీ సాంగత్యాపనింద మోపడం నింద్యమని శ్రీనాథుని హంస—

కనకశైలంబు డిగ్గి యాకాశ సింధు
సలిలముల దోగి మిగులంగ జల్లనైన
చారుహాటకమయ గరుచ్చామరముల
వీతునతనికి వైశాఖ వేళలందు

'స్మరకేళికాలాన్ని' 'వైశాఖవేళ' గా మార్చి తన అశేష ప్రతిభా పాటవాలను, లోకజ్ఞ కాదృష్టిని ఋజువుచేసుకుంది.

విధిం వధూ సృష్టి మపృచ్ఛమేవ
తద్యానయుగ్యోనలికేళి యోగ్యామ్
త్వన్నామ వర్ణాయివ కర్ణపీతా
మయాస్య సంక్రీడతి చక్ర చక్రే॥

అడిగితినొక్కనాడు కమలాసను తేరికి వారువంబనై
నడచుచు నుర్విలో నిషధనాథుని కెవ్వతె యొక్కొ భార్యయ
య్యెడునని; చక్ర ఘోషమున నించుక యించుకగాని యంతయే
ర్పడ విననైతి నీవనుచు బల్కిన చందముతోచెమానినీ'' అని

విధి నిర్ణయాన్నికూడా విన్నవిస్తుంది. దమయంతి తన తప్పుకు సిగ్గుపడి, క్షమాపణవేడి, హంస ప్రాభవాన్ని కొనియాడి, చివరకు మనసులోని మాటను బయటపెడుతుంది. దమయంతిని నల వశంవదగా నెంచియూ, 'బాలికల చిత్తములంబు తరంగలోలములని' సంశయిస్తుంది; ఆమెనోట నింకేమివస్తుందోనని, ఫలితంగా 'మనమున లోకపాలురెనమంద్రడను మెచ్చ. దృణీకరింతు దక్కిన సురకోటి, రాసుతులు గీడ్పడజూచుట చెప్పనేటిక'ని శపథంజేసి దమయంతి; తన యవస్థను నైషధుడు ప్రసన్నముగా, ప్రశాంతముగా, నొంటరిగా, ననుకూలముగానున్న సమయంజూసి వివరించమని మరెన్నోరీతులజెప్ప తుదకు హంస "నన్ను వీడుకొల్పు. పోయివచ్చెద' నని గగనమార్గంబున నిషధాధిప రాజధానికిబోయి, సహస్ర నయనాలతో తన రాకకై నిరీక్షిస్తున్న రాజుకు వృత్తాంతాన్నివివరించనతండును ముదితస్వాంతుండై

'ఏమేమీయని విన్నమాటయె వినున్ వీక్షించు నెమ్మోము సాం
ద్రామోదంబున బక్షముల్ నివురు హస్తాంభోజ యుగ్మంబునన్
భామారత్నము రూపసంపద తగన్ భావించు నానంద మా
ధ్వీమత్తుండయి చొక్కు చిత్తమున పృథ్వీనాయకుం డెంతయున్

అంతా గమనించిన హంస "కార్యంబు సంఘటితంబయ్యె. నింక నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయంబోవలయునని పలికి యాతనిచేత సముచితప్రకారంబుల వీడుకోలు వడసి బ్రహ్మలోకంబునకు జనియె.'' సరసత్వంబు, నిగూఢ కార్యఘటనా చాతుర్యసంపత్తి, పురుషార్థైక పరాయణత్వము, అభ్యుత్థాన లీలాధురంధరతాప్రౌఢి, కృతజ్ఞత, వాత్సల్యంబు సద్భావములతో సరసీ జానన వాహనాన్వయవతంసంబైన హంస నెఱపిన నయధౌరంధర్యము; నలదమయంతుల కల్యాణ కారణమై ధర శాశ్వతముగా నిలచిపోయినది.

శ్రీ బాపిశెట్టి వేంకట రమణమూర్తి

# రాయలసీమ జానపద నృత్య కళారీతులు

రాయలసీమ జానపదగేయాలకు పుట్టిల్లు. ప్రాచీనతామ్రుదల్ని పదిలంగా దాచుకొన్న ఈ సీమలోని జానపదగేయ సంపద విలక్షణంగా కనిపిస్తుంది. జానపదగేయానికి సంగీతం, నృత్యం అనివార్యంగా ఉంటాయి. అయినా నృత్యానికి ప్రత్యేకించి గేయాలున్నాయి. వీటినే నృత్యగేయాలనవచ్చు.

జానపదుల నృత్యం భరతనాట్య శాస్త్రోద్దిష్ట మార్గాలలో ఎలా సంవదిస్తుందో చెప్పటం కష్టమే అయినా దేశీయతాముద్ర కనిపించే కళారూపం జానపదనృత్యం. వీటిలో నృత్తలక్షణాలే అధికం.[1]

రాయలసీమలోని కొన్ని నృత్య(త్త) రీతుల్ని సేకరించటం జరిగింది. ఇవి వరుసగా

1. ఆసాదివాండ్ల నృత్యం
2. పండరి భజన
3. కోలాటం
4. స్త్రీల కోలాటం
5. లంబాడి నృత్యం
6. ఉరుముల నృత్యం
7. కుంచెల నృత్యం
8. బయిలాట
9. చెంచునాటికం
10. కీలుగుఱ్ఱం
11. తప్పెటనృత్యం
12. మదిలీ
13. డప్పులనృత్యం
14. గంగెద్దులాట
15. బొమ్మలాట
16 తోలుబొమ్మలాట
17. బుడబుక్కలాట
18. గుర్రబయ్యాల నృత్యం

పై నృత్తాలలో మూడు మాత్రమే ఈ వ్యాసంలో చర్చింపబడతాయి.

## 1. ఆసాదివాండ్ల నృత్యం

ఆసాదివాళ్ళు[2] హీనజాతిగా చిత్రీకరింపబడ్డారు. మాదిగజాతిలో ఒక తెగ. వీరిని హీనజాతిగా చిత్రీకరించినా అగ్రకులంలో లేని ఆచారాలు, దైవభక్తి వీరికున్నాయి. ఈ నృత్యం వీరి వంశంలో ఒకరికి అబ్బుతోంది. వీరు ఈ నృత్యాన్ని గ్రామాల్లో వర్షాలు రానప్పుడు 'అమ్మవారు' సోకినప్పుడు[3] గ్రామీణులు ఏర్పాటు చేస్తున్నారు. వీరి దేవత 'పెద్దమ్మసామి' ఈ దేవత 'కాపు'లున్నారు. వీరు నృత్యాన్ని ఏడాదికొకసారి చేసితీరాల్సిందే. అదికూడా 'ఉగాది' పండుగ మరుసటి రోజు మా స్వగ్రామంలో[4] చేస్తున్నారు.

ఈ నృత్యంలో త్రిమూర్తులవలె ముగ్గురుంటారు. వీరందరిపద్ద వాయిద్యాలుంటాయి. ప్రధానగాయకుడు పాట పాడితే తక్కిన ఇద్దరూ వంత పాడుతారు. వీరి వాయిద్యాన్ని 'జనికెన' అంటారు. దీన్ని కంచుతో చేసి ఉంటారు. జనికెల్ని వాయించుకొంటూ నృత్యంచేస్తారు.

ప్రధాన గాయకుడు పాట పాడేటప్పుడు వలయాకారంగా తిరుగుతూ వెనక్కు ముందుకు అడుగులు వేస్తూ వంగుతూ లేస్తూ చేతుల నాడిస్తూ కాళ్ళగజ్జెల నాదంతో నృత్యం చేస్తారు. ఇంత చేస్తున్నా వాయిద్యం మ్రోగుతూనే ఉంటుంది. వంతపాటగాళ్ళు అతన్ని అనుసరిస్తుంటారు. ప్రధాన గాయకుడు చేతిని గాలిలో ఊపుతూ ఇంకొకసారి వ్రేలిని చెవిలో పెట్టుకొంటూ లయాన్వితంగా రాగం తీస్తుంటాడు. ఇంకా పాదాలు పైకెత్తి, మునివ్రేళ్ళమీద పెనవేసుకొని నిలబడి తిరుగుతూ, మోకాళ్ళపై కూర్చొని నేలమీద అరచేత్తో కొడుతూ పెద్దమ్మ సామికి మొక్కుతాడు. ఈ విధంగా పండుగ మరుసటిదినం మ్యాసం చేస్తారు.

వీళ్ళు నృత్యం చేస్తూ కొన్ని 'మేలుకొలుపు' పాటలు పాడి తర్వాత కొన్ని కథాగేయాలు పాడతారు. కథాగేయాల్లో పెద్దమ్మసామి కథ, చల్లాపురమ్మకథ, యల్లమ్మకథ మొ॥ వీళ్ళకు గ్రామాల్లో 'దేవర' (జాతర) జరిపినప్పుడు ఎక్కువపని ఉంటుంది. పెద్దమ్మ దేవతకు ప్రీతిపాత్రులుగా వీరే చెప్పుకొంటారు. ఒకసారి ఆ స్వామి ప్రత్యక్షమై 'నా శరీరంలోని అవయవాల్నిగూర్చి పాడి ఆడి ఎగిరి గంతులు వేయండి' అని చెప్పిందట. అందుకు వీరు ఆ దేవత నిఖశిఖ పర్యంతం వర్ణిస్తూ గేయాలు పాడారు. వాటిని 'పొలిపదాలు' అని అన్నారు. ఇవి చాలా అసభ్యంగా ఉన్నందున ఉదహరించలేదు. ఇక్కడ మనం ఆలోచిస్తే ప్రబంధయుగంలో స్త్రీని అంగాంగ వర్ణన చేయటం లక్షణం. అది జానపదులు ఎపుడో చేశారనవచ్చు. ఇలాంటి ప్రతి విషయం చర్చిస్తే జానపద సాహిత్యంలో కన్పిస్తుంది.

మొదటిగా పెద్దమ్మసామికి పూజ ఏ విధంగా చేస్తారో తెలిపే గేయం——

'పూజచేత్తాము రారోయమ్మ పెద్దమ్మతల్లికి ॥పూజ॥
పూజచేత్తాము రారో పున్నిమంతులు మీరు
మల్లెపూవలు తెచ్చి మనసార చల్లుదాము
బాగుగా బలి పిల్లలు గొట్టి కర్మపోతు[5]లను కడగాగొట్టి
ఆసాదివాండ్ల ఆటలాడమని ॥పూజ॥
సన్నమేలములు సందడి చెయమని సకియలారో
మనము పెద్దమ్మసామికి పూజ చేత్తాము రారోయమ్మ'

అనిపాడుతూ 'గుడి' దగ్గరకి గేయంలో కనిపించే సామాగ్రితో వస్తారు. ఈ సామాగ్రి 'జాతర' జరిపేటప్పుడు ఉపయోగించేవి. ఇంకా బోనం, టెంకాయ, కొత్తచీర, రవిక, బండారు ఆకులు వక్కలు మొ॥ వస్తువులన్నీ తెస్తారు. గుడిదగ్గర కుమ్మరివాళ్ళు పూజ చేస్తుంటారు. పూజ చేస్తుండగా ఆసాదివాండ్లు కొన్ని మేలుకొలుపుగేయాలు ఆడుతూ పాడుతారు. అలాంటి గేయమొకటి——

మేలుకొనవమ్మ తల్లి మేలుకొనవమ్మ
కాపులు వచ్చెరు పూజలు చేసెరు మేలుకొనవమ్మ
నీ మాయవ్వరు కానలేరుగా మేలుకొనవమ్మ
నిజారూపుల తల్లివే మేలుకొనవమ్మ
కోరి కొలిసెన కాపులాకునమ్మ మేలుకొనవమ్మ
కొడుకు సంపాదనాలిచ్చినావు మేలుకొనవమ్మ
నీ మాయెవ్వరు కానలేరుగా మేలుకొనవమ్మ
నిజారూపుల తల్లివే మేలుకొనవమ్మ
అగ్గరగండవాద[6] దేవతవు మేలుకొనవమ్మ
అనుమల భూమిరెడ్డివారింట్లో పాదబద్దువై నిలుసున్నావే
గోస్తుగ గోనవారికేనమ్మ ముద్దుకోడలైతివమ్మ'

పైవిధంగా స్వామిని మేల్కొలిపి ఈమె మహత్యాన్నిగూర్చి 'అమ్మవారు' పిల్లలకు ఏవిధంగా పోసి బాధపెడుతుందో తెలిపేగేయం.

అదికాదు ఆనందమమ్మ అన్నిరూపుల తల్లివమ్మ
అన్నిరూవుల తల్లివమ్మ నీవు దేశారూపుల తల్లివి
దేశారూపుల తల్లివి నీవు దేవతురాలవు నీవే
దేవతురాలవు నీవే నీలవరనాలి నీవేనమ్మ
నీలవరనాలి నీవేను నేరడిబ్బల మారివి నీవేను
అద్దము తీచిన నిద్దురపొద్దున యిల్లుచేరి సోదించేవమ్మ[7]
సినసిన బాలలు పట్టేవమ్మ సిన్నగ బొబ్బలు పెట్టేవు
పులికాయలాల[8] పుండులుపోస్తి కడుపుల మంటలు పెట్టేవు
చెట్లపాలు నీవు తాగేవు సోలిసోలి నువు ఆడేవు
ఏదమ్మ నీ వరము ఏదమ్మ నీ మూలము
మూర్తిగల్ల పెద్దమ్మ ముందర పూజలు నీకు గక్కున
పూజలు నీకు'

ఇలా కొన్ని గేయాలు పాడిన తరువాత కథాగేయాలు పాడి చిట్టచివరగా మంగళం పాట పాడుతారు.

జయజయ మంగళం రామ సుబ మంగళం
పుట్టలోనే పుట్టి పుట్టలోనే పెరిగి పుట్టలో పట్టుచీర మరగట్టి
రకతవన్నెల వడిబాలుకట్టుకోని తరలొచ్చె సీతమ్మ తలవాలుకు ॥జయ॥

తెల్లచీరగట్టి తెల్లరవిక తొడిగి తెల్లటాకులకట్ట చేతబట్టి
తనుకు తనుకు మెరిసేటి తనుకు పాపిటిబొట్టు
తగునమ్మ మేటికోర్ల పెద్దమ్మకు ॥జయ॥
పచ్చచీరగట్టి పచ్చరవికా తొడిగి పయ్యెల్ల బండారుబొట్టుపెట్టి
అంగతుల సెలరేగె ఆవునెయ్యిపోసి ఆకాశదరినమ్మ నీకారతి ॥జయ॥

యిరపొచ్చి బల్లారి యిదు రాయదుర్గము అంచనా గూడూరి ఆనెగొంది

ముద్దుజగడముకాడ ముద్దుచౌడమ్మ ముద్దుపెద్దమ్మ
తమ్ముడు పోతరాజు చెల్లిలి నల్లాలమ్మ నీకారతి ॥జయ॥

పైగేయంలోని సీతారాముల ప్రసక్తి ఆసాదివారి సంస్కృతిలో వచ్చిన పురాణ ప్రభావానికి నిదర్శనం.

ఈ నృత్యగాండ్లకు ఆదరణ లేదు. గ్రామంలో గ్రామాధికారి దయాభిక్షపైన ఆధారపడిఉంటుంది. వీళ్ళు ఈ నృత్యాన్ని మానుకొని 'కూలీనాలీ' చేసుకొంటూ పొట్టగడుపుకొంటున్నారు. ఒకవేళ 'కథ' చెప్పేరోజుల్లో, కథ చెప్పిన మరుసటిరోజు గ్రామంలో ప్రతియింటా అడుక్కోవాలి. అంతకుమించి వీరికి ఏవిధమైన సహాయం లభించదు. కథచెప్పే సమయంలో డబ్బు ఎవ్వరు ఇవ్వరు ఒకవేళ ఇచ్చినా వారి వంశస్థుల్ని పొగిడించటానికికానూ రూపాయిలోపుగా ఇస్తారు. వీరు ఈ నృత్యాన్ని మానుకోకుండా ఉండాలంటే వీరికి ఏ సంస్థలైనా, ప్రభుత్వమైనా తగిన ఆదరణిస్తే వీరు, వీరి నృత్యం అడుగంటకుండా ఉంటుంది.

## 2. పండరి భజన

పండరిపురంలోని పాండురంగడ్ని స్మరిస్తూ నృత్యం చేస్తూ ఆలపించే గేయాలు 'పండరి భజన గేయాలు'గా పేరుపొందాయి. 'భజన'

అంటే కేవలం తాళం మద్దెలతో కూడుకొన్న పాట అనే అర్థంకానీ పండరి భజనలో 'నృత్యం' కూడా ఉంటుంది. ఈ నృత్యాన్ని ప్రతి పండుగ, ఉత్సవ సందర్భాల్లో జరిపిస్తున్నారు. దీన్ని సుమారు 9, 10 సంవత్సరాలున్న బాల బాలికలచేత చేయిస్తారు. వీరు నృత్యం చేస్తున్నంతసేపూ చూచేవారు కళ్ళప్పగించి చూడాల్సిందే. నృత్యాన్ని నేర్పే గురువుకు పొట్ట పోసుకోవడానికి సహాయం చేస్తుంటారు యీ బాల బాలికలు. గురువు పిల్లల్ని సుమారు '20' మందిని మాత్రం ఎన్నుకొని, వీరితో ఒక్కొక్కరికి కొంత ధనం, ధాన్యాన్ని నెలకింత ఇప్పించుకొంటూ పొట్ట పోసుకొంటాడు. నృత్యం నేర్పే మూడు నెలల్లో మాత్రమే ఇతనికి సహాయం లభిస్తుంది. తర్వాత పల్లెపల్లె తిరుగుతూ ఉండాల్సిందే. ప్రత్యేకమైన ఆహ్వానముండదు. శిక్షణ పూర్తి అయిన వెంటనే 'పండగ రోజు' పిల్లలందరికీ ఒకేరకమైన బట్టల్ని, గజ్జెల్ని చేతికి పసుపు పచ్చని జెండాను తీసుకొని రమ్మని ముందుగానే చెపుతాడు.

గురువు పిల్లలందర్ని ఎక్కడెక్కడ నిలబెట్టాలో అక్కడ గుండ్రాకారంగా నిలబెట్టి తర్వాత అందరూ సిద్ధంగా జెండాను చేత పట్టుకొని ఇంకో చేతిని నడుముపై పెట్టుకొని నిశ్శబ్దంగా ఉంటారు. గురువు 'తాళాలు' చేతపట్టుకొని ఇష్టదైవాన్ని మనసులో తలచుకొని అతనికి మొదట ఈ నృత్యాన్ని నేర్పిన గురువుకు ప్రణమిల్లి ఒక్కొక్క దేవుని పేరు గురువు చెబుతుంటే పిల్లలందరూ ఒక్కసారి "జై" అంటారు. అలా అన్నపుడు జెండా చేతిని పైకెత్తి దించుతారు.

తర్వాత భజన నృత్యం ప్రారంభమవుతుంది. గురువు తాళం వేసే తీరు ఆయన చూపించే భంగిమ మీద శిష్యులు నిమగ్నులై ఉంటారు. మొదట 'గణేశ్వర స్తుతి' ఉంటుంది. అప్పుడందరూ ఎవరి స్థలంలో వాళ్ళు ఉంటూనే గేయంలోని చరణం గురువు పాడుతాడు పిల్లలందరూ వంత పాడుతారు. ఆ పాట పాడేటపుడు చేతిలోని జెండాను అందరూ ఒక్కసారిగా కదిలిస్తారు. నడుంమీదుండే చేతిని ఒక్కసారిగా కదిలిస్తారు. కాళ్ళను పైకెత్తి 'మడిమ'లు ఒక్కసారిగా అందరూ నేల మీద కొడతారు. అపుడు కాలి గజ్జెలు ఒక్కసారిగా సిసదిస్తాయి. అపుడే అందరూ నడుం కొంచెంగా కదిలించి వంచుతారు. ఇట్లు ఒక్కొక్కసారి ఒక్కొక్క కాలిని నేలమీద కొడతారు.

## గణేశ విస్తుతి

శరను శరను యినాయక మా శరను సేకొను నాయక
స్థిరముగా మిము వేడితి మిక కరునించుమో గననాయక
యెల్ల 'యిద్ది'[9]ల కెల్ల గురువని ఆశ్రయించితి నాయక
సల్లగా మామీద కృపయగ జల్లుమో గననాయక
యెలుక హాకన[10] మెక్కి భువనములు యేలుచుంటి వినాయక
కలుసములు యెదబాపు దొరవని పలికితి[11]మి గననాయక
బత్తుం[12]ను బ్రోసె దొరవని పలికితిమి గననాయక
దరినిలో నారాయనుని దరిచేర్చుమో గననాయక

ప్రతి గేయాన్ని గురువు పాడుతూ గేయంలోని భావానికి అనుగుణంగా నృత్యం పిల్లలకు అందిస్తాడు. వెంటనే వారి మధ్యనే తిరుగుతూ గేయాన్ని పాడుతూ తాళంవేస్తూ ఉంటాడు. పిల్లలు అదే విధంగా చేస్తారు. కొన్ని గేయాలు బిర బిరా సాగుతాయి. నృత్యం కూడా అదే విధంగా సాగుతుంది. అపుడందరూ ఒకే భంగిమలో మన కళ్ళను కట్టినట్లు కనిపిస్తారు.

ప్రతి గేయం పాడిన వెంటనే కొద్దిసేపు విరామ ముంటుంది. గేయం నిలపడానికి ముందుగా లయాత్మకమైన మాటలుంటాయి. అపుడు కొంచెం బిర బిరా నాట్యం చేస్తూ తాళం మాత్రమే కొడుతూ ఉంటాడు. గురువు కొన్ని మాటలు ఆలపించగా చివరి మాటల్ని వంత పాడుతారు.

| గురువు | | పిల్లలు |
|---|---|---|
| విట్టల్ విట్టల్ | - | జై జై విట్టల్ |
| పాండురంగ విట్టల్ | - | పండరినాథ విట్టల్ |
| గోవిందమ్ | - | భజ గోవిందమ్ |
| ఆనందమ్ | - | బ్రహ్మానందమ్ |

అని పాడిన వెంటనే గురువు మాత్రం మూడు సార్లు హరి–హరి–హరి అని అంటాడు. పిల్లలు తమ కుడి కాలి వేళ్ళను ఎడమ కాలిని దాటవేస్తే నేలమీద కొట్టి, రెండవసారి 'హరి' అన్నప్పుడుకొడుతూ నిశ్శబ్దంగా ఉంటారు. ఇలా జరిగేటపుడు పిల్లలు అందరూ కాలి, చేతిని ఒక్కోసారి బిర బిరా నేలమీద కొట్టటం త్రిప్పటం, జెండాను చేతితో వీలున్నంతపైకి ఎత్తుతూ దింపటం జరుగుతుంది. మరలా గేయం అయిపోయే తక్షణం గురువు తాళం ఒక విధమైన 'గతి' తో కొడతాడు. వెంటనే అందరూ ఆ 'హరి - హరి - హరి' మాటలవల్ల అడుగు వేస్తూ అందరూ ఎవరిస్థానంలో వాళ్ళు నిశ్చలంగా నిలబడతారు.

## కొన్ని రకాల గేయాలు

1. పాహిరారా రంగ పాహిరారా రంగ
పండరిపురము విడచి వేగరావయ్యా 'రంగ'

... ... ... ...

2. 'పురముచూడండీ రంగని క్షేత్రము చూడండి 'రంగ'
పావనమైన చంద్ర భాగతీరము చూడండి 'రంగ'
... ... ... ...

3. గొల్ల వారి నల్ల సామిగా గోపాలకిట్నా యిల్లుయిల్లుతిరగవాకుమా
గొల్ల భామలంతగూడి చల్లనమ్మేను వారు పోతే దారికడ్డము
... ... ... ... పోకురా

4. పుండరీకుడు పట్టియాడిన పండరి జెండా
బూమండలమంత నిండియున్నది రంగని జెండా
అది పసుపుజెండ పుండరీకుడు పట్టియాడిన జెండా
గోరపాపములకు గొడ్డలి జెండా
కామ క్రోద లోబములకు కడ్గమె జెండా

## 3. కోలాటం

కోలాటం జానపదుల వినోదాల్లో ఒకటి. ఇది ఆంధ్రదేశంలో అన్నిచోట్లా ఉంది. చూడముచ్చటగాసాగే ఈ నృత్యంలోని పాటలన్నీ మరుపరానివి. దీన్ని 'పాల్కురికి సోమనాథుడు 'కోలాటగొదమ' మన్నాడు. అన్నమయ్య కీర్తనల్లో కూడా కోలాటగేయాలున్నాయి. హంపీలో ఇప్పటికీ కోలాట భంగిమలున్నాయి. అనంతపురం జిల్లా తాడిపత్రిలో వివిధ కోలాట భంగిమలు చింతలాయుని దేవాలయంలో చూడవచ్చు. ఇది తాళలయాశ్రితం. ఇందు సరిసంఖ్యలో పాల్గొనటం పరిపాటి. వీరు ఒక్కొక్క జతగా విడిపోయి గుండ్రాకారంగా చుట్టు కొంటారు. వెలుద్ది, లోవుద్ది అని ఈ 'జత'కు పేర్లు. వీరికి గురు వుంటాడు. ఇతన్ని 'ఆయ్యవారు' అంటారు. ప్రాచీనులు దండనర్తన మనీ, దండలాస్యమనీ అన్నారు కాబట్టి ఇది ఒక నృత్తభేదం. గత ప్రధానం కాబట్టి నృత్తమనటం సమంజసం. కోలాటమేయటానికి ముందుగా ఆటగాళ్ళ కాళ్ళకు గజ్జెలు కట్టుకొని రెండు కోలాటకట్టెల్ని చేతపట్టుకొని గురువుకు దండంపెట్టి లోవుద్దికాళ్ళందరూ వెలుద్దికాళ్ళ కట్టెలపై కొడుతూఉంటారు. గురువు తాళాలు తీసుకొని 'త్రిపుట'గతిలో వాయిస్తూ ఉంటాడు. వెంటనే గురువు

'తయ్యకూ తద్దిమితా దిరద
తయ్యకూ తద్దిమితా'-అంటూ ఎత్తుగడ పాడితే ఆ ఎత్తుగడకు అనుగుణంగా వాళ్ళు పలానా 'కోపు' అని తెలుసుకొని మసలుకొంటారు. వీటిలోని రకాల్ని 'కోపు' అంటారు.

1. తాలుపుకట్టి
2. సెలకట్టి
3. నిండు చిత్తారి
4. వెలుద్ది చిత్తారి
5. పరమానంద చిటుకులు
6. ఐదు చిటుకులు
7. తూసుడు కోపు
8. ముంగారి కోపు
9. భాలనారి కోపు
10. బజారు కోపు
11. జడ కోపు మొ॥

పై వాటిలో తాలుపుకట్టి, సెలకట్టిని మాత్రమే ఇక్కడ వివరించడం జరుగుతుంది. మొదటిగా 'తాలుపుకట్టి'ని వేయటం పరిపాటి. ఈ కోపులో గణేశుని ప్రార్థనతో మొదలవుతుంది. ఈ కోపు నిదానంగా సాగుతుంది. గేయంలోని మొదటి పాదాన్ని గురువు ఎత్తుకుంటూనే వారు(వెలుద్ది + లోవుద్ది)వెంటనే తమతమ కట్టెలపై రెండుసార్లు 'చిటికెలు' కొట్టుకొని, కుడిచేతిలోని కట్టెతో ఇద్దరూ ఒకసారి చిటుకు కొడతారు ఇట్లే మరలా ఇద్దరూ వెనక్కి ముందుకూ ఒక్కొక్కసారి రెండుసార్లు కొట్టుకొంటూ ఎదురెదురుగా గుండ్రాకారంగా తిరుగుతారు ఇద్దరూ కట్టెల్ని కొట్టుకొనేటప్పుడు వెనక్కి అందుకొన్నప్పుడు కుడి మునికాలును నేలమీద కొట్టటం, ముందుకు అందుకొన్నప్పుడు ఎడమకాలి వేలిని నేలమీద కొట్టటం అపుడు మనిషి ఒక్కసారి ఊపుతూ నేలమీద కొడతాడు. ఇది ఈ 'కోపు'కు అడుగు. ఈ అడుగు వేయునపుడు కోలాటగాళ్ళ గజ్జెలన్నీ ఒకసారి నాదగా చెవులు గింగురుమంటూ ఉంటాయి,

### గ ణే శ వి ప్రా ర్థ న

గానన్నాయికా యీశ్వరి గానన్నాయికా
రాజామూర్తి మువ్వలింగా గానన్నాయికా
యిద్ది[13] నీదె బుద్ది నీదె గానన్నాయికా
యిగ్గినేశ్వరు[14]డందురు సామి గానన్నాయికా
సదువు నీదె సాము నీదె గానన్నాయికా
సారస్వతి నీకు దండము గానన్నాయికా
కాపువారు మిమ్ము గొలువ గానన్నాయికా
కాడిమేడిపందురు సామి గానన్నాయికా
బాపనివారు మిమ్ము గొలువ గానన్నాయికా
బెమ్మ[51]దేవుడందురు సామి గానన్నాయికా
వడ్డివారు మిమ్ము గొలువ గానన్నాయికా
బలె దొడ్డదేవుడందురు సామి గానన్నాయికా
యేనిగి పుట్టె యేనిగి రూపె గానన్నాయికా
నక్కవాలా సిమ్మము సామి గానన్నాయికా

ఈ విధంగా గణేశుని ప్రార్థనతో మొదలయ్యే కోలాటంలో ప్రతి చరణాన్ని గురువు పాడగా ఆటగాళ్ళు అందుకోవటం జరుగుతుంది. ఇదేకోపులో గేయం సగం అయిన వెంటనే లేదా అయిపోగానే 'సెలగట్టి'ని వేస్తారు. గురువు తాళాన్ని మారుస్తూ ఒక్కసారి 'ఓ సెలగట్టి' అని కోపును మార్చేస్తాడు. అపుడు ఎవరెవరి కట్టెలపై ఒక్కసారి మాత్రమే చిటుకు వేసుకొని ఇద్దరూ ఎడమచేతి కట్టెలకు, కుడిచేతికట్టెలకు ఒకసారి ఎదురెదురుగా కొట్టుకొంటారు. ఇట్లే అందరికి గుర్రుడాకారంగా తిరుగుతూఉంటారు. ఇవి చాలా బిరబిరా అడుగులు వేసుకుంటూ ఒకరకంగా మనిషి శరీరమంతా ఊపుతూ ఉంటారు. అపుడు పాడే గేయంకూడా చాలా బిరబిరా సాగుతుంది. గేయంలోని ఇతివృత్తం సామాన్యంగా జానపదశృంగార జీవితం కావటంవల్ల జన ప్రియంగా ఉంటుంది. దీంట్లో మొదట కొన్ని మాటలుంటాయి. వీటిని గురువు మాత్రమే పాడుతాడు.

'యేసెలగట్టి
దింద
దిగిడిదింద
జగిజగిదింద
ఓ యెలుద్దికాడ బయముండన్న
లోవుద్దికాడ బయముండన్న
తాలంకాడ తప్పేవన్న
దింద
దిగిదింద
జగిజగిదింద'

ఇవి అయిపోగానే గేయం ఎత్తుకొంటారు. ఈ గేయంలో మొదటి చరణాన్ని మాత్రమే కోలాటగాళ్ళు వంత పాడుతారు.

'వోరి మొగుడా వయ్యారి మొగుడా
నా యేలు పన్ని పాటు చూడోరి మొగుడా
దర్మారం కట్ట కింద కోరి మొగుడా
వేవరి మీది కలను బో తోరి మొగుడా
గెని కూర మునం బడి తోరి మొగుడా
గెనిము లోని యుంగ్రడకాయ వోరి మొగుడా
నాయే లోమో కొరి కొండి వోరి మొగుడా
దయగల్ల మొగునివైతె వోరి మొగుడా
నాకీ డాకటార్ల పిల్లంపు వోరి మొగుడా
అక్కర గల్ల మొగునివైతె వోరి మొగుడా
నన్నాసు పత్తి కెత్తు కెల్లు వోరి మొగుడా
పానముగల్ల మొగునివైతె వోరి మొగుడా
నాకు పాయసమన్న వండి పెట్టు వోరి మొగుడా

పై గేయంలోని గడుసు పిల్ల మందే అడుగుతోందో పాయసం కోరుతోందో సెలకట్టిలోని అభినయమే చూపుతుంది.

పై నృత్యాలన్నింటికి ఆదరణ లేదు. ఏ విధంగానైనా జానపద నృత్యాలకు తగిన ప్రోత్సాహమిచ్చి, అటు అకాడమీలు, ప్రభుత్వం ద్వారా జానపద సాహిత్యానికి, నృత్యాలకు గుర్తింపు తెచ్చేందుకు తోడ్పాటు నిస్తాయని ఆశిస్తూ ఈ వ్యాసం ముగిస్తున్నాను.

## ఉ ప యు క్త గ్రం థ సూ చి


1. జానపద కళా సంపద దోణప్ప తూమాటి
2. జానపద నాట్య కళ (అనంతపురం జిల్లా జానపద గేయాలు అముద్రితం) కృష్ణారెడ్డి బిగిచెర్ల
3. ఆ సాది వాండ్ల నృత్యం (జానపదం మార్చి 1983) కృష్ణారెడ్డి బిగిచెర్ల


## అ ధో జ్ఞా పి క లు :

1. నృత్తం సాత్త్వికాభినయం ప్రధానం గేయ యుక్తం. నృత్తం ఆంగికాభినయం ప్రధానం. గేయ నియుక్తమూ కావచ్చు. నృత్తంలో గతి చలన విన్యాసం ముఖ్యం.
2. చూ. జానపదంవిశేష సంచిక(మార్చి 1983)బిగిచెర్ల కృష్ణారెడ్డి
3. అమ్మవారు చిన్న పిల్లలకు (తట్టు) పెద్దవారికి. ఈ వ్యాధి సోకి 'కళ్ళు' కూడా పోయే అవకాశముంది.
4. అనంతపురం(జిల్లా) ధర్మవరం(తా॥) సుబ్బరావుపేట (గ్రామం)
5. పెద్దపోతు (ఎనుపోతు)
6. ఆద (స్త్రీ)
7. అమ్మవారు సల్లెలో అందరూ ఆదమరచి నిద్రించేటపుడు వస్తుందని ఇందులో పిల్లలకు పోస్తుందనీ, అమ్మవారు వచ్చేటపుడు కుక్కల అరుపులు ఒక మాదిరిగా కూతలు పెడ్తాయి. కుక్కలకి 'అమ్మ' కన్పిస్తూందని ఒక నానుడి.
8. పులి చెట్టుకు కాసే కాయ శరీరంతో అమ్మగారి పుండ్లవలె తెల్లగా కాయలుంటాయి. వీటిని తింటారు.
9. విద్య
10. వాహనము
11. పలికితిమి
12. భక్తులను
13. విద్య
14. విఘ్నేశ్వరుడు
15. బ్రహ్మ

**కృ త జ్ఞ త లు :** నాకు పైవ్యాసం తయారు చేయటానికి తగిన సలహాల నొసంగిన మద్గురువరేణ్యులు డాక్టర్ హెచ్. యస్. బ్రహ్మానంద డాక్టర్ పి. యల్. శ్రీనివాస రెడ్డి, డాక్టర్ ఆర్. చంద్రశేఖరరెడ్డి గార్లకు. (అధ్యాపకులు, ఆంధ్ర భారతి శ్రీకృష్ణ దేవరాయ విశ్వ కళా పరిషత్తు, అనంతపురం) నా నమస్సుమాంజలులు.

బిగిచర్ల కృష్ణారెడ్డి

—✱—

# గ్రంథ విమర్శలు

## సాకేతము

[గ్రంథకర్త : శ్రీ బులుసు ఉదయభాస్కరము, ప్రకాశకుడు : శ్రీ బులుసు ఉదయభాస్కరము, రాజమండ్రి తాలూకా, తూర్పు గోదావరి జిల్లా వెల : రూ. 22/-]

సుమారు 2100 పద్యములుగల కావ్యము. ఊర్మిళ పాత్రకు ప్రాముఖ్యముగల మనోహరమైన శ్రీరామ చరిత్రము.

తిరుమల-తిరుపతి దేవస్థానంవారు, మరికొందరు సహృదయు లున్నూ ఆర్థికంగా చేయూత ఇవ్వడంవల్ల లోకంచేతుల్లోకి వచ్చిన పవిత్ర ప్రబంధం......

సుప్రసిద్ధ హిందీకవి శ్రీ మైథిలీశరణగుప్త వ్రాసిన 'సాకేత్'-అనే గ్రంథానికి ఇది తర్జుమా

ఈ భాషాంతరాకృతి 'ఉదయ భాస్కరుణ్ణి' మధ్యందిన భాస్కరుణ్ణి చేసిందనడానికి ఏలాటి సందేహములేకుండా నా మాట ఒప్పుకుంటారు కవితా రసజ్ఞులైన చదువరులు.

పన్నెండుసర్గల యీ మహాప్రబంధంలో ఏ పద్యమూ అనూదితముగా తోచదు. ఏ పద్యానికదే స్వతంత్రమనిపించింది. మూడు భాగాల్లో ఈ రచయితకు నాగేశ్వరి అనుగ్రహించిన 'సత్తా' అది.

'విరియగా సాగె కోరకవితతి, మగుడ
పూయగా సాగె పూలు పూబొదలమీద
మేతలను మానె ఖగమృగ వ్రాతమెల్ల
జానలే గానపారవశ్యమున మునిగి'—

తెరచి వెదకకుండా కనిపించిన పద్యం ఉదహరించాను. 'మునిగి'-అనే యీక్త్వార్థక క్రియ పాదపూరకం కాదు. భావస్ఫోరకం—

కథ వాల్మీకి కావ్యానికి భిన్నంగా ఉన్నా రామకథ అంతా ఉండడటమేకాక అందులేని కథ ఇందెక్కువగాఉంది. అదేది? ఊర్మిళ విరహకథ. వివాహఘట్టములో పేరుకికనిపించే ఊర్మిళ ఇందు ప్రధాన పాత్ర. నవమసర్గ అవశ్యం పఠనీయం.

ఊర్మిళ సరయూనదితో చెప్పుకుంటున్నట్టున్న విషయం అతి లోక సుందరభావ బంధురం. ఇంత ప్రాముఖ్యంగల ఊర్మిళకు తన రామాయణంలో ఆదికవి పేరేలేకుండా చేశాడే! అని విసుగుసలాడవదు, అది సీతాచరితం. ఈ 'సాకేతం' ఊర్మిళాచరితం. ఇప్పుడు మూల గ్రంథకర్త గుప్త సజీవుడైవుండి తెలుగు కావ్యపద్ధతులు తెలిసినవాడై ఉంటే ఎంత ఆనందించునో! అని అనుకున్నాను.

భాషాంతరీకరణం కష్టసాధ్యం. ఆ అనుభవం కలవారికే అది తెలుస్తుంది. ఏ ఘట్టంలోనైనా తెలుస్తుంది ఇది అనూదితం అని. కాని ఉదయభాస్కరుడి యీ అనువాదం అలాంటి భావానికి దిగనీయదు.

ప్రతిపద్యమూ ఎత్తిచెప్పాలంటే పరిమితాక్షరమైన యీ అభిప్రాయ ప్రకటనలో సాధ్యంకాదని ఇంతలో విడువవలసివస్తూంది.

తెలుగులో స్త్రీలపాటలుగా ప్రసిద్ధమైన ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవరనవ్వు అనేవి నేను సుమారు ఏభైఏండ్లక్రితం వినిఉన్నాను. ఈ ఊర్మిళ నాయికగా ఏ మహనీయుడైనా కావ్యం వ్రాస్తే బాగుండు ననుకున్నాను. భాషాంతరీకృతి అయినా శ్రీ బులుసువారి ధర్మమా అని ఆంధ్ర వాఙ్మయచరిత్రలో ఉన్న ఆ లోపం ఈ 'సాకేతము' వల్ల మటుమాయమవుతుంది.

## అభినవలోచనం

(సాహిత్య వ్యాస సంకలనం)

[రచన: డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం ప్రతులకు యువభారతి 5, కింగ్స్‌వే, సికిందరాబాద్-2 లేదా యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనం, తిలక్ రోడ్డు, హైదరాబాద్-1 వెల : రు. 16-00.]

ఎనిమిది వ్యాసాల సంకలనం ఇది. మహాకవి రాయప్రోలు సుబ్బారావుగారికి అంకితం.

అన్నీ విమర్శాత్మకములైన వ్యాసాలే. మొదటిది రాయప్రోలు వారి వ్యక్తిత్వాన్ని ఆంతరజీవితముతోపాటు చెప్పేది. దాని పేరు 'రాయప్రోలు సుబ్బారావు'. దీనిలో ఆయన గ్రంథాల బంధాలనూ, సంబంధాలనుకూడా వివరించారు సుబ్రహ్మణ్యంగారు.

రెండు మూడు వ్యాసాలు డాక్టర్ గోపాలరెడ్డిగారి గురుదేవుల గ్రంథాల అనువాదాలకు వీరు వ్రాసిన పీఠికలు. నాలుగైదు వ్యాసాలు విశ్వనాథ కవితారీతులకూ విమర్శపరిణతికీ సంబంధించినవి. ఆరవది 'రాయప్రోలువారి మాధురి దర్శనము' అనేది. ఏడవది మధునాపంతుల

సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్రపురాణము' నకు శ్లాఘనీయమైన విమర్శ వ్యాసం. ఎనిమిదవది 'కవితాధ్యయనం'—

శృంగారరసాన్ని సుబ్బారావుగారు సమన్వయించుకున్నతీరు సుబ్రహ్మణ్యంగారి మాటల్లో పరమపావనమైన అవతారమూర్తిగా కనిపిస్తుంది.

విశ్వకవి హృదయాన్ని నిండుగా నిండుగా గోపాలరెడ్డిగారు చూపించారన్నది రెడ్డిగారి శిష్యభావం గోష్పదనం అలాఉండగా అంత లోతుగా దిగి అడుగున ఉన్న జాతిరత్నాలను వ్యక్తిత్వానికి నిగమ సూత్రాలుగా నిరూపించి యిచ్చిన సుబ్రహ్మణ్యంగారి రచనాదర్శనానికి జేజేలు పలకాలి.

కట్టమంచి రామలింగారెడ్డిగారిని పునస్కరించుకొని విశ్వనాథ వారిని విమర్శసధాన్ని విశ్లేషించడం సముచితమేగాని కట్టమంచివారి విమర్శపద్ధతిలోఉన్న కార్కశ్యం విశ్వనాథునిలో కనిపించదని నా అభిప్రాయం. ఒక్కొక్కచోట కట్టమంచి రెడ్డిగారు కవ్వడాట్లు వేసిన చోట్లు ఉన్నాయని ఆనాటి పెద్దలు కొందరనడం నా జ్ఞప్తిలో ఉంది.

'ఆంధ్రపురాణం' గురించి చాలాకాలం క్రితం నేను ఆంధ్ర పత్రికలో వ్రాసి ఉన్నాను.

చివరివ్యాసం అధ్యయనంగురించి. ఔను. ఏమీ చదవనక్కర లేదని కవితల్లో ఉబలాటం కలవారి రచనలు షడ్రుచులు వేడి పంట వండే పాక కళాప్రపూర్ణుల చెయ్యి తిరుగుడులాగే ఉంటాయి. ఈ వాక్యం నేటి రచనకవితలూ, గేయకవితలూ వాడే సామాజిక జీవిత ప్రధానకర్తలు చదివి అర్థంచేసుకోవాలని సలహా ఇస్తున్నాను.

సుబ్రహ్మణ్యంగారి వాణి వైభవంగురించి ఈనాడు క్రొత్తగా ఎవ్వరూ 'సర్టిఫికెట్టు' ఇవ్వనక్కరలేదు. కవితల్లోవారికి విమర్శించే శక్తి, విమర్శకులకు కవితాప్రాభవం సామాన్యంగా ఉండవు. కాని ఆ రెండుగుణాలను సుబ్రహ్మణ్యంగారిని వరించాయి. అవి ఆయనకి పుట్టుతోడవులు.

## జైమిని భారతము సంశోధనాత్మక పరిశీలనము

(సిద్ధాంత వ్యాసము)

[ రచయిత : డాక్టర్ ముదిగొండ వీరేశలింగము. ప్రతులకు : శ్రీమతి ముదిగొండ జ్ఞానప్రసూన, 12-4-77 పాపయ్యపేట, వరంగల్ - 506 002, ఆంధ్రప్రదేశ్. వెల : నలుబది రూపాయలు. ]

ఈ వ్యాస గ్రంథం గురించి ముమ్మందు చెప్పవలసేది తిరుమల-తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సాహాయ్యం............ శుభమస్తు, వేంకటేశ్వర ప్రసాదం. రచయిత అభ్యుదయాభి వృద్ధికి సువర్ణ ప్రాసాదం ............

ఉస్మానియా విశ్వ విద్యాలయంనుంచి డాక్టరేట్ పట్టం పొందిన ఉద్గమోత్తమ వ్యాసం. బృహద్గ్రంథముగా రూపొందింది.

ఇటీవల నేను కొన్నియీలాటి విమర్శ గ్రంథాలు చూశాను. కాని ఇంత విపుల విషయ విశిష్టా గ్రంథం కనిపించలేదు. ఆనాడు కవుల చరిత్ర భాగత్రయం వ్రాసిన సుప్రసిద్ధ గ్రంథ రచయిత వీరే శలింగంగారి సాహిత్య కృషిని మించిన కృషి యీ వీరేశలింగబోధుని గ్రంథమందు గోచరిస్తూంది.

ఈ గ్రంథమందున్న పదునేడు ప్రకరణాలలో నాకు బాగా నచ్చింది పన్నెండవ ప్రకరణం. భావము-రస పోషణ, పాత్ర శీల ప్రకటన-ఈ విషయములకే పరిమితమైన సిద్ధాంత పద్ధతిని చూపిన విమర్శక శక్తి ప్రశంసనీయం.

మిగిలిన ప్రకరణాలు నచ్చలేదని కాదు. కవిగా నాకు గల భావ రస పాత్ర సృష్టికి ఆధారం చేసుకొని ఆ ప్రకరణాన్ని అంతగా ప్రశంసిస్తున్నాను.

వివిధ భాషలకూ మూలమైన సంస్కృతానికి-పినవీరభద్రుడి కృతికిగల సంబంధ బాంధవ్యాలకూ, పినవీరన వాడిన ఛందో వ్యాకరణ రీతులకు కూలంకషంగా విమర్శించి జైమిని భారతముగూర్చి ఇక ఎవ్వరూ చెప్పవలసే విషయం 'కించి దపి నాస్తి' అన్నట్లుగా శ్రీ వీరేశలింగం సిద్ధాంత వ్యాసం రూపొందింది.

'డాక్టరేట్' బిరుద పత్రమే కాదు ఏబహుమతి ఇచ్చినా యీయన మేధా శక్తికి ఉపద కాజాలదని నా అభిప్రాయం.

## తెలుగు సాహిత్య సమీక్ష

[ మొదటి సంపుటము (1500 వరకు) రచన : డాక్టర్ జి. నాగయ్య, ప్రతులకు : జి. లక్ష్మమ్మ, 18-1-699, భవానీ నగర్, తిరుపతి-1. వెల : 45-00 ]

ప్రాఙ్నన్నయ యుగము, నన్నయ ఆది కవితాపథం-సమీక్ష సోపపత్తికంగా ఉంది. ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయరచితం కాదన డానికిచ్చిన ఉపపత్తులు చాలవు. పరమ గురువులు వజ్ఝలవారూ, మరి కొందరు పండితులు ఇది నన్నపార్యుని రచనగానే నిర్ణయించారు.

అహోబల పండితుడు చింతామణి లోని వ్యాఖ్యానంలో నన్నయను ప్రథమాచార్యునిగా పేర్కొన్నాడు. నన్నయ తెలుగు పలుకుబడికి కణ్వాశ్రమవర్ణన మందలి 'ఏచితనర్జి' ఇత్యాదిగా ఉన్న పద్యాలు ఉదహరిస్తే పాఠకుల మనస్సు ఇంకా ఆనందిస్తుంది.

కవిత్రయ కవితా సమీక్షలు వేర్వేరుగా చూపిన మూడు గుణాలు ముచ్చటగా ఉన్నాయి.

నాచనసోముణ్ణి గురించి యిచ్చిన విషయం సమగ్రంగా లేదని పించింది. ఎర్రన కవితలో లాలిత్యమెంత ఉందో నైశిత్యమూ అంత ఉందని హరివంశం చెప్తుంది.

శ్రీనాథుని నైషధాంధ్రీకరణ పద్ధతి చూడడములో అనౌచిత్య పరిహారానికి-

'సుపర్ణ శైలాదవ తీర్యతూర్ణం స్వర్వాహినీ వారి కణావకీర్ణె

తంవీజయామస్మర కేళి కాలే పక్షై'ప్ర పంచామరబద్ధ సఖ్యైః

అనే హంసోక్తిగా ఉన్న శ్లోకం, దానికి శ్రీనాథుని తెనిగింపుగాఉన్న

'కనకశైలంబుడిగ్గి ఆకాశ సింధు సలిలముల దోగి మిగులంగ చల్లనైన చారుహాటకమయ గరుచ్చా మరముల వీతమతనికి వైశాఖ వేళలందు'- అనే పద్యం ఇస్తే నిండుగా ఉండేది.

పిల్లలమర్రి పిన వీరన్న కావ్యాలకు కొంతగా కొంతైనా విషయ విమర్శ చూపితే జిజ్ఞాసువులకు పఠన రుచి కలిగించినట్టు అయ్యేది.

కృషి మంచిదే. తెలుగు సాహిత్యం పాఠ్యముగా తీసికొని డిగ్రీలకోసం కాంక్షగల విద్యార్థులకు ఉపయోగిస్తుంది.

శ్రీ యమాబిజాల పద్మనాభస్వామి

# అయిదు లఘుకృతులు

## 1. శ్రీ వీరబ్రహ్మేంద్ర సుప్రభాతమ్

[రచయిత : కవిరాజు, కళాప్రపూర్ణ, డాక్టర్ కొండపేటి వేంకటకవిగారు. పాకెట్ సైజు 34 పేజీలు. ప్రతులకు - బ్రహ్మం గారి మఠం, కంది మల్లయపల్లి - 516 503. బద్వేలు తాలూకా, కడప జిల్లా.]

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం బహుళ ప్రచారాన్ని పొందడం వల్ల దానిచే ప్రభావితులైన విద్వత్కవులు కొందరు తమ తమ అభీష్టదైవాలను ప్రబోధించి సుప్రభాతాలను సంస్కృతంలో రచించి ప్రచురించడం జరుగుతోంది. కొందరు ఆధ్యాత్మిక తత్త్వవేత్తలైన యోగులను ప్రబోధించి చెప్పడంకూడా ఉన్నది. కందిమల్లయపల్లి సంస్థానాస్థానకవి అయిన రచయిత, విరాట్ పోతులూరివీరబ్రహ్మేంద్ర స్వాముల మఠానికి సర్వాధ్యక్షులైన శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వర స్వాముల ఆదేశానుసారం దీనిని రచించాడు. ఇది చారిత్రక దృష్టితో రచించ బడిందట!

రచయిత సంస్కృతాంధ్రాలలో గట్టి విద్వాంసులు. చక్కని కవిత్వం చెప్పగల సమర్థులు. ఇందులో సుప్రభాతం, ప్రపత్తి, మంగళా శాసనం కూడా ఉన్నవి. రచన చాలా సుబోధంగా రస వంతంగా ఉన్నది. ఒక్క ఉదాహరణ-

జ్ఞానామృతేన పరిపోషిత శిష్యవర్గ !
గానామృతేన పరివర్ధిత భక్తవర్గ!
స్వచ్ఛంద దేశిపద సేవిత సాధువర్గ !
శ్రీ వీరదేశిక ! విభో తవ సుప్రభాతమ్.

## 2. శివాలాపము

[గ్రంథకర్త : శ్రీ బులుసు వేంకటేశ్వర్లు. క్రౌన్ సైజు 26 పేజీలు. వెల 3 రూ. లు. ప్రతులకు : 1) శ్రీ బులుసు కామశాస్త్రి, ఎన్. ఆర్. టి. 651, సనత్ నగర్, హైదరాబాదు. లేక 2) శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, తెలుగు పండితుడు, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, లంకలపాలెం-531 021, (వయా)పరివాడ, విశాఖజిల్లా.]

భగవద్భక్తిని ప్రతిపాదించే శతకాలెన్నో ఉన్నాయి. ఎన్నో వస్తున్నవి. అట్టి శతకాలలో ఇదొకటి. ఇందులో శివస్తుతి, శివుని గురించిన ప్రార్థనా కానవస్తున్నవి. రచన వృత్తాలలో సగళంగా సాగింది. భావాలు సామాన్యంగా ఉన్నవే! పద్యాలు చదువుటకు సులభంగానూ, ఇంపుగానూ ఉంటాయి. ఒక్క ఉదాహరణ-

"యోగాభ్యాసము లేదు, ధూర్జటి వలెన్
ఓంకార నాదైక వి
ద్యా గాంభీర్యము లేదు సోమన వలెన్
తాదాత్మ్యభావ ప్రసూ
రాగం బింతయు లేదు పోతన వలెన్
రక్షింపవే ! మన్మహా
భాగుల్ తీసిన త్రోవ కెక్కితిని, య
ప్పా ! సద్భవయ్యా ! శివా !" (పద్యం 54)

## 3. మయూర శతకము

[ఆంధ్రానువాదం. కర్త : శ్రీ కొంగే సుధాకరరావు, బి. ఎ. క్రౌన్‌సైజు 42 పేజీలు. వెల 5 రూ. లు. ప్రతులకు- శ్రీ కె. సుధాకరరావు, 3/351. సదాశివపేట, ఆదోని-518 301. కర్నూలు జిల్లా.]

సంస్కృతంలో మయూర మహాకవి విశ్వవిఖ్యాతుడు. ఆయన సూర్య దేవుణ్ణి స్తుతిస్తూ శతకంచెప్పి తన కుష్ఠురోగాన్ని పోగొట్టుకొన్నట్లు ప్రసిద్ధికెక్కింది. అది సూర్యశతకంగానే ప్రసిద్ధికెక్కింది. మయూరుడు రచించుటవల్ల సుధాకరరావుగారు తమ అనువాదానికి ఆతని పేరు పెట్టారని తోస్తుంది. సంస్కృతంలో ప్రౌఢమైన ఆ శతకాన్ని అనువదించడం కష్టసాధ్యమే. అనువాదకర్తకు సంస్కృతాంధ్రాలతోనూ, కన్నడ, హిందీ, మరాటీ భాషలతోనూ మంచి పరిచయం ఉన్నది. యువకులైన ఆయన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగులో ఎం. ఏ. విద్యార్థి. ఔత్సాహిక రచయిత, అందువల్ల కష్టసాధ్యమైన యీ అనువాదానికి పూనుకొన్నట్లున్నది. రచయిత "మూలంలోని భావాన్ని దృష్టిలో పెట్టుకుని, పద్య రచన సాగించి"నట్లు చెప్పుకుంటున్నారు. అంటే యిది భావప్రధానమైన స్వేచ్ఛానువాద మన్నమాట! వీరి వ్యాసాలు, గేయాలు కవితలు ప్రసిద్ధమైన తెలుగు పత్రికలలో ప్రచురించబడి ఉన్నవి. ఆసక్తితో పాటు రచనలో అనుభవం ఉన్నది.

దీని అనువాదం చాలా సరళంగా జరిగింది. తెలుగు జాతీయాలు పొందికగా అవసరమైనచోట్ల కూర్చబడ్డాయి. ఉదాహరణ-

"వెన్నుల్ కాలగ నిప్పులం జెరగుచున్ వెంటాడు సూర్యప్రభన్
మిన్నేగన్ బ్రభవించినట్టి శ్రమతో మీరంగ నిశ్వాసముల్
సన్నాహంబున గాంగనీరము పిపాసం దీర్పగా నాస్యముల్
మున్నొక్కించుక నంచు భాస్కరహయం బుల్ డుల్చు మీపోషముల్.

[పుటలు-18-19]

తిరుమల - తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయంతో ఈ పుస్తకం ముద్రితమయింది.

## 4. ఆంధ్ర వజ్ర సూచిక

[వజ్రసూచికోపనిషత్తునకు స్వేచ్ఛానువాదం, కర్త. శ్రీ రాచగుండ్ల చెంచలరావు, క్రౌన్ సైజు, 10+38 పేజీలు, వెల : 3 రూ. 50 పై, ప్రతులకు :- శ్రీమతి రాచగుండ్ల అనసూయమ్మ, 11-30-976. వెంగళరావు నగర్, నెల్లూరు జిల్లా.]

దశోపనిషత్తులే ప్రసిద్ధంగాఉన్నా, మొత్తం 108 ఉపనిషత్తులు కానవస్తున్నవి. ఉపనిషత్తుల పవిత్రతను, వైశిష్ట్యాన్ని గ్రహించి, తర్వాతి కాలాల విద్వాంసులు, తమ ఉదారాశయాలతో రచనలుచేసి ఉపనిషత్తులనే పేరు పెడుతూవచ్చారు. అట్టి వాటిలో ఈ వజ్ర సూచికోపనిషత్తు ఒకటి. దీని మూలం గత శతాబ్దిలోనే రెండుసార్లు అచ్చు పడింది.

ఈ వజ్ర సూచికోపనిషత్తులో బ్రాహ్మణుడు ఎట్టివాడనే ప్రశ్నకు సమాధానంగా, బ్రహ్మజ్ఞానం కలవాడే బ్రాహ్మణుడనీ జన్మ మాత్రాన బ్రాహ్మణుడు కాడనీ జ్ఞానమార్గాన్నే ప్రబోధిస్తున్నది. మూలంలో, ఒకటి, రెండు మాటలలోఉన్న భావాన్ని రచయిత తమ అనువాదంలో విపులీకరించారు. ఈయన శివభక్తి తప్పరులే అయినా, క్రమంగా జ్ఞానమార్గానికి బుద్ధిని మరల్చారు. తీరికలేని ప్రభుత్వోద్యోగాన్ని నిర్వహిస్తూ, సంస్కృతాంధ్ర వాఙ్మయాలలో అభిమానం, ఆధ్యాత్మిక చింత ప్రేరేపింపగా దీనిని రచించినట్లున్నది. రచన సరళంగా, మధురంగా సాగి పాఠకులను ఆకర్షిస్తున్నది. ఒక్క ఉదాహరణ- వ్రతములమీది శ్రద్ధయో, నిరంతర గాఢ తపస్సులో, చతుశ్శ్రుతి పఠనంబొ, భావపరిశుద్ధపుదానమొ, సర్వపౌష్టిక క్రతువులొ, బ్రహ్మచర్యమొ, అకల్మష సత్యమొ పట్టుపడ్డ సన్మతి కలవాడ ధార్మికుడు-మానవులందున పూజనీయుడై."

(పుట- 19)

## 5. రత్నపాంచాలిక

[(కువలయావళి - నాటిక) ఆంధ్రానువాదం - రచన : శ్రీ మధునాపంతుల-సత్యనారాయణ శాస్త్రి, క్రౌన్ సైజు, 77 పేజీలు, వెల 6 రూ॥లు. ప్రతులకు : శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, త్యాగరాజ నగర్, రాజమండ్రి - 533 101. రేక తరుణ సాహితి, 11-3-4, రామలింగేశ్వరఅగ్రహారం, కాకినాడ-533004]

రెడ్డిరాజుల కాలంలో రాచకొండ ప్రాంతం పాలించిన సర్వజ్ఞ సింగ భూపాలుడు పెద్ద గొప్ప కవి. లక్షణవేత్త, రసార్ణవ సుధాకరాదులనేకాక కువలయావళి అనే నామాంతరంగల రత్నపాంచాలిక అనే నాటికను సంస్కృతంలో రచించాడు. తద్వంశీయులైన పిఠాపురం మహారాజావారు శ్రీ శాస్త్రిగారిచేత దీన్ని తెలుగులోకి అనువదింపజేసి, సంస్కృతమూలంతోసహా 1943లో తొలిసారి ప్రకటించారు. తర్వాత దీనిని డాక్టరు గిడుగు సీతాపతిగారు కూడా మహారాజావారి అనుమతిపై ఆంధ్రీకరించారు. ఆ ప్రతులిప్పుడు దొరకవు. శ్రీ శాస్త్రిగారు తమ రచనకు ద్వితీయ ముద్రణను 1982 లో వెలువరించారు. ఈ రెండవ ముద్రణలో మూలంలేదు. అనువాదం మాత్రమే ఉన్నది.

అనువాదకులు శ్రీ శాస్త్రిగారు సుప్రసిద్ధ విద్వత్కవులు. ఆంధ్రీ పురాణాదులైన ఉద్గ్రంథాలను రచించి లబ్ధప్రతిష్ఠులైనారు. వారి రచన గ్రాంథిక భాషలోనే (నిచ ప్రాతలకు కూడా) జరిగినా సుగ్రాహ్యమై, పాఠకులను ఆకట్టుకొంటుంది. దీని ప్రాశస్త్యాన్ని గ్రహించే ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ఉన్నత పరీక్షలకు దీనిని పాఠ్యగ్రంథంగా నిర్ణయించారు. దీనికి తగిన ప్రచారం లభించగలదని భావిస్తున్నాను.

"ఆంగీరస"

# ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం

[పుటలు 14, 328, Lvi, డెమ్మీ 1/8. గ్రంథకర్త : డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం. వెల రూ. 30. ప్రతులకు : యువభారతి, 5; కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003 లేదా యువభారతీ కార్యాలయం, ఆంధ్రసారస్వత భవనములు, తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001.]

పండితులు, పరిశోధకులు, "తత్వవైద్యులు" (పి హెచ్. డి.) ...శ్వ విద్యాలయాచార్యులు, బహు గ్రంథకర్తలు, ఉపన్యాసకులు ...యిన జి. వి. సుబ్రహ్మణ్యంగారు రచించిన ఉద్గ్రంథమిది.

ఇందు అసమానధైర్యంగల ఎనిమిది ప్రకరణాలున్నాయి. ...ర్శ వివేకం" అనే ఒకటవ ప్రకరణంలో సాహిత్య విమర్శాపశ్య... నొక్కివక్కాణించినారు. శీర్షిక, మహిమభట్టు "వ్యక్తివివేకం"ను ...స్తుంది. "ప్రభావ స్వభావం" (2వ ప్రకరణం)లో ప్రభావ పరి...క్త పరీక్షలాంటిదన్నారు. "రక్తం క్షీణించిన వాడికి సజాతీయ...న్న మరొకరి రక్తం ఎక్కిస్తే బ్రతికి తన పేరుతోనే సాగించ... ఆంధ్ర సాహిత్య విమర్శ కూడా పాశ్చాత్య ప్రభావమనే ...రం జరిగిందానికి కొత్త బ్రతుకు లభించిది." పాశ్చాత్యప్రభావం ...అనే ప్రశ్న పుట్టుతుంది. నిజానికి అయినది విజాతీయ రక్త... పాశ్చాత్యులు రాకపూర్వం మనకు విమర్శలేదు. అందుచే ఈ ...్య సాదృశ్యం సరిపోలేదు. "యుగాలు-యోగాలు" (3వ ప్రకరణం) కట్టమంచి, విశ్వనాథలు విమర్శలో యుగనిర్మాతలన్నారు. ...హెచ్, డి. లందరూ ఉన్నత ప్రమాణాలలో లేరన్నారు. ఇప్పుడు ...క్షా యుగం వచ్చిందన్నారు. ఆ సమీక్షయే నేను చేస్తున్నది. ...్యమాలు-ఉపస్కృతులు" (4వ ప్రకరణం)లో ప్లేటోనుండి లూకార్స్ ...గల పాశ్చాత్య కావ్య మీమాంసకుల సిద్ధాంతాలను క్రోడీకరించినారు. ఈ మహా మహులు పరంపరగ వస్తుంటే, కురుక్షేత్ర వేంచేసే అతిరథ మహారథులను సంజయుడు వర్ణించినట్లుంది. గ్రంథకర్త పాండితీసూచకం. "ప్రభావం-పరిధులు" (5వ ప్రకరణం అతి ముఖ్యమైంది, పాశ్చాత్య విమర్శనా పద్ధతులవల్ల ప్రభావితమై తెలుగు సాహిత్య విమర్శను యుగాలుగా వింగడించి, ప్రతి యుగానికీ ప్రాతినిధ్యం వహించే విమర్శకుల మతాలను చెప్పినారు.

ఆయుగాలు : అనుశీలన యుగం, సౌందర్య మీమాంస యుగం, శిల్పానుశీలనయుగం, సమన్వయ యుగం, సమీక్షాయుగం, మార్క్సియ యుగం, కవిసేనమేనిఫెస్టో. ఈ ప్రకరణమొక్కటే గ్రంథనామంతో చెలామణి కావచ్చును. "వెలుగులు-వీచికలు" (6వ ప్రకరణం) లో పాశ్చాత్య విమర్శ వీచికలలో ఓలలాడిన తెలుగు కవుల (గురజాడ, రాయప్రోలు త్రిపురనేని, దేవులపల్లి, గుడిపాటి, గోపీచంద్, బుచ్చిబాబు) సాహిత్య దృష్టిని ఆవిష్కరించినారు. భవభూతి, క్షేమేంద్రుడు, బెర్నార్డ్‌షా, టాల్స్టాయిల విషయంలోవలె ఈ కవుల విమర్శక దృష్టికీ, వీరి సృజనాత్మక రచనలకూ పొంతన వున్నదా?" "ప్రక్రియలు-ప్రయోగాలు" (7వ ప్రకరణం)లో కవుల చరిత్ర, సాహిత్య చరిత్ర, విమర్శకవ్యాసం మున్నగు విమర్శ రూపాలను వివరించినారు. తెలుగు సాహిత్య విమర్శకులలో ఈ గ్రంథంలో వచ్చే కడపటి పేరు భవదీయుడే! "గింపుకాదు, మొదలు" (8వ ప్రకరణం) లో తెలుగు సాహిత్య విమర్శలో భవిష్యదర్శం సూచించినారు. ఛక్కని సూచనలివి.

విమర్శ, కృతజ్ఞతా రహిత వ్యాసంగం. సిబిలియస్ (ఫిన్లిష్ దేశస్థుడు, ఇతనిని 20వ శతాబ్దపు బీతోవన్ అంటారు) దగ్గరకు ఒక యువ సంగీత దర్శకుడు (కండక్టరు) వచ్చి ఆ దినం తన సంగీత దర్శకత్వాన్ని విమర్శకులు దుయ్యబట్టారని మొరపెట్టుకోగా. సిబిలియస్. వాని బుజం తట్టి "నాయనా, ప్రపంచంలో ఎచ్చటా విమర్శకులకు, శిలా విగ్రహాలు ప్రతిష్ఠించ బడలేదనే సంగతి గుర్తుంచుకో" అని సముదాయించినాడట. అదీ విమర్శకుని గతి. విమర్శ మీద విమర్శ చేయడం మరీ ఇరకాటపు పరిస్థితి. అయినా, భారతీ సమక్షాన నా సమీక్ష నివేదిస్తాను

చంద్రునిలో కూడా ఒక్కటైనా దోషముంటేకాని రాణించదు. గ్రంథ శీర్షికలో రెండు లోపాలున్నాయి. గ్రంథంలో పాశ్చాత్య ప్రభావం వర్ణించబడగా శీర్షికలో "అంగ్ల ప్రభావం" అని ఉండుట. "ఇంగ్లీషు" అని యుండవలసియుండ "అంగ్ల"యని ఉండుట. అలంకార లేక సౌందర్య శాస్త్రం (ఈస్థటిక్స్) పేరు, సాహిత్య విమర్శ వేరు (క్రిటిసిజం) వీటి సూక్ష్మ భేదం గ్రంథకర్త వివరించలేదు.

పాశ్చాత్య దేశాలలోనూ సాహిత్య విమర్శ (నేటి రూపంలో) ఇటీవలిదేకదా! 200 ఏండ్లయినా కాలేదు. అలంకారశాస్త్రంలో పాశ్చాత్యులకంటే భారతీయులే అగ్రగణ్యులు. "ఈస్థటిక్స్"కు మూల పురుషుడైన "బాంగార్టెను" పేరైనా గ్రంథకర్త స్మరించలేదు. ఈస్థటిక్స్‌లో క్రోచే, కోలింగ్‌వుడ్, సంతాయనా ...

లు వెలసినారు, టాల్‌స్టాయి, సాహిత్య దృష్టి ప్రత్యేకం, విశిష్టం రచయిత చెప్పియుండవలెను. పాశ్చాత్య ప్రభావం విశ్వనాథ శిల్పంమీద వుంది కానీ, వారి విమర్శనా పద్ధతిపై లేదు. విశ్వ నాథ విమర్శనా గ్రంథాలివి. వారిని యుగకర్తగ చెప్పుట సుబ్రహ్మణ్యంగారికి వారిపై వుండే గౌరవానికి సూచకంకాని వేరు . కవిసేన మెనిఫెస్టోకూ, వెల్చేరుగారి గ్రంథానికీ ఇచ్చిన ప్రాముఖ్య సమర్థనీయంకాదు. ఆ గ్రంథాలలో విమర్శన మౌలి కంటే, పరిభాషా ఆడంబరం జాస్తి. చిలుకూరి నారాయణరావు లుగులో తొలి పి హెచ్. డి.), నండూరి బంగారయ్య, భూపతి లక్ష్మీనారాయణరావు, బండారు తమ్మయ్య, దేవరపల్లి కృష్ణారెడ్డి, గన్నలగడ్డ వత్సనారాయణమూర్తి, గుర్రం సుబ్బరామయ్య, కొంపెల్ల జనార్దనరావు, శ్రీపాద కామేశ్వరరావు, గోపాలకృష్ణమూర్తి, దేవు లపల్లి రాజగోపాలరావు, అచంట జానకిరాంపంటివారి సాహిత్య విమర్శ కృషి విస్మరించబడింది. వాఙ్మిత్రాలు వ్రాసిన వారి జాబితాలో శ్రీ మున్నంగిశర్మ, శ్రీ శిష్టలెంక శంభుప్రసాదుగార్లను పేర్కొనవలసింది.

పవిత్ర, మత గ్రంథాలను విమర్శించే పద్ధతిని "హయ్యర్ క్రిటిసిజం" అంటారు. స్వేచ్ఛా చింతకులు పాశ్చాత్య దేశాల్లో చేసినారీ రచనలను. తెలుగులో కీ. శే. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారట్టి విమర్శకులు. వీరి మార్గంలోనే నేడు చాలమంది హేతు వాదులు వ్రాస్తున్నారు. ఉదా : తాపి, నార్ల, కొత్త, ముప్పాళ్ళ. దీన్ని గురించి కొంచెం చెప్పుడుండే బాగుండేది. "కాజరి" అనే ప్రక్రియ అచ్చపు పాశ్చాత్య రీతి. దాసు వామనరావు మున్నగువారు తెలుగులో "కాజరీ"లు వ్రాసినారు "పేరుపేరున ప్రక్రియలను, రచయితలను చెప్పుట సాధ్యంకాదు" (పుట 324) అని గ్రంథాంతమందు తన నిస్సహాయతను రచయిత వెలిబుచ్చితే, దాదాపు 400 పుటల గ్రంథం వ్రాయనేల ? పాశ్చాత్య విమర్శకులమీద 100 పుటల ప్రకరణం (ఉద్యమాలు - ఉపశ్రుతులు) తగ్గించియుంటే, తెలుగు రచయితలకు, ప్రక్రియలకూ న్యాయంచేకూరి వుండేది. ఇంగ్లీషు గ్రంథాలనుండి సుదీర్ఘ పేరాల నుద్ధరించడంవల్ల, మన గ్రంథకర్త ఏమి చెబుతున్నారో తెలియక ఆయోమయస్థితి ఏర్పడింది. వ్రాత ప్రతి తయారీలోను, ముద్రణలోనూ చాల తొందర కన్పిస్తుంది. విషయ లోపాలు, ముద్రణా దోషాలు తత్ఫలితాలు. అచ్చు బాగుంది. ఉపయుక్త గ్రంథసూచి, పదసూచికలున్నాయి, ఈ గ్రంథం విశ్వవిద్యాలయాలలో ఉన్నతస్థాయి (ఎం ఏ ,ఎం ఫిల్.,పిహెచ్.డి.) లో తెలుగు అధ్యయనం చేసే విద్యార్థులకూ, పరిశోధకులకూ, బోధకులకూ, కైపోత్తంగా మన గలదు. సాహిత్య క్షేత్రాంచలాలలో త్రిమ్మరు నాలాంటివారికీ ఉపయోగపడుతుంది. ఇట్టి ఉత్తమ సాహిత్య విమర్శక గ్రంథాన్ని ప్రచురించిన "యువభారతి" వారభినందనీయులు. శ్రీ సుబ్రహ్మణ్యం గారి కృషి ప్రశంసనీయం.

**శ్రీ సద్దేరాంబు తిరుమలరావు**

# ప్రొటెక్టుం సెల్ఫ్ ఎంప్లాయిడ్ పెజెంట్స్ అండ్ ట్రైబల్ పీపుల్స్

[ఆచార్య రంగా (ఎం. పి.). ప్రచురణ : కిసాన్ పబ్లికేషన్స్, ఇండియన్ పెజెంట్స్ ఇన్‌స్టిట్యూట్, నిడుబ్రోలు-522123 (ఆంధ్ర) (1983 మే), పుటలు : 118. వెల : 30 రూ॥లు. సంపాదకులు : శ్రీమతి కె. వి. పుష్పకుమారి, వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; డాక్టరు కె. యల్. నరసింహారావు (రీడరు), వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి; సి. అమరయ్య, పి. బి. యన్. కాలేజి, నిడుబ్రోలు; పి, రాజగోపాల్ నాయుడు, (ఎం. పి.) రూరల్ పీపుల్స్ ఫెడరేషన్, న్యూఢిల్లీ.]

ప్రకాశం, పట్టాభి, ఆచార్యరంగా - ఆంధ్ర రాజకీయాలకు ఆదిపురుషులు, త్రిమూర్తులు. వీరిలో మిగిలిన వృద్ధమూర్తి ఆచార్య రంగా. ఒక విషయం నిర్వివాదం. ఆయన వాదాలతో, అభిప్రాయా లతో పూర్తిగా ఏకీభవించలేక పోయినా, రైతుల విషయమై ఆయన శ్రద్ధాభక్తులు, దానికోసమై ఆయన తపనా అనన్యసామాన్యాలు.

సంపాదకులు తమ 'నోట్'లో ఎలాచిన్నరైతులకు శ్రీమతి ఇందిరా గాంధి 20 సూత్రాల కార్యక్రమం తగిన రక్షణఇస్తుందీవివరించారు.

ఈ వ్యాసాలు ముఖ్యంగా అచార్యరంగా రాజ్యాంగసవరణలు 17-19 మీద జరిపిన పోరాటం, ఆయన ఉపన్యాసాల సంకలనం. రెండవ ముఖ్య ఉపన్యాసం, ఆయన 1981 డిసెంబరు 28న గ్రామీణ ఆర్థిక సమస్యల గురించి న్యూఢిల్లీలో ఇచ్చిన రాజేంద్రప్రసాద్ స్మారక ఉపన్యాసం, మూడవది గుంటూరులో రాజీవ్‌గాంధీ ప్రారం భించిన కిసాన్-ఖేత్-మజ్దూర్ యువకుల సభలో 1982 ఫిబ్రవరి 3 నాటి ప్రారంభోపన్యాసం, నాల్గవది శ్రీమతి గాంధీ జన్మదినాన 1982 నవంబరు 19 నాటి ఉపన్యాసం.

వీటిల్లో మనకు వెన్నెలకంటి రాఘవయ్య, కావూరు వెంకయ్య, మందేశ్వర శర్మ, పుసులూరి కోదండరామయ్య, జైపాల్‌సింగులు వినపడతారు.

ఆచార్యరంగాను మంత్రివర్గంలోచేరమనినెహ్రూఆహ్వానించారా.

నాగపూర్ ఎ. ఐ. సి. సి. సహకార వ్యవసాయాన్ని గురించి తీర్మానించిన తరువాత తాను కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ కార్యదర్శి పదవికి రాజీనామా సమర్పించాననీ, అప్పుడు నెహ్రూ తనను పిలిపించారని ఇలా అంటారు ఆచార్య రంగా : "త్రైస్ హి అఫర్‌డ్ సీట్ ఇన్ హిజ్ కేబినెట్, ఒన్స్ యాజ్ ఎ ఛాలెంజ్, లేబర్ యాజ్ ఎ క్రామేడ్లీ గెస్చర్. ఎవ్వెరి టైం ఐ హాడ్ టు అబ్‌టెయిన్ ఫ్రం అగ్రీయింగ్ టు జాయిన్ హిజ్ కాబినెట్ బికాజ్ అవర్ డిఫరింగ్ యాటిట్యూడ్స్ టు వర్డ్స్ పెజెంట్సు రోల్ ఇన్ అవర్ నేషనల్ ఎకానమీ ప్రూవుడ్ టుబి టూ గ్రేట్ యాన్ అబిసికిల్" (పుట 18)

**శ్రీ కాకుమాను తారానాథ్**

...Estates (Private) Ltd., by S Radhakrishna at the Andhra Patrika ... Vijayawada. Phones : 75667 & 61247